**ANDHRA KALADARSHINI**
A Contemporary Andhra Artists,
Sculptors & Cartoonists Introductory
and Essays

Edited By **KALASAGAR**

Title Design ashok c

Published by AASCA
First Edition July 2001
Price Rs 85/-

For Copies

Gen Secretary, AASCA
KALASAGAR
21 11/1-1, Madhuranagar
Vijayawada - 520 011

President, AASCA
Sunkara Chalapati Rao
T-62, Gandhigram P O
Visakhapatnam - 5

Published with the financial assistance of
Potti Sree Ramulu Telugu University, Hyderabad

Type Setting data-tek 0866 438852

Printed at Bharati Offset Printers, VJA-2



చలసాని ప్రసాదరావు

# మనం...మనం

కళాకారులదంతా ఒక ప్రత్యేక సమాజం సృజనాత్మకత సదా వెల్లివిరి యటం దాని లక్షణం! అందులో చిత్ర – శిల్ప కళారంగం మరింత వైవిధ్య భరితమైనది మానసిక శ్రమ, ఘర్షణ, ఆలోచన, అధ్యయనం లెకుండా కళ – కళాకారులు నిలబడలేరు

"ఆర్టిస్టు" లంటే అకడెమిక్ అలవాట్ల ప్రకారం పెయింటింగులు, శిల్పాలు రూపొందించే వారు మాత్రమే నన్నట్లుంది పరిస్థితి ఏ చిత్రకళా సంస్థవారి చిత్రకళా ప్రదర్శనకైనా, అకాడెమీ, యూనివర్శిటీ కళా ప్రదర్శనకైనా వెళ్తే అక్కడ ప్రముఖంగా కనుపించేవి పెయింటింగులు, అలంకార ప్రాయంగా రెండు మూడో, నాలుగయిదో శిల్పాలే అంత వరకే గాని మిగతా విభాగాలకు చెందినవేవీ దర్శించలేం, అలాంటి చోట్ల ఓ రకంగా గ్రాఫిక్స్ అంటున్నవి కూడా పెయింటింగులే

ఈ రెండు లేదా మూడు విభాగాలే గాక చిత్రకళా రంగంలో ఇంకొన్ని కూడా ఉన్నా వాటిని దూరంగా ఉంచటం కనిపిస్తుంది ఇది అన్ని చోట్లా ఉన్నదే

కార్టూనిస్టులు, కథలకు, కవితలకు బొమ్మలు వేసేవారు, బ్యానర్లు, పోస్టర్లు, అడ్వర్టయిజింగ్ డిజైన్స్ లాంటివి వేసేవారు ఎవరూ అసలు చిత్రకారులే కాదన్నట్లుందీరంగం లోని వాతావరణం కాని ప్రజలకు లేదా ప్రేక్షకులకు సన్నిహితంగా ఉన్నది వీరే వీరి చిత్రాల గురించి తెలిసినంతగా పేరు మోసిన పెయింటర్లు, శిల్పుల గురించి ప్రజలకు అంతగా తెలియని పరిస్థితి ఈనాడున్నది ఇందుకు ఎవరు గానీ చింతించాల్సిందేమీ లేదు జరగవలసినదల్లా ఆయా విస్మృత విభాగాలకూ కూడా తగిన గుర్తింపు ఉండేలా కృషి చేయటం

గ్రాఫిక్ ఆర్టిస్టులు, ఆర్ట్ డైరెక్టర్లు, డ్రాయింగ్ టీచర్లు, పత్రికలలోని కార్టూనిస్టులు, కథాచిత్రాలు వేసేవారు, అడపా దడపా మాత్రమే అయినా ఒక స్థాయిగల చిత్రాలు వేసేవారు అందరూ కళాజీవులే తరతమభేదాల్తో అందరిదీ సృజనాత్మక సృష్టే

ఇప్పుడు వీటికి తోడుగా యానిమేషన్, మల్టీమీడియా రంగాలు ప్ర[illegible] వచ్చాయి [illegible] కార్టూన్ సినిమాలు తీసే






సంస్థలు ఇక్కడి మన చిత్రకారుల చేతపని చేయించుకుని వారు వేసిన కార్టూన్లు అక్కడికి తీసుకెళ్లి ఉపయోగించుకుంటున్న పరిస్థితి ఉన్నది మన యువచిత్రకారుల్లో ఈ విభాగంలో ఇప్పటికే నైపుణ్యం సాధించినవారు చెప్పుకోదగిన సంఖ్యలోనే ఉన్నారు

వారందరి గురించిన వివరాలూ ఒకచోట చేర్చటం అనేది ఒక బృహత్ ప్రయత్నం ముమ్ముందు అందరూ ఒక వేదిక మీద చేరి, తమ కళకు మెరుగులు దిద్దుకునే అనుభవాల్ని సంతరించుకునేందుకు ఈ డైరెక్టరీ ఒక సాధనంగా ఉపకరిస్తుంది మనం చాలా మందిమి ఉన్నాం "మనం చాలా చేయగలం, సాధించగలం" అనే ఉత్సాహానికి నాంది పలుకుతుంది సుంకర చలపతిరావుగారు గతంలోనే ఈ ప్రయత్నం పరిమిత స్థాయిలోనే అయినా చేసి ఉన్నారు దానికి పునర్ముద్రణ కూడా వచ్చిందంటే దాని అవసరం ఏమిటో అర్థమవుతుంది

ఇపుడాయన ప్రోద్బలంతోనే కళాసాగర్‌గారు మరింత విస్తృతస్థాయిలో ఈ "ఆంధ్ర కళాదర్శిని" వెలువరిస్తున్నారు తొలి ప్రయత్నాలెపుడూ పరిమితుల్లోనే ఉంటాయి కాని, అవి చూపిన బాటలో తర్వాత కాలంలో మరింత సమగ్ర సంకలనాలు రాగలుగుతాయి పదిహేడేళ్ల క్రితం కేంద్ర సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన రచయితల డైరక్టరీ 725 పేజీలుంటే, తాజాగా వెలువరించిన రెండు సంపుటాలూ కలిసి 1500 పేజీలున్నాయి మన ఈ డైరెక్టరీ కూడా అంతే! చిన్న ప్రయత్నాలే బృహత్ సాధనలకు నాంది

ఈ దృష్ట్యా 'ఆస్కా' తరపున కళాసాగర్‌గారు ప్రచురించిన ఈ "ఆంధ్ర కళాదర్శిని" ఆహ్వానించదగినది ప్రచురణ కర్తలు ప్రత్యేకించి అభినందనార్హులు ■

## వుడయార్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ (రిజిష్టర్డు)

A.P.H.B.Colony, MIG. 209, TADEPALLIGUDEM - 534101 (AP)

ఫౌండర్ - డి. సత్యలింగ వుడయార్



రెక్టార్ :

ఆచార్య డి. శ్రీనాధ రత్నశిల్పి వుడయార్, D.F.A.C.

(VISWABHARATHI UNIVERSITY)

# అభినందనలు

**ఆం**ధ్రదేశంలో కళలకు, కళాకారులకు కొదువలేదుగాని, వారి మనుగడకు మాత్రం కొరత ఏర్పడి నానాకష్టనష్టములతో, బాధలతో రోడ్ల పంచన, ఆరుబయట జీవనము సాగించాల్సిన పరిస్థితిలోనున్నారు అలా అని కళాకారులందరిదీ అదే పరిస్థితి అని కాదు, మెజారిటీ కళాకారుల జీవితాల గురించి మాత్రమే ప్రస్తావించాను ఆంధ్రా ఆర్టిస్టు్స, స్కల్ప్చర్స్ అండ్ కార్టూనిస్టు్స అసోసియేషన్ (ఆస్కా) ను స్థాపించి, తద్వారా ఎక్కడెక్కడో మారుమూలల్లో, మరుగునపడి బరువుభారంతో జీవితములు గడుపుతున్న ఎందరెందరో్ని "ఆంధ్రకళాదర్శిని" రూపంలో వెలికితీసి, సాటి కళాకారుల్లో కళాకారులకే గాక, యావదాంధ్రావనికీ పరిచయం చేస్తూ, వెలుగులోకి తీసుకు వస్తున్నందుకు, 'ఆస్కా' గౌరవ అధ్యక్షుడిగా ఈ బృహత్ కార్యంలో నేనూ ఒక భాగమైనందుకు సంతోషిస్తూ అధ్యక్షులు సుంకర చలపతిరావుగారిని, సెక్రటరీ కళాసాగర్‌గారిని తదితర సభ్యులందరినీ పేరుపేరునా హృయదపూర్వకంగా అభినందిస్తున్నాను భవిష్యత్తులో ఈ సంస్థ కళాకారులకు మిక్కిలిగా ఉపయోగపడి, వారి జీవిత గమనమునకు దోహదకారి కాగలదని ఆశిద్దాం

కళాభివందనలతో

ఆచార్య దే శ్రీనాధ రత్న శిల్పి వుడయార్
గౌరవ అధ్యక్షుడు–'ఆస్కా'



# నా మాట

తెలుగు గడ్డపై పుట్టి, తెలుగు సంస్కృతిని తమ కళాఖండాల ద్వారా విశ్వవ్యాప్తం చేస్తున్న చిత్ర, శిల్ప, కార్టూనిస్టులందర్ని ఒక చోటకు చేర్చి, మీకందివ్వాలన్న ప్రయత్నమే 'ఈ ఆంధ్ర కళాదర్శిని' ఈ గ్రంధంలో సమకాలీనాంధ్ర కళాకారుల, కళాసంస్థల, కళా విమర్శకుల సమాచారాన్ని సంక్షిప్తంగా అందచేస్తున్నాం ఇది మా 'ఆస్కా' తొలియత్నం మా ఈ ఆలోచన్ని అచరణలో పెట్టడానికి, సంవత్సరం వ్యవధి పట్టింది మేము అడిగిన వెంటనే ఎందరో చిత్రకారులు, శిల్పులు, కార్టూనిస్టులు తమ వివరాల్ని అందించి సహకరించారు కొందరు అభిమానులు అడక్కుండానే గ్రంధముద్రణకు ఆర్థిక సహాయం అందించారు కళాకారులకి, కళాభిమానులకి, రచయితలకి మా దండాలదండ! భవిష్యత్తులో మేము ప్రచురించబోయే 'కళా గ్రంధాల'కు ఇదే విధమైన సహాయసహకారాలు అందిస్తారని ఆశిస్తూ

**సుంకర చలపతిరావు**
అద్యక్షులు 'ఆస్కా'



ఉగ్గుపాలతో

ప్రేమను పంచి

ఈ కళాసాగరంలో

చిరుబింధువుగా నిల్పిన

అమ్మకు

కళాసాగర్

# 'ఆస్కా' తొలిఅడుగు ...

**ఆం**ధ్రప్రదేశ్‌లో చిత్రకారులు, శిల్పులు, కార్టూనిస్టులు వందలాది మంది ఉన్నప్పటికీ, ఆయాచిత్రకారుల వివరాలు గాని, చిరునామాలు గాని తెలుసుకోవాలనుకుంటే చాలా కష్టం వీరిలో పరస్పర పరిచయాలున్న కళాకారులూ తక్కువే ఆంధ్రా ఆర్టిస్ట్సు, స్కల్ప్‌టర్స్ అండ్ కార్టూనిస్ట్సు అసోసియేషన్ (ఆస్కా) ద్వారా తొలి తెలుగు చిత్ర, శిల్ప మరియు కార్టూనిస్టుల పరిచయగ్రంధం చిరునామాలతో సహా ప్రచురించే ప్రయత్నం చేసాం సాహసోపేతమైనప్పటికీ 'ఆంధ్ర కళాదర్శిని' పేరుతో మీ ముందుకు తీసుకొచ్చాం ఎంత వరకు సఫలీకృతం అయ్యాం అనేది చెప్పాల్సింది మిరే

రాష్ట్రంలోనున్న గౌరవనీయ కళాకారులందరిని వ్యక్తిగతంగా కలవలేకపోయాం డైరెక్టరీలో పరిచయం కాబడని కళాకారులందరికీ ముందుగా క్షమాపణలు తెలియజేస్తూ పత్రికాప్రకటనలకు స్పందించి తమతమ బయోడెటాలను అందించి అన్ని విధాల సహకరించిన వారందరికి పేరుపేరునా కృతజ్ఞతలు తెలియజెస్తున్నాం ఈ డైరెక్టరీలో ప్రచురించిన రెండువందల డెబ్భైమంది ఆర్టిస్టులే మనరాష్ట్రంలో ఉన్నారని మా భావనకాదు ఇంకా అనేక వందలమంది కళాకారులున్నారన్నది అక్షరసత్యం మీరు కూడా మీ బయోడేటాలను మాకు అందించినట్లయితే భవిష్యత్తులో దీనిని మరింత విస్తృతపరచి పునఃర్ముద్రించాలన్నది మా ఆకాంక్ష!

ఈ గ్రంధముద్రణకు ఆర్ధిక సహాయం అందించిన 'ఆస్కా' గౌరవ అధ్యక్షులు శ్రీ వుడయార్జీగార్కి, ముందుమాట వ్రాసిచ్చిన శ్రీ చలసాని ప్రసాదరావుగార్కి, సకాలంలో వ్యాసాలు వ్రాసిచ్చిన వ్యాసరచయితలకు, వ్యాసాల పున ర్ముద్రణకు అనుమతిచ్చిన పత్రిక సంపాదకులకు, అభినందనలు, ప్రకటనల రూపంలో ప్రోత్సహించిన కళాభిమానులకు టైప్‌సెటింగ్ చేసిన శ్రీమతి విజయగార్కి, అందంగా పేజ్ మేకప్ చేసిచ్చిన అశోక్‌గార్కి, 'ఆంధ్రకళాదర్శిని' ఎడిటింగ్ బాధ్యతలు నాకప్పగించిన 'ఆస్కా' కార్యవర్గ సభ్యులకు, వెన్నుతట్టి ప్రోత్సహించిన అధ్యక్షులు సుంకర చలపతిరావుగార్కి, బయోడేటాల సేకరణలో సహకరించిన ఉపాధ్యక్షులు సన్నాలగార్కి, ఇంకా అజ్ఞాతంగా ప్రోత్సహించిన ప్రతీ ఒక్కరికి ఈ సందర్భంగా నా కృతజ్ఞతాభివందనాలు

**కళాసాగర్**
ఎడిటర్

జనరల్ సెక్రటరీ – ఆంధ్రా ఆర్టిస్ట్సు స్కల్ప్‌టర్స్ అండ్ కార్టూనిస్ట్సు అసోసియేషన్

## కళావనంలో ...

# ఆంధ్రకళాదర్శిని

ఆంధ్రకళాదర్శినిలో ప్రచురితమైన అంశాలకు ఆయా కళాకారులు, వ్యాసరచయితలే బాధ్యులు



## అప్పారావు ఎ

పూర్తి పేరు ఆశపు అప్పారావు (చిత్రకారుడు) పుట్టిన తేది 25 జులై 1944 తల్లిదండ్రులపేర్లు భాగ్యలక్ష్మి, సోమరాజు పుట్టిన ఊరు, జిల్లా లింగంపర్తి, తూ॥గో॥ అభిమాన చిత్రకారుడు మైఖేలాంజిలో ఇష్టమైన శైలి అన్నీ విద్యార్హతలు ఎస్ ఎస్ ఎల్ సి ఫైన్ ఆర్ట్స్ డిప్లోమా మరియు టి టి సి హైయ్యర్ (4 సం॥ డిప్లోమా దామెర్ల రామారావు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్, రాజమండ్రి) బహుమతులు రాష్ట్ర జాతీయ స్థాయిలో బంగారు పతకములు అనేక కళా సంస్థలతో సన్మానములు పొందుట, ఉత్తమ రాష్ట్ర ఉపాధ్యాయుడుగా ముఖ్యమంత్రి ఎన్ టి రామారావు గారిచే సన్మానము పొందుట(1987) (1987) టెన్ అవుట్ స్టేన్‌డింగ్ పర్సన్స్ ఇన్ స్టేట్ గుర్తింపు వృత్తి డ్రాయింగు మాష్టరుగా వుంటూ 1977లో అనకావల్లి ఆర్ట్స్ అకాడమీ స్థాపించుట వరదా వెంకట రత్నం ఆర్టు స్కూలు కూడ ఏర్పాటు చేయుట హాబీలు లైట్ మ్యూజిక్ (పాటలు పాడుట, వద్యములు చదువుట) కళాకారుడుగా అనుభూతులు అనేక ప్రముఖ చిత్రకారులతో ఆంధ్ర మరియు ఇతర రాష్ట్రాలలో ఆర్టిస్టు కేంప్స్‌లో పాల్గొని అందరి అభిమానమును పొందుట కన్న సంతోషం ఇంకేముంది



A Appa Rao
D No 5-190,
Sarada Nagar,
Anakapalle,
Visakha Dt,
Pin 531 001



## అశోక్ గోకా

పూర్తి పేరు గోకా ఆశోక్ (చిత్రకారుడు) పుట్టిన తేది 12 మే 1970 తల్లిదండ్రులు లక్ష్మి, చంద్రయ్య పుట్టిన ఊరు జిల్లా నర్సంపేట, వరంగల్ అభిమాన చిత్రకారుడు విన్సెంట్ వాంగో, రోడిన్ ఇష్టమైన శైలి పెయింటింగ్ & గ్రాఫిక్స్ విద్యార్హతలు ఎస్ ఎస్ సి ఫైన్ ఆర్ట్స్ బి ఎఫ్ ఏ (పెయింటింగ్) డ్రాయింగ్ టి టి సి హైయర్ బహుమతులు దామెర్ల రామారావు అవార్డ్ –కె సి పి, అమలాపురం, మరికొన్ని, దేశవ్యాప్తంగా జరిగిన అనేక చిత్రకళా ప్రదర్శనలను వర్కుషాపులలోను పాల్గొన్నాను

G Ashok, Art Master,
JawaharNavodaya
Vidyalaya,
Peddapuram, E G Dt,
Pin 533 437
Hello 42338

## అనూరాధ వై



Y Anuradha
W/o Y Kishore Kumar
Chartered Accountant,
Plot No 17, Timmarusu St,
Vijayawada, Hello 545383

పూర్తి పేరు వై అనూరాధ (చిత్రకారిణి) పుట్టిన తేది 19 మార్చి 1962 తల్లిదండ్రులు పరమేశ్వరి, కృష్ణమూర్తి పుట్టిన ఊరు, జిల్లా విశాఖపట్నం అభిమాన చిత్రకారుడు సాలవాదర్ డాలీ, హెన్రీమూర్ ఇష్టమైన శైలి వుడ్‌కట్ ప్రింట్స్ విద్యార్హతలు బి టెక్ కెమికల్ ఇంజనీరింగ్ ఫైన్ ఆర్ట్స్ వి ఎఫ్ ఏ పెయింటింగ్, యం ఎఫ్ ఏ(ప్రింట్ మేకింగ్) (గ్రాఫిక్స్ బహుమతులు నేషనల్ స్కాలర్‌షిప్, నేషనల్ ఎగ్జిబిషన్, ఢిల్లీలో వుడ్‌కట్ ప్రింట్ సెలక్ట్ అయింది వృత్తి ఆర్ట్ టీచర్ (కేంద్రీయ విద్యాలయం, విజయవాడ) హాబీలు వంట చేయడం, పూజలు చేయడం, టీచింగ్, రీడింగ్ స్పిర్ట్యువల్ బుక్స్ కళాకారుడిగా అనుభూతులు ప్రతిమనిషీ కళాకారుడే

## అక్కల ఆర్ కె



పూర్తి పేరు అక్కల రామకృష్ణా రావు (శిల్పి, చిత్రకారుడు), పుట్టిన తేది 1 జనవరి 1959, తల్లితండ్రులు కోటిరత్నమ్మ, రామయ్య, పుట్టిన ఊరు/జిల్లా తెనాలి,గుంటూరు, అభిమాన చిత్రకారుడు డి పి రాయ్ చౌదరి, విద్యార్హతలు ఎస్ ఎస్ సి, ఫైన్ ఆర్ట్స్ శిల్పి (మోడలింగ్), డ్రాయింగ్ డిజైనింగ్, పెయింటింగ్ హైయ్యర్ గ్రేడ్(మద్రాసు), బహుమతులు ప్రధానమంత్రి, రాష్ట్రముఖ్య మంత్రులు, వివిధ శాఖల మంత్రులు, అకాడమీలు, ప్రజలనుంచి అనేక గౌరవ సన్మానాలు అందుకున్నాను, వృత్తి కాంస్య విగ్రహాలు, వెండి, పంచలోహ విగ్రహాలు, హాబీలు మోడ్రన్ శిల్పాలు తయారు చేయడం, కళాకారునిగా అనుభూతులు రెండు సంవత్సరములకు పైగా అమెరికాలో వుండి మన శిల్ప కళను అక్కడ అందించడం

A RAMA KRISHNA RAO,
16 8 12,
Akkala Bhasavaiah St,
Main Road, Tenali,
Pin 522 201
Hello 25500



## అప్పారావు జి



పూర్తి పేరు  గేదెల అప్పారావు(చిత్రకారుడు) పుట్టిన తేది  15 జూన్ 1951 తల్లిదండ్రులపేర్లు  సూరమ్మ, గంగన్న పుట్టిన ఊరు, జిల్లా ఆల్లూరు, కృష్ణా అభిమాన చిత్రకారుడు  డా॥ సంజీవదేవ్ ఇష్టమైన శైలి  మైక్రో ఆర్ట్ విద్యార్హతలు  ఎస్ ఎస్ ఎల్ సి  టి టి సి  ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయర్ గ్రేడ్ బహుమతులు రాష్ట్ర, జాతీయ స్థాయిలో అనేక చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించి, ప్రముఖులచే ప్రశంసలు, సన్మానాలు వృత్తి  గ్రేడ్ 1 డ్రాయింగ్ టీచర్ (జైహింద్ హైస్కూల్, మచలీపట్నం) హాబీలు  కవితలు వ్రాయడం, మొక్కల పెంపకం కళాకారుడుగా అనుభూతులు  నా ముప్పైయ్యేళ్ళ కళా జీవితంలో నా చిత్రాలు చూచి ఆనందించే ప్రేక్షకుల ఆనందాన్నే స్వీయానందంగా భావించాను

G  Appa Rao
Micro Artist
Jaihind High School
Machilipatnam
Pin  521 001
Hello  22642



సార గింజలపై చిత్రించిన దేవతామూర్తులు

## అబ్దుల్లా



పూర్తి పేరు  షేక్ అబ్దుల్లా (చిత్రకారుడు, కమర్షియల్ డిజైనింగ్) పుట్టిన తేది  24 నవంబరు 1966 తల్లిదండ్రులపేర్లు  ఖుదాన్‌బీ, మస్తాన్‌సాహెబ్ పుట్టిన ఊరు, జిల్లా  రమణక్క పేట, కృష్ణా అభిమాన చిత్రకారుడు  మైఖెలాంజిలో, బాపు శ్రీకర్ ఇష్టమైన శైలి  కంప్యూటర్ డిజైనింగ్, 3డి యానిమేషన్ విద్యార్హతలు  ఇంటర్మీడియెట్ ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయర్, టి టి సి  సర్వీసు  1986-1991 ఆంధ్రపత్రికలో ఆర్టిస్ట్‌గా, 1992-1996 ఆంధ్రజ్యోతిలో ఆర్టిస్టుగా వృత్తి  ఫ్రీలాన్స్ ఆర్టిస్టు, కంప్యూటర్ డిజైనింగ్ హాబీలు  మ్యూజిక్, క్రికెట్, సినిమా రీడింగ్ కళాకారుడిగా అనుభూతులు  కళాకారుడిగా ఉన్నందుకు ఆనందిస్తాను

Abdulla
D No 26 15-12,
Udutavari St,
Gandhinagar,
Vijayawada - 3
Hello  579313

## అంజన్




V V Apparao
C/o Kendriya Vidyalaya No 1
Satyanarayanapuram,
Vijayawada 500 011
Hello 535999(R)


పూర్తి పేరు వెంకట అప్పారావు వి(కార్టూనిస్టు, రేడియో ఆర్టిస్టు, టి వి ఆర్టిస్టు) పుట్టిన తేది 5 ఏప్రిల్ 1969 తల్లిదండ్రులు సరోజిని, సీతారామమూర్తి పుట్టిన ఊరు, జిల్లా దేవరాపల్లి, విశాఖ అభిమాన చిత్రకారుడు/ కార్టూనిస్టు మల్లిక్, బాపు, శ్రీధర్ ఇష్టమైన శైలి కార్టూనిస్ట్‌గా మరియు నటుడిగా విద్యార్హతలు ఎం యస్‌సి, బి ఇడి ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి బహుమతులు 1993లో అంతర్ విశ్వవిద్యాలయాల యువజనోత్సవాలలో కార్టూనిస్ట్ విభాగానికి నాగార్జున యూనివర్శిటీ ప్రతినిధి, మనకున్న కార్టూనిస్టులలో స్వంత శైలిగల కార్టూనిస్టులలో శ్రీ అంజన్ ఒకరని ప్రముఖ కార్టూనిస్టు శ్రీ సత్యమూర్తిగారు 1998 ఆంధ్రభూమి వారపత్రికలో ప్రశంసించడం, కార్టూనిస్టుగా, నటుడిగా, యాంకర్‌గా వివిధ కార్యక్రమాలలో చూపిన ప్రతిభాపాటవాలకుగాను అటవీశాఖ మరియు శాస్త్రసాంకేతిక రంగ మంత్రి వర్యులు శ్రీ సిహెచ్ అయ్యన్నపాత్రుడు ద్వారా 2001లో సన్మానం వృత్తి టీచర్ హాబీలు నటన, కార్టూన్స్ వేయటం కళాకారుడిగా అనుభూతులు పదిమంది మన స్మృల్లో చిరస్థాయిగా నిలచి పోయేవాడే కళాకారుడు అని గట్టిగా విశ్వసించేవాణ్ని



## అనిల్ కుమార్




P Anil Kumar
H No C/New 9
Shankarnagar
Nizamabad Dist,
Pin 503 180
Hello 23719 (R)


పూర్తి పేరు పి అనిల్ కుమార్ (చిత్రకారుడు) పుట్టిన తేది 2 డిసెంబరు 1953 తల్లిదండ్రులు జి నాయుడు ఇష్టమైన శైలి పలకలపై పెయింటింగ్స్ చిత్రించడం విద్యార్హతలు ఎస్ ఎస్ సి, ఐ టి ఐ ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి వృత్తి క్లర్క్ హాబీలు గేమ్స్, పూల మొక్కల పెంపకం

## అక్కల



A RAMESH
S/o Mangaiah
Akkalavari Street,
Main Road,
Tenali - 522 201

పూర్తి పేరు అక్కల సత్య వీర రమేష్ (చిత్రకారుడు, శిల్పి), పుట్టిన తేది 26 ఏప్రిల్ 1975, తల్లితండ్రులు కోటిరత్నం, మంగయ్య, పుట్టిన ఊరు/జిల్లా తెనాలి,గుంటూరు, అభిమాన చిత్రకారుడు/కార్టూనిస్టు దేవిప్రసాదరామచౌదరి, సంజీవదేవ్, ఇష్టమైన శైలి క్లే మోడలింగ్ (మృణ్మయశిల్పం), విద్యార్హతలు 10వ తరగతి, ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ (టి టి సి)లో ఉత్తీర్ణత, ఫ్రీ హ్యాండ్, క్లే మోడలింగ్ డిజైన్, పెయింటింగ్స్‌లో (హైయ్యర్ గ్రేడ్), బహుమతులు బందరులో (చిత్రకళా సంపద), లలితకళా అకాడమీ (ఢిల్లీలో), వృత్తి శిల్పకళ, హాబీలు చిత్రలేఖనం, భరతనాట్యం, కళాకారునిగా అనుభూతులు మా శిల్పశాలలో అనేక ప్రసిద్ధి గాంచిన (సంస్థలకు) చేసి ఇచ్చిన శిల్పములు వృత్తి పరమైన కళాపరమైన సంతృప్తి

## అనుపమ



M Suryaprakasha Rao,
S/o Satyanarayana,
D No 7 109,
Ramarajulanka, E G Dist,
Pin 533253

పూర్తి పేరు మేడిచర్ల సూర్యప్రకాశరావు (కార్టూనిస్టు, రచయిత) పుట్టిన తేది 10 ఫిబ్రవరి 1965, తల్లిదండ్రులు జయలక్ష్మి, సత్యనారాయణ, పుట్టిన ఊరు, జిల్లా రామరాజులంక, తూ॥గో॥ అభిమాన కార్టునిస్టు/ఆర్టిస్టు బాలి, బాపూ, ఇష్టమైన శైలి వ్యవహారికంలో కార్టూన్స్ గీయటం, శారీడిజైన్స్, చిత్రములు గీయటం, విద్యార్హతలు బి ఏ, ఫైన్ ఆర్ట్స్ బాపూ ఆర్ట్ స్కూల్ మద్రాసులో యూనివర్సల్ డ్రాయింగ్‌లో ఫస్ట్‌క్లాస్ సర్టిఫికెట్ పొందటం, బహుమతులు 1993 సావిత్రిస్మారక అవార్డు (నేను రాసిన కథకు), 1993 సావిత్రి స్మారక అవార్డు (కవితకు), వృత్తి వ్యవసాయం, హాబీలు కథలు , కవితలు, జోక్స్, వ్యాసాలు వ్రాయటం, చిత్రలేఖనం, కార్టూన్స్ గీయటం, పత్రికాపఠనం, కళాకారుడిగా అనుభూతులు కొత్తపట్నం-కళాసాహితి వారు నాకు చేసిన సన్మానం నాకొక గొప్ప అనుభూతి

## అప్పారావు అనుపోజు



A APPA RAO
7 276, Prasanthi Nagar,
Gopalapatnam,
Visakha 530 023,
Hello 520069

పూర్తి పేరు అనుపోజు అప్పారావు (కార్టూనిస్టు), పుట్టిన తేది 14 సెప్టెంబరు 1952, తల్లిదండ్రులు అమ్మాజి, వరప్రసాదరావు, పుట్టిన ఊరు, జిల్లా విశాఖపట్నం విద్యార్హతలు డి యం ఇ వృత్తి కాంట్రాక్టరు (రిపోర్టర్ ఆంధ్రభూమి) హాబీలు జర్నలిజం, కొత్తవిషయాలు పై ఆశక్తి కళాకారుడిగా అనుభూతులు సృజనాత్మక శక్తి కలిగి ఉండడమే

## అన్నవరం ఎ



A Annavaram
D No 1 5 4,
Gandhi Nagar
Anakapalle
Pin 531 001

పూర్తి పేరు అనుపోజు అన్నవరం (చిత్రకారుడు శిల్పి), పుట్టిన తేది 1 జూలై 1942 తల్లిదండ్రులు సన్యాసమ్మ, సత్యనారాయణ అభిమాన చిత్రకారులు ఎందరో మహానుభావులతో పాటు అశపు అప్పారావు గారు ఇష్టమైన శైలి శిల్పం, చిత్రలేఖనం విద్యార్హతలు ఎం కాం, ఎం ఫిల్, సాహిత్యరత్న ఫైన్ ఆర్ట్స్ శ్రీ ఎ అప్పారావు గారి వద్ద 2 సంవత్సరాలు ప్రత్యేక శిక్షణ బహుమతులు/పురస్కారాలు అనేక చిత్రకళా పోటీలలో, ప్రదర్శనలతోను, పాల్గొని బహుమతులు ప్రశంసలు పొందాను వృత్తి రిటైర్డ్ లెక్చరర్ ఇన్ కామర్స్ హాబీలు శిల్పం, పెయింటింగ్, బుక్‌రీడింగ్ కళాకారుడిగా అనుభూతులు ఎన్నో

## అప్పలస్వామి



K Ch Appala Swamy
H No 14 10 38A
Maharanipeta,
Visakhapatnam
Pin - 530 002

పూర్తి పేరు కె సిహెచ్ అప్పలస్వామి (చిత్రకారుడు) పుట్టిన తేది 15 నవంబరు 1930 పుట్టిన ఊరు/జిల్లా విజయనగరం అభిమాన చిత్రకారుడు అంట్యాకుల పైడిరాజు ఇష్టమైన శైలి మ్యూరల్ పెయింటింగ్స్ విద్యార్హతలు ఇ యస్ ఎల్ సి ఫైన్ ఆర్ట్స్ డిప్లోమా ఇన్ మ్యూరల్ పెయింటింగ్,(పైడిరాజు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్, విజయనగరం) బహుమతులు/పురస్కారాలు బెస్ట్ ఆర్టిస్టు చిత్రకళాపరిషత్ విశాఖ, 1996 ఆల్ ఇండియా ఫైన్ ఆర్ట్స్ సొసైటీ న్యూఢిల్లీ వారిచే సన్మానం వైస్ ప్రెసిడెంట్ లలితకళా పరిషత్ విశాఖ వృత్తి ఆంధ్రా మెడికల్ కాలేజి విశాఖలో ఫోటోగ్రాఫర్ కమ్ ఆర్టిస్టు(రిటైర్డ్) హాబీలు రచనలు కళాకారుడిగా అనుభూతులు ఎన్నో

## ఆర్ పి



P Ramu
Bhaggeswaram (P O)
Palakol Mandal
Pin 534 251

పూర్తి పేరు పొట్ల రాము (చిత్రకారుడు), పుట్టిన తేది 1 ఆగస్టు 1973, తల్లితండ్రులు మణెమ్మ, నరసింహ మూర్తి, పుట్టిన ఊరు/జిల్లా భగ్గేశ్వరం,పాలకొల్లు, ప గో అభిమాన చిత్రకారుడు పీటర్ పాల్ రూబెన్స్, వడ్డాది పాపయ్య, విద్యార్హతలు బి ఎస్ సి, బి ఇడి , వృత్తి టీచర్, హాబీలు పెయింటింగ్, పుస్తక పఠనం, కళాకారునిగా అనుభూతులు నేను సృష్టించిన కళాఖండాలకి లభించిన ప్రశంసలే కొండంత ఆనందాన్ని ప్రోత్సాహాన్ని ఇస్తాయి ఆ అనుభూతి మరువలేనిది

## ఆర్ వి ఆర్ వి ప్రసాద్



R V R V Prasad
Adarsha Nagar,
Konthamuru,
Rajahmundry - 3
Hello (0883) 52273

పూర్తి పేరు ఆర్ వి ఆర్ వి ప్రసాద్ (చిత్రకారుడు), పుట్టిన తేది 1 జులై 1966, తల్లిదండ్రుల పేర్లు లక్ష్మీదేవి, గోపాలాచార్యులు, పుట్టిన ఊరు, జిల్లా నర్సీపట్నం, విశాఖ, అభిమాన చిత్రకారుడు రాజా రవివర్మ, విద్యార్హతలు ఎస్ ఎస్ సి, ఐ టి ఐ(మెకానికల్ డ్రాయింగ్), ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయ్యర్, వృత్తి డ్రాయింగ్ టీచర్, హాబీలు వుడ్ కార్వింగ్, ఫొటోగ్రఫీ, కంప్యూటర్స్

## ఈశ్వర్



Ch Eswara Rao
D No 8-3-231/A/21
Sri Krishna Nagar,
Yousufguda
Hyderabad - 45
Hello 3541156

పూర్తి పేరు చలమూరి ఈశ్వర్ (చిత్రకారుడు) పుట్టిన తేది 29 మె 1965 తల్లిదండ్రులపేర్లు రామాయమ్మ, అప్పాలస్వామి పుట్టిన ఊరు, జిల్లా పెనుగొండ, ప॥గో॥ అభిమాన చిత్రకారుడు యస్ యం కేతా ఇష్టమైన శైలి రవివర్మ పెయింటింగ్ శైలి విద్యార్హతలు ఇంటర్మీడియట్ ఫైన్ ఆర్ట్స్ యస్ యం కేతాగారి స్టూడియోలో 3 సం॥శిక్షణ బహుమతులు అందరి మన్ననలు పొందడం వృత్తి ఫ్రీలాన్స్ ఆర్టిస్టు (పోట్రయిట్స్) హాబీలు టి వీ చూడడం, ఫోటోలామినేషన్ కళాకారుడుగా అనుభూతులు వృత్తిలో పూర్తి సంతృప్తి

## ఉదయశంకర్ సిహెచ్.



Ch Udayasankar
D No 2 93, Plot No 7
Chinmaya Mission Road
Ramavarappadu,
Vijayawada 18
Hello 0866 841566

పూర్తి పేరు చల్లా ఉదయశంకర్ (చిత్రకారుడు) పుట్టిన తేది 1 ఏప్రిల్ 1961 తల్లిదండ్రులపేర్లు కోటి చంద్రమ్మ, కోటి వీరయ్య పుట్టిన ఊరు, జిల్లా భీమవరం, పశ్చిమ గోదావరి అభిమాన చిత్రకారుడు లియోనార్డో డావిన్సీ డాలీ ఇష్టమైన శైలి కథలకు బొమ్మలు వేయటం విద్యార్హతలు యం యస్ సి, పి జి డి పి ఎ ఫైన్ ఆర్ట్స్ సయ్యంకృషి, తండ్రి శ్రీ చల్లా కోటి వీరయ్యగారి ప్రోత్సాహంతొ బహుమతులు అంకాల ఆర్ట్ అకాడమీ భీమవరం రోటరీ క్లబ్, భీమవరం మరియు వివిధ ఆర్ట్ అకాడమిల ద్వారా ప్రథమ మరియు ద్వితీయ బహుమతులు సాధించుట వృత్తి అసిస్టెంట్ సూపరిన్‌టెన్‌డెంట్ ఎన్ ఎస్ ఎస్ ఓ (ఎఫ్ఓడి) హాబీలు ఫోటోగ్రఫీ కళాకారుడుగా అనుభూతులు ఎన్నో

# ఉల్చి



పూర్తి పేరు రెడ్డిబోయిన కృష్ణమూర్తి (చిత్రకారుడు, శిల్పి, కవి) పుట్టిన తేది 1940 తల్లిదండ్రులపేర్లు శేషమ్మ కోటయ్య పుట్టిన ఊరు, జిల్లా ఉల్చి, ప్రకాశం అభిమాన చిత్రకారుడు ఎందరో మహానుభావులు ఇష్టమైన శైలి వాష్ పెయింటింగ్, టెంపెరా పెయింటింగ్ విద్యార్హతలు ఫైన్ ఆర్ట్స్ మద్రాసు ప్రభుత్వ డ్రాయింగ్ హైయర్, లలిత కళా అకాడమీ స్కాలర్‌షిప్‌తో కొండపల్లి శేషగిరిరావు గారి వద్ద వాష్ టెక్నిక్‌లో ప్రత్యేక శిక్షణ (1970) బహుమతులు కళావిభూషణ్, విశ్వకళాకౌముది, రమ్యశిల్పి, చిత్రకళా ప్రపూర్ణ వంటి బిరుదులతో పాటు మరెన్నో పురస్కారాలు చిత్రకళా ప్రదర్శనలు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో 20కు పైగా గ్రూపు ఎగ్జిబిషన్లు, 50కు పైగా వన్‌మేన్ షోలు నిర్వహించాను దేశవ్యాప్తంగా జరిగిన అనేక కళామేళాలలోనూ, సెమినార్లలోనూ పాల్గొన్నాను కవిగా కొన్ని సంకలనాలు వెలువడ్డాయి మరి కొన్ని వివిధ పత్రికలలోను, మేగజైన్స్‌లోనూ ప్రచురించబడ్డాయి వృత్తి ఆర్టిస్టు (బాపట్ల అగ్రికల్చరల్ కాలేజిలో పదవీ విరమణ) హాబీలు ప్రస్తుతం చీరాలలో డి పి రాయ్ చౌదరి ఫైన్ ఆర్ట్స్ ఎడ్యుకేషనల్ అకాడమీని స్థాపించి, కళారచన, కళాసేవ చేస్తున్నాను కళాకారుడుగా అనుభూతులు ఎన్నో



Ulchi Artist
H No 23-52
Chimatavari St,
Ramakrishnapuram,
Solomon Centre,
Chirala 523 155
Hello (08594) 39495



UTTAM
610, Lingapur House
Amruta Estates
Himayatnagar
Hyderabad-500 029

## ఉత్తమ్

శ్రీకాకుళం జిల్లా కాశీబుగ్గ గ్రామంలో పుట్టి హాలీవుడ్ యూనివర్సల్ స్టూడియోలో యానిమేషన్ ఆర్టిస్టు స్థాయికి ఎదిగిన చిత్రకారుడు ఉత్తమ్ హైస్కూలు స్థాయి నుంచీ స్వయంకృషితో చిత్రకళనభ్యసించి 1981 నుంచి 'ఆంధ్రభూమి' వారపత్రికలో సుమారు పుష్కరకాలం పాటు తన చిత్రాలతో పాఠకులను అలరించారు 1987లో పబ్లిష్ అయిన "మైటీ హనుమాన్" బొమ్మల పుస్తకం ఇతని చిత్రకళా జీవితానికి గొప్ప మలుపు అందివచ్చిన అవకాశంతో అమెరికాకెళ్ళి స్పీల్‌బర్గ్ వంటి హాలీవుడ్ దర్శకుని దగ్గర పనిచేసి, ఇండియా కొచ్చి హైదరాబాద్‌లో 'హార్ట్ ఎంటర్ టైన్‌మెంటు' పేరుతో యానిమేషన్ స్టూడియోని స్థాపించి, తన కళను స్థానిక చిత్రకారులకు నేర్పించి విదేశీ సంస్థల కోసం యానిమేషన్ ప్రాజెక్టులను చేపట్టారు గత ఏడాది కలర్ చిప్స్ సంస్థను కూడా ఈయనే స్థాపించారు తెలుగునాట చిత్రకళకు కార్పొరేట్‌స్థాయి కల్పించి చరిత్ర సృష్టించిన వ్యక్తి పి ఉత్తమ్‌కుమార్



## ఎన్ ఎస్ శర్మ

పూర్తి పేరు నేరెడిమల్లి సత్యనారాయణ శర్మ (చిత్రకారుడు, శిల్పి) పుట్టిన తేది 1 జూన్ 1950 తల్లిదండ్రులు కాసులమ్మ, రామస్వామి పుట్టిన ఊరు, జిల్లా కందికుప్ప, తూ॥గో॥ అభిమాన చిత్రకారుడు పికాసో, రోడిన్ ఇష్టమైన శైలి మోడ్రన్ ఆర్ట్ విద్యార్హతలు ఎం ఏ(ఇండియన్ హిస్టరీ ఫైన్ ఆర్ట్స్ డి ఎఫ్ ఏ (డ్రాయింగ్,) డి ఎఫ్ ఏ (మోడలింగ్ – శిల్పం) బహుమతులు రాష్ట్ర జాతీయ స్థాయిలో కొన్ని బహుమతులు ప్రసంసా పత్రాలు చిత్రకళారత్న శిల్పకళాభూషణ, ఆంధ్రశ్రీ బిరుదులు వృత్తి ప్రభుత్వ బి ఇడి ట్రయినింగ్ కాలేజిలో చిత్రకళో ఉపాధ్యాయుడు హాబీలు పుస్తక పఠనం, విహార యాత్రలు కళాకారుడిగా అనుభూతులు చిత్రకారుడుగా శిల్పిగా కళకు మంచి సేవ చేస్తున్నాన్న తృప్తి ఉంది



N S Sarma
Art Master
Govt Comprehensive
College of Education,
Innespeta,
Rajahmundry
Pin 533 101

## ఎ యస్ యన్ రాజు



పూర్తి పేరు అల్లూరి సత్యనారాయణ రాజు (చిత్రకారుడు), పుట్టిన తేది 2 మార్చి 1910, తల్లిదండ్రులు లక్ష్మీనరసాంబా, సుబ్బరాజు పుట్టిన ఊరు, జిల్లా రాయలం, ప॥గో॥ అభిమాన చిత్రకారుడు అడవి బాపిరాజు, అంకాల వెంకట సుబ్బారావు, గ్రంధి శేషారావు ఇష్టమైన శైలి లైన్ డ్రాయింగ్స్, వాటర్ కలర్స్ ఫైన్ఆర్ట్స్ డిప్లొమా ఇన్ డ్రాయింగ్ బహుమతులు/పురస్కారాలు 1923లో జయపూర్ మహారాజా గారిచే 'చిత్రకళాకోవిద' బిరుదుతో సత్కారం, 1998లో రాష్ట్రగవర్నర్ డా॥ రంగరాజన్ గారిచే సత్కారం, జాతీయస్థాయిలో ఎన్నో చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించాను, జీవితచ్ఛాయాదర్శనము పేరుతో నేను గీచిన కొన్ని చిత్రాలను, పెయింటింగ్‌లను పుస్తక రూపంలో ప్రచురించాను



వృత్తి చిత్రకళోపాధ్యాయుడు (రిటైర్డు) హాబీలు ఫోటోగ్రఫీ, నటన, సంగీతం కళాకారుడిగా అనుభూతులు 'కళాకారునిగా పుట్టడం ఒక వరం'

A Satyanarayana Raju
Artist,
RayalamP O
Bhimavaram TQ
W G Dist ,

## ఎల్ ఎన్.ఎస్ సత్య తిరునగరి



పూర్తి పేరు లక్ష్మీనారాయణ స్వామి తిరునగరి (చిత్రకారుడు, కార్టూనిస్టు), పుట్టిన తేది 27 ఆగష్టు 1956, పుట్టిన ఊరు/జిల్లా హుజూరాబాద్, కరీంనగర్, అభిమాన చిత్రకారుడు/కార్టూనిస్టు చిత్తప్రసాద్, బాపు, శ్రీధర్ ఇష్టమైన శైలి చేయినెత్తకుండా వాక్యాలు వ్రాయడం(ప్రకృతి (స్త్రీ)), విద్యార్హతలు బి ఏ, విద్వాన్ (హిందీ), ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయ్యర్, డ్రాయింగ్ టి టి సి, బహుమతులు కలెక్టర్‌తో బంగారు పతకాన్ని, కొన్ని ప్రైజులు, మెమొంటోలు, యునెస్కో ఇంటర్‌నేషనల్ అప్రిసియేషన్ అవార్డు వృత్తి డ్రాయింగ్ మాస్టర్, హాబీలు ఫోటోగ్రఫీ, వీడియో ఎడిటింగ్, వీడియోగ్రఫీ చిత్రకళ, చిన్న చిన్న మాజిక్స్ చేయడం, మ్యూజిక్ వినడం, వాస్తువల్ల నష్టపోయేవారికి నా సలహాల(తో)నిచ్చి ఆదుకోవడం కళాకారుడిగా అనుభూతులు కళయందు లీనమయితే బయటి ప్రపంచం గుర్తుండదు, కళ ఒక మహా తపస్సు

T Lakshmi Narayana Swamy
Govt High School,
Padmanagar
Karimnagar, A P
Pin 505 001

## ఒస్మాన్ ఖాన్



పూర్తి పేరు  యం డి ఒస్మాన్ (ఆర్టిస్టు), పుట్టిన తేది  3 జూలై 1953, తల్లిదండ్రులు  వాహబ్‌ఖాన్, అమీరునీసా, పుట్టిన ఊరు, జిల్లా  గుంటూరు, అభిమాన చిత్రకారుడు  మైఖేలేంజిలో, విద్యార్హతలు  ఎస్ ఎస్ సి , ఫైన్‌ఆర్ట్స్ డ్రాయింగ్ హైయ్యర్‌గ్రేడ్ - మద్రాసు  కళారంగంలో సాధించిన బహుమతులు అనేకం చిత్రకళా ప్రదర్శనలు ఒన్‌మేన్‌షోలు 4, గ్రూపు షోలు 12, వృత్తి  పెయింటర్ APSRTC హాబీలు  మ్యూజిక్ వినడం, ప్రత్యేకత  సెమీ అబ్‌స్ట్రాట్ (మిక్సిడ్ మీడియా) దేశంలో జరిగిన అనేక ఆర్ట్‌క్యాంప్స్, కళామేళాలలో పాల్గొనడం జరిగింది  గుంటూరు చిత్రకళా పాండవులుగా ప్రసిద్ధిచెందిన ఆర్టిస్టులలో నేనొకడిని



Md Osman Khan
D No 4 5-49/24,
Saibaba Road
Beside New Chemical Corp
Guntur 7, Phone 227755

## కోటివీరయ్య చల్లా



కుంచె పేరు చల్లా కె వి , పూర్తి పేరు  కోటివీరయ్య చల్లా (చిత్రకారుడు) పుట్టిన తేది  13 ఏప్రిల్ 1932 తల్లిదండ్రులపేర్లు  గంగమ్మ, మల్లయ్య పుట్టిన ఊరు, జిల్లా  నర్సాపురం, ప॥గో॥ అభిమాన చిత్రకారుడు  కీ॥శే వడ్డాది పాపయ్య, దేవిప్రసాద్ రాయ్ చౌదరి  ఇష్టమైన శైలి  వాష్ పెయింటింగ్, పాచ్ వర్కు, నైఫ్ వర్కు  విద్యార్హతలు  మెట్రిక్యులేషన్ ఫైన్ ఆర్ట్స్ ఫ్రీహాండ్, పెయింటింగ్, డిజైన్, హాయ్యర్ గ్రేడ్స్ టి టి సి  బహుమతులు  అంకాల ఆర్టు అకాడమీ - భీమవరం, 'సంస్కృతి' యంగ్ యవ్వాయిస్ ఇంటర్నేషనల్ హైద్రాబాద్  హరివిల్లు ఆర్టు అకాడమీ - పాలకొల్లు  కోనసీమ చిత్రకళా పరిషత్ - అమలాపురం, వృత్తి  రిటైర్డు చిత్రకళోపాధ్యాయుడు హాబీలు  ఫోటోగ్రఫీ కళాకారుడుగా అనుభూతులు  చిత్రకళోపాధ్యాయునిగా 76 మందికి జీవనోపాధి కలగచేయడం

Challa Kotiveeraiah
School of Arts & Crafts,
Bhimavaram-1
W G Dist ,
Hello 32309

## కరుణాకర్



పూర్తి పేరు ఎన్ కరుణాకర్ (చిత్రకారుడు, కార్టూనిస్టు) పుట్టిన తేది 4 ఆగష్టు తల్లిదండ్రులు కస్తూరిబాయి, శ్రీ సూర్యప్రకాశరావు పుట్టిన ఊరు, జిల్లా విశాఖపట్టణం విద్యార్హతలు బి యస్ సి, పి జి డిప్లొమా ఇన్ జర్నలిజం ఫైన్ ఆర్ట్స్ బి ఎఫ్ ఏ (ఫోటోగ్రఫీ) బహుమతులు 'గురుబ్రహ్మ' టి వి సీరియల్‌కు 1997 సం॥రపు నంది అవార్డు 1983 ఆల్ ఇండియా కారికేచర్ కాంపిటీషన్లో ద్వితీయ బహుమతి వృత్తి ఫ్రీలాన్స్ ఆర్టిస్టు




N Karunakar
SRT 301,
Sanathnagar,
Hyderabad
Pin 500 018
Hello 3705683


## కేశవరావు పి



పూర్తి పేరు పెనుగొండ కేశవరావు వుడయార్ (శిల్పి) పుట్టిన తేది 15 జూన్ 1942, తల్లిదండ్రులు పార్వతి, అరుణాచలం, పుట్టిన ఊరు, జిల్లా నత్తారామేశ్వరం, ప॥గో॥జిల్లా, అభిమాన శిల్పి అరుణాచలం ఇష్టమైన శైలి అజంతా శిల్ప కళ విద్యార్హతలు ఎస్ ఎస్ ఎల్ సి సీనియర్ బేసిక్ ట్రైనింగ్ ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి, బహుమతులు అనేక చోట్ల సన్మానం, వృత్తి శిల్పి, హాబీలు పెయింటింగ్, సంగీతం కళాకారుడిగా అనుభూతులు వేలాది మంది ఆదరాభిమానములు పొందిన ఆనందం




P Kesavarao udayar,
Arunachalam Silpasramam
Natta Rameswaram,
Penumantra Mandal,
W G Dist,
Pin 534 124
Hello 77319

## కామేశ్వరరావు వేముల



V Kameswara Rao,
Purushotam Street,
Satyanarayanapuram,
Vijayawada-11
Hello 533780

పూర్తి పేరు వేముల కామేశ్వరరావు (చిత్రకారుడు), పుట్టిన తేది 20 మే1920, తల్లితండ్రులు నారాయణమ్మ, కామరాజు, పుట్టిన ఊరు/ జిల్లా మంతెన, కృష్ణా, అభిమాన చిత్రకారుడు డి పి రాయ్ చౌదరి, ఇష్టమైన శైలి ఆయిల్ పెయింటింగ్ మరియు లైఫ్ స్కెచ్చింగ్, ఫైన్ ఆర్ట్సు డిప్లొమా ఫైన్ ఆర్ట్స్, బహుమతులు తిరుపతి వెంకటేశ్వర స్వామి పెయింటింగ్‌కు ద్వితీయ బహుమతి వృత్తి (రిటైర్డ్ డ్రాయింగ్ టీచర్) ఆయిల్ పెయింటింగ్స్, హాబీలు మోల్డింగ్, లాండ్ స్కేప్ స్కెచ్,

## కె యస్ వాస్



పూర్తి పేరు కె శ్రీనివాస్ (ఆర్టిస్టు, పెయింటర్) పుట్టిన తేది 28 జనవరి 1948 తల్లిదండ్రులు మంగతాయారమ్మ, వేణుగోపాల్ పుట్టిన ఊరు, జిల్లా గుడివాడ, కృష్ణా అభిమాన చిత్రకారుడు తమ కళావిష్కరణలో ఈ జగత్తును సుసంపన్నం చేసిన కళాకారులందరూ ఇష్టమైన శైలి సింబాలికల్, సర్‌రియాలిస్టిక్ మరియు అబ్‌స్ట్రాక్ట్ ఎక్స్‌ప్రెషన్ విద్యార్హతలు యం ఏ ఫైన్ ఆర్ట్సు డిప్లొమా ఇన్ పెయింటింగ్ బహుమతులు చాలా ఆర్ట్ ఎగ్జిబిషన్స్ నుండి పార్టిసిపేటెడ్ అవార్డ్సు వృత్తి విద్యారంగం హాబీలు వర్క్ చేయడంలో సంతృప్తి, సింప్లిసిటీ ఇన్ లైఫ్, పుస్తక పఠనం కళాకారుడిగా అనుభూతులు దైవికమైన ఈ శుభాంత నాటకంలో చిత్రకారుడి పాత్ర పోషించడం ముదావహం



K Srinivas
Rosebud Public School
Machavaram Down,
Vijayawada 4
Hello 431204



## కళాసాగర్

పూర్తి పేరు యల్లపు అప్పారావు (చిత్రకారుడు) పుట్టిన తేది 10 డిశంబరు 1971 తల్లిదండ్రులు లక్ష్మీకాంతం, నరసింహమూర్తి పుట్టిన ఊరు, జిల్లా మంచిలి, పశ్చిమ గోదావరి అభిమాన చిత్రకారుడు/ కార్టూనిస్టు స్వర్గీయ వడ్డాది పాపయ్య, బాపు ఇష్టమైన శైలి వాష్ టెక్నిక్ (వాటర్ కలర్స్) కంప్యూటర్ డిజైనింగ్ విద్యార్హతలు ఇంటర్మీడియట్ ఫైన్ ఆర్ట్స్ డి ఎఫ్ ఎ (పెయింటింగ్), టి టి సి (డ్రాయింగ్) బహుమతులు అనేకం వృత్తి ఆర్టిస్టు (విక్రమ్ పబ్లిషర్స్) హాబీలు చిత్రకళా సంబంధిత వ్యాసాలు వ్రాయడం, పుస్తకాలు చదవడం, క్లే మోడలింగ్ జనరల్ సెక్రటరీ ఆంధ్రా ఆర్టిస్టు, స్కల్ప్చర్స్ అండ్ కార్టూనిస్టు అసోసియేషన్, ట్రెజరర్ ఎక్సరే సాహిత్య సాంస్కృతిక సేవా సంస్థ



Kalasagar, Artist
H No 21-11/1-1,
Saibaba Colony,
Madhura Nagar,
Vijayawada
Pin 520 011



## కన్నారావు జి

పూర్తి పేరు గిడుతూరి కన్నారావు (చిత్రకారుడు) పుట్టిన తేది 15 జులై 1931 అభిమాన చిత్రకారుడు ఎందరో మహానుభావులు విద్యార్హతలు డి సి ఇ. ఫైన్ ఆర్ట్స్ డి ఎఫ్ ఏ బహుమతులు పుల్లయ్య కళానిలయం, జనగాం ఆల్ ఇండియా ఆర్ట్స్ క్రాఫ్ట్స్, న్యూఢిల్లీ, పురస్కారాలు కోనసీమ చిత్రకళాపరిషత్ – అమలాపురం, అనకాపల్లి ఆర్ట్ అకాడమీ – అనకాపల్లి వ్యవస్థాపక కార్యదర్శి లలిత కళాపరిషత్ – విశాఖపట్టణం వృత్తి సివిల్ ఇంజనీరింగ్ కన్సల్‌టెంట్ హాబీలు చారిత్రక ప్రదేశాలు సందర్శించడం కళాకారుడిగా అనుభూతులు ఎన్నో

G Khannarao
Gayatri Nilayam,
18-70-11,
Kotha Salipeta,
Visakhapatnam
Pin - 530 002

## కృష్ణ



V Krishna Kishore
Sarvani Laboratory,
Sivalayam St,
Satyanarayanapuram,
Vijayawada 11
Hello 536440

పూర్తి పేరు వల్లూరి కృష్ణ కిషోర్ (చిత్రకారుడు, కార్టూనిస్టు), పుట్టిన తేది 9 జనవరి 1974, తల్లితండ్రులు సూర్యకుమారి, శ్రీవత్సంకరరావు, పుట్టిన ఊరు/జిల్లా నర్సాపురం, ప॥గో॥ అభిమాన చిత్రకారుడు/కార్టూనిస్టు బాపు, ఇష్టమైన శైలి బాపు శైలి, విద్యార్హతలు యం కాం షార్ట్‌హాండ్, టైపు హైయ్యర్, ఫైన్ ఆర్ట్స్ డిప్లొమా ఇన్ మల్టీమీడియా, బహుమతులు స్వాతి కార్టూన్ పోటీలో మొదటి




బహుమతి, రాష్ట్రస్థాయి కార్టూన్ పోటీలో న్యూజెర్సీవారి పోటీలో ఇంకా వివిధ పోటీల్లో బహుమతులు, వృత్తి చిత్రకళ, కార్టూనింగ్ హాబీలు కీ బోర్డ్ ప్లేచేయటం, పాడటం, కళాకారునిగా అనుభూతులు బాపుగారి శిష్యుడు కావటం, ఇండియన్ కార్టూన్ ఫెస్టివల్‌లో పార్టిసిపేట్ చేయటం మొదలగునవి

## కరుణ్



KARUNAKAR
A & K United Art Gallery
Narasimhapuram
Bhimavaram 2
Hello 25930 (08816)

పూర్తి పేరు పెనుగొండ కరుణాకర్ (శిల్పి) పుట్టిన తేది 3 ఫిబ్రవరి 1974 తల్లిదండ్రులు సత్యవతి, కేశవరావు, పుట్టిన ఊరు, జిల్లా నత్తారామేశ్వరం, ప॥గో॥, అభిమాన ఆర్టిస్టు పికాసో, ఇష్టమైన శైలి విద్యార్హతలు బి ఏ, ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి (వంశపారంపర్యం) బహుమతులు సన్మానాలు, షీల్డులు వృత్తి శిల్పి, హాబీలు పెయింటింగ్ & మ్యూజిక్, కళాకారుడిగా అనుభూతులు డిగ్రీలో ఉండగా సరస్వతీ విగ్రహం చేసినపుడు తోటి విద్యార్థుల, లెక్చరర్‌ల అభినందనలు పొందడం

## కాశి



పూర్తి పేరు ఎస్ కాశీవిశ్వేశ్వరావు (చిత్రకారుడు, శిల్పి, కార్టూనిస్టు), పుట్టిన తేది 4 ఫిబ్రవరి 1958 తల్లిదండ్రులు అప్పయ్యమ్మ, రామకృష్ణ పుట్టిన ఊరు, జిల్లా కుతుకులూరు, తూ॥గో॥ అభిమాన చిత్రకారుడు బాపు, చంద్ర ఇష్టమైన శైలి అన్నీ రకాల శైలులు విద్యార్హతలు బి ఏ ఫైన్ఆర్ట్స్ డ్రాయింగ్ డిప్లొమా బహుమతులు/పురస్కారాలు 1980లో "ఆకలి జీవులు" పెయింటింగ్‌కి, 1981లో భీమవరం అంకాల ఆర్ట్ అకాడమీ వారి ద్వారా "చరం కింకిణులు ఘల్లు ఘల్లు మన" చిత్రానికి పురస్కారాలు వృత్తి కమర్షియల్ ఆర్ట్స్, ఫొటోగ్రఫీ, టైలరింగ్, ఎంబ్రాయిడరి హాబీలు అగ్రికల్చరల్, కంప్యూటర్ గ్రాఫిక్స్ కళాకారుడిగా అనుభూతులు చిత్రకారులు మత చిత్రాల ద్వారా కొందరికైనా మానసిక ఆనందంతో పరవసింపజేయడం అనేది దేవుడిచ్చిన కళగా భావిస్తాను




Kası
23-22 96,
Saı Vihar
Satyanarayanapuram
Pın 520 011
Hello 533938


## కళ



పూర్తి పేరు అగస్త్యరాజు లక్ష్మి సూర్యకళ (చిత్రకారిణి), పుట్టిన తేది 10 ఫిబ్రవరి 1975, తల్లిదండ్రుల పేర్లు సీతామహాలక్ష్మి, రమేష్‌బాబు, పుట్టిన ఊరు, జిల్లా తెనాలి గుంటూరు అభిమాన చిత్రకారుడు రవివర్మ ఇష్టమైన శైలి ఆయిల్ పెయింటింగ్, విద్యార్హతలు యస్ యస్ సి, టి టి సి (డ్రాయింగ్), ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయ్యర్ గ్రేడ్ (మద్రాస్), వృత్తి ఆర్టిస్టు – విక్రమ్ పబ్లిషర్స్, హాబీలు ఫ్యాబ్రిక్ పెయింటింగ్, హేండీక్రాఫ్ట్స్


A L S Kala
D/o A Ramesh Babu,
Kovelamudıvarı St ,
Suryaraopet,
Vıjayawada 520 002

## కుమార్



M Uday Kumar
H No 28/428, Circlepet,
Machilipatnam,
Pin 521 001

పూర్తి పేరు ఎమ్ ఉదయ్ కుమార్ (చిత్రకారుడు), పుట్టిన తేది 28 నవంబర్ 1983, తల్లిదండ్రుల పేర్లు చంద్రకళ, అప్పారావు, పుట్టిన ఊరు, జిల్లా కుందరు, కృష్ణా అభిమాన కార్టూనిస్టు శ్రీధర్, విద్యార్హతలు ఇంటర్మీడియట్, ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి, బహుమతులు భారత వికాస పరిషత్ వాళ్ళు జరిపిన చిత్రలేఖన పోటీలో ప్రథమ బహుమతి 1999-2000, పాఠశాలలో 10వ తరగతిలో ప్రథమ బహుమతి, వృత్తి స్టూడెంట్, హాబీలు ప్రసిద్ధ కళాకారులచే చేయబడిన పెయింటింగ్‌లు చూడటం

## గంగాధర్



పూర్తి పేరు కాసాకోటి గంగాధరుడు (చిత్రకారుడు) పుట్టిన తేది 15 అక్టోబరు 1937 తల్లిదండ్రులపేర్లు సుబ్బమ్మ, బులి కోటయ్య పుట్టిన ఊరు, జిల్లా పోడూరు, ప॥గో॥ అభిమాన చిత్రకారుడు వడ్డాది పాపయ్య, దేవిప్రసాద్ రాయ్ చౌదరి ఇష్టమైన శైలి లైన్ డ్రాయింగ్స్ విద్యార్హతలు ఎస్ ఎస్ ఎల్ సి ఫైన్ ఆర్ట్స్ (ఫ్రీహాండ్, పెయిటింగ్, డిజైనింగ్ బహుమతులు నంది అవార్డుల గ్రహీత వృత్తి పబ్లిసిటీ ఆర్టు డిజైనరు హాబీలు ఫోటోగ్రఫీ, దర్శకత్వం కళాకారుడుగా అనుభూతులు "సర్వేజన సుఖినోభవంతు"




K Gangadhar
Artist
B 15, Film Nagar,
Hyderabad

## గంధం



పూర్తి పేరు  జి కె దుర్గాప్రసాద్ (చిత్రకారుడు) పుట్టిన తేది  2 సెప్టెంబరు 1959, తల్లిదండ్రులు  కౌసల్య, చలపతిరావు, పుట్టిన ఊరు, జిల్లా నరసరావు పేట, గుంటూరు అభి మాన ఆర్టిస్టు  బాపు, విద్యార్హతలు బి కాం , ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి, బహు మతులు ఆర్ట్ కాంపిటీషన్స్ లో చాలా బహుమతులు వృత్తి సీనియర్ అసిస్టెంట్ ఇన్ కమర్షియల్ టాక్స్ డిపార్ట్‌మెంట్ (స్టేట్ గవర్నమెంట్), హాబీలు ఘంటసాల పాటలు విని ఆనందించడం, బాపు ఆర్ట్స్




G K Durga Prasad
House No  84, D No 40 5/77
Opp K J Gupta
Kalyanamandapam, Municipal
Employees Colony
Vijayawada 10 Hello 484826

## "గోరా"



పూర్తి పేరు  గోకా రామస్వామి (శిల్పి) పుట్టిన తేది  6 ఆగష్టు 1954 తల్లిదండ్రులు  చంద్రమ్మ, బాలయ్య పుట్టిన ఊరు, జిల్లా నర్సంపేట, వరంగల్ ఇష్టమైన శైలి  సబ్బులపై శిల్పాలను చెక్కడం విద్యార్హతలు  బి ఏ ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ టి టి సి బహుమతులు యునెస్కో అవార్డు (న్యూఢిల్లీ), ఉత్తమ ఉపాధ్యాయుడు ఫౌండర్ & కరస్పాండెంట్ – ఏకశిలా ఎడ్యుకేషనల్ సొసైటీ మెంబరు  గోకా ఆర్ట్ సొసైటీ మొ॥ వృత్తి  ఉపాధ్యాయుడు హాబీలు  స్టాంపులు, నాణెములు సేకరణ ఫోటోగ్రఫి

G Ramaswamy
Ekasila High School,
Narsampet, Warangal,
Pin 506 132
Hello 30842, 30242

# గోపాలకృష్ణ



పూర్తి పేరు వేంద్ర గోపాలకృష్ణ (కార్టూనిస్ట్ & చిత్రకారుడు,) పుట్టిన తేది 8 అక్టోబరు 1964, తల్లిదండ్రులు వేంద్ర మంగమ్మ, వెంకన్న, పుట్టిన ఊరు, జిల్లా పెనుగొండ, ప॥గో॥, అభిమాన కార్టునిస్టు/ ఆర్టిస్టు బాపు, చంద్ర విద్యార్హతలు బి ఎస్ సి, ఎం ఏ, బహుమతులు ఎన్నో సంస్థల నుండి, పత్రికల నుండి పురస్కారాలు, బహుమతులు, సన్మానాలు పొందాను వృత్తి ఆర్టిస్ట్ ఇన్ ఏనిమేషన్ అకాడమీ, హాబీలు మ్యూజిక్, బుక్స్ మరియు కార్టూన్స్, కళాకారుడిగా అనుభూతులు ప్రతి జన్మలోను ఈ కళాకారుడిగానే పుట్టాలని



V Gopala Krishna
C/o V Prabhavati,
Flat No 205, IInd Floor,
Central View Apartments,
New Bhoiguda,
Secunderabad 20

# గణపతి ఎన్



పూర్తి పేరు నేనావతి గణపతి (చిత్రకారుడు) పుట్టిన తేది 10 ఫిబ్రవరి 1966 తల్లిదండ్రులు లక్ష్మి, కపూర్ పుట్టిన ఊరు/జిల్లా దేవరకొండ నల్గొండ అభిమాన చిత్రకారుడు పికాసో ఇష్టమైన శైలి పెయింటింగ్ విద్యార్హతలు ఇంటర్మీడియట్ ఫైన్ ఆర్ట్సు బి ఎఫ్ ఏ బహుమతులు ఆచార్య పురస్కార్ అవార్డు వృత్తి ఆర్ట్ టీచర్ హాబీలు మొక్కల పెంపకం కళాకారుడిగా అనుభూతులు మంచి ఆర్టిస్టుగా పేరు తెచ్చుకోవడం

N Ganapathi
Art Teacher,
Jawahar Navodaya
Vidyalaya
Pedavegi, W G Dt ,

## గుత్తుల శ్రీనివాసరావు



పూర్తి పేరు  గుత్తుల శ్రీనివాసరావు (చిత్రకారుడు, కార్టూనిస్ట్) పుట్టిన తేది  2 జనవరి 1972, తల్లిదండ్రులు  సత్యవతి, మీరాసాహెబ్, పుట్టిన ఊరు, జిల్లా  దొంతికుర్రు, తూ॥గో॥ అభిమాన కార్టునిస్టు/ఆర్టిస్టు  బాపు, మల్లిక్, శ్రీధర్, ఇష్టమైన శైలి  రేఖాచిత్రాలు గీయడం, క్లుప్తమైన సంభాషణతో కాని, సంభాషణ లేకుండా కాని కార్టూన్లు గీయడం, విద్యార్హతలు  ఎం ఏ (పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్)  ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ – హైయ్యర్, డ్రాయింగ్ – టి టి సి, బహుమతులు కార్టూనిస్టుగా కొన్ని బహుమతులు, వృత్తి  కమర్షియల్ ఆర్టిస్టు, హాబీలు  చిత్రలేఖనం, కథలు, కార్టూన్లు రాయడం, మేజిక్, హిప్నాటిజం ప్రదర్శనలు చేయడం, కళాకారుడిగా అనుభూతులు  కార్టూనిస్టుగా అందర్నీ నవ్వించగల్గడం నా జీవితంలో ఓ తీయని అనుభూతి

G Srinivasa Rao
Dontikurru Post
Katrenikona Mandal,
E G Dist ,
Pin 533212




## గోపాలరావు సిహెచ్.



కలం పేరు  గోరా పూర్తి పేరు  చందనపల్లి గోపాలరావు(నఖ చిత్రకారుడు), పుట్టిన తేదీ  31 మే 1971 తల్లిదండ్రులు  సరస్వతి, సత్యంనాయుడు నఖచిత్ర కళాభ్యసం  శ్రీ పల్లా పర్శినాయుడు గారి వద్ద 1997 సం॥ నుండి అభిమాన చిత్రకారులు  వడ్డాది పాపయ్య, రవివర్మ ఇష్టమైన శైలి  నఖ చిత్రకళ తొలినఖ చిత్రం  వెలుగుతున్న కొవ్వొత్తి, తొలి నఖ చిత్రం ప్రచురణ  'ఆంధ్రజ్యోతి' పత్రికలో బహుమతులు  కొన్ని వృత్తి  టీచర్, ఇప్పటి వరకు గీసిన చిత్రాలు సుమారు వందకుపైగా, సామాజిక ఇతివృత్తం నేపధ్యం, సామాజిక దురాచారాలు రూపుమాపే చిత్రాలు, పురాణగాధల ఆధారంగా పలు చిత్రాలు, వివిద దేశనాయకుల ఫోటోలు మొదలైనవి అనుభూతులు చిత్రకారుడిగా తృప్తి

Ch Gopala Rao,
Teacher
P R N Valasa
Philipnagar
Parvatipuram M
Vizianagaram



# చంద్ర

కుంచె పేరు చంద్ర, బాల పూర్తి పేరు ఎం చంద్రశేఖర్ (చిత్రకారుడు, శిల్పి, కార్టూనిస్టు) పుట్టిన తేది 25 ఆగస్టు 1946 తల్లిదండ్రులు సోమలక్ష్మి, రంగయ్య పుట్టిన ఊరు/జిల్లా పెద్దముప్పారం, వరంగల్ అభిమాన చిత్రకారుడు/ కార్టునిస్టు ఎందరో మహానుభావులు, బాపు ఇష్టమైన శైలి ఏదైనా నన్ను ఆకర్షించింది విద్యార్హతలు హెచ్ ఎస్ సి ఫైన్ ఆర్ట్స్ గవర్నమెంట్ డిగ్రీ ఇన్ ఫైన్ ఆర్ట్స్ బహుమతులు వందల్లో వృత్తి ఆర్టిస్టు కమ్ డిజైనర్ డా॥ బి ఆర్ అంబేద్కర్ ఓపెన్ యూనివర్శిటీ హాబీలు సినిమా కళాకారుడుగా అనుభూతులు 125 పైగా కథలు అచ్చైనవి వ్యాసాలూ, చిత్రకళ మీద వ్యాసాలూ, రివ్యూలూ, కవిత్వం కూడా రాశాను కొన్ని వేల కథలకీ లెక్కకు తేలని పుస్తకాలకి ముఖచిత్రాలూ, వేల కొద్దీ కార్టూన్లు, స్వాతి మాసపత్రికలో, మయూరి వార పత్రిక, పుస్తక ప్రపంచం మాసపత్రికల్లో సంపాదక వర్గంలో పని చేశాను, 1970 నుంచీ 1976 ఎరకూ విరసం సభ్యుణ్ణి, విరసం కళాకారుడిగా 'ఎమర్జెన్సీ'లో అరెస్టుయ్యాను, విరసం చిత్రకళా ప్రదర్శనలు దేశంలో నలుమూలలా ప్రదర్శించారు, 20 సినిమాలకి కళాదర్శకుడిగా పనిచేశాను, 6 డాక్యుమెంటరీ చిత్రాలకి పనిచేశాను, 2 డాక్యుమెంటరీ చిత్రాలకి దర్శకత్వం, ఇంద్రధనుస్సు, వెన్నెల వేట, టి వి సీరియల్స్‌కి దర్శకత్వం



Chandra
Block 6/Flat 15,
Hig - II,
Bagh Lingampally
Hyderabad
Pin 500 044

## చలపతిరావు సుంకర



పూర్తి పేరు  చలపతిరావు సుంకర (చిత్రకారుడు/చిత్రకళారచయిత), పుట్టిన తేది  1954 తల్లిదండ్రులు  అనసూయమ్మ, వెంకటేశ్వరరావు పుట్టిన ఊరు, జిల్లా  వెల్లటూరు, గుంటూరు  అభిమాన చిత్రకారుడు  ఎందరో మహానుభావులు  ఇష్టమైన శైలి  వాటర్ కలర్స్  విద్యార్హతలు  యస్ యస్ సి  టెక్నికల్, విశాఖషిప్ యార్డ్‌లో అప్రంటిస్ షిప్  ఫైన్ఆర్ట్స్  'చిత్రకళాప్రపూర్ణ' వెల్లటూరి పూర్ణానందశర్మ గారి పర్యవేక్షణలో  ప్రచురణలు  1 చిత్రకళారంత్నాలు, 2 రంగులరారాజు 'వడ్డాది పాపయ్య' 3 దామెర్ల రామారావు  గౌరవ పదవులు  అధ్యక్షులు-ఆస్కా, వైస్ ప్రెసిడెంట్ షిప్‌యార్డ్ రచయితల సంఘం, విశాఖపట్టణం, సెక్రటరీ – చిత్రకళా పరిషత్  వృత్తి  భారతనౌకానిర్మాణ కేంద్రం, విశాఖపట్నం  హాబీలు  జర్నలిజం, చిత్రకారులను గురించి, చిత్రకళ గురించి పరిశోధించటం, పరిచయ వ్యాసాలు వ్రాయటం

## చారి డి కె



పూర్తి పేరు  దొండపాటి కృష్ణమాచారి (ఆర్టిస్టు) పుట్టిన తేది  6 జులై 1967, తల్లిదండ్రులు  శకుంతల, లక్ష్మీనారాయణదాసు, పుట్టిన ఊరు, జిల్లా  శంకరగుప్తం, తూ॥గో॥  అభిమాన ఆర్టిస్టు  దామెర్ల రామారావు, విద్యార్హతలు  బి యస్ సి , బి ఇడి , టి టి సి  ఫైన్ ఆర్ట్స్  బి ఎఫ్ ఏ (పెయింటింగ్), బహుమతులు  కోనసీమ చిత్రకళా పరిషత్,అమలాపురం వారి నుంచి మూడు ప్రథమ, రెండు ద్వితీయ, రెండు తృతీయ,ఒక పి టి రెడ్డి అవార్డు లభించినవి హరివిల్లు ఆర్ట్ అకాడమీ పాలకొల్లు వారి నుంచి ఒక స్పెషల్ ప్రైజు లభించింది, వృత్తి  కమర్షియల్ ఆర్టిస్ట్, హాబీలు  ఫోటోగ్రఫి, మ్యూజిక్ వినటం



D K Charı
S/o Lakshmınarayana Dasu,
Sankaraguptam,
Malıkıpuram Mandal,
East Godavarı Dıst ,
Pın  533 250

# చిత్రాలయ



M Rambabu
Bonuvari Street,
Gandhinagar,
14th Ward, Eluru
Pin 534 002

పూర్తి పేరు మూకల రాంబాబు (చిత్రకారుడు) పుట్టిన తేది 8 ఆగష్టు 1963 తల్లిదండ్రులు కృష్ణవేణి, సత్యనారాయణ పుట్టిన ఊరు/జిల్లా తాడేపల్లి గూడెం, పశ్చిమ గోదావరి అభిమాన చిత్రకారుడు రవివర్మ ఇష్టమైన శైలి పెయింటింగ్స్ విద్యార్హతలు డ్రాయింగ్ సర్టిఫికెటు కోర్సు టి టి సి వృత్తి చిత్రలేఖనోపాధ్యాయుడు హాబీలు రచనలు, సంగీతం కళాకారుడుగా అనుభూతులు ఎంతరుచి చూసినా తరగని అమృతం కళ

# చలపాక ప్రకాష్



కలం పేరు చప్ర పూర్తి పేరు చలపాక ప్రకాష్ (కార్టూనిస్ట్/రచయిత), పుట్టిన తేది 9 జూన్ 1971, తల్లిదండ్రులు శివకన్య, వీరాచారి పుట్టిన ఊరు/జిల్లా విజయవాడ, కృష్ణా, అభిమాన చిత్రకారుడు/కార్టూనిస్టు బాపు, యం ఐ కిషన్, ఇష్టమైన శైలి ప్రజెంట్ టాపిక్స్ కార్టూన్స్ వేయడం, విద్యార్హతలు బి ఏ, బహుమతులు 1999 ఎ పి గవర్నమెంట్‌చే ఉత్తమ యువసాహితీవేత్త, 1993లో వాసవ్య మహిళా మండలి 1997లో స్వేచ్ఛా గోరా ఐ బ్యాంక్ నిర్వహించిన కార్టూన్స్ పోటీలలో ద్వితీయ బహుమతిలు వృత్తి గోల్డ్ స్మిత్, హాబీలు రచనలు చేయటం, కార్టూన్స్ వేయటం, కళాకారునిగా అనుభూతులు ఇంకా ప్రథమదశలోనే వున్నా, సాధించాల్సింది చాలా ఉంది




Chalapaka Prakash
P A Market,
Shop No 61,
Janda Street,
Vijayawada
Pin 520 001

## చక్రవర్తి టి



Chakravarthy
Artist, 13-1-30,
Main Road,
Anakapalle - 531 001
Hello 08924-24113

కుంచె పేరు చక్రవర్తి ఆర్ట్స్ పూర్తి పేరు తిమ్మాసాని సూర్యచక్రధరరావు (చిత్రకారుడు) పుట్టిన తేది 15 జులై 1962 తల్లిదండ్రులపేర్లు చిట్టమ్మ, అప్పలరాజు పుట్టిన ఊరు, జిల్లా అనకాపల్లి, విశాఖ అభిమాన చిత్రకారుడు ఆశపు అప్పారావు ఇష్టమైన శైలి కమర్షియల్ (కంప్యూటర్) విద్యార్హతలు ఇంటర్మీడియట్ ఫైన్ ఆర్ట్స్ టి టి సి (డ్రాయింగ్) హైయ్యర్ డ్రాయింగ్ బహుమతులు రోటరీ బెస్ట్ ఆర్టిస్టు అవార్డు వృత్తి ఫ్రీలాన్స్ ఆర్టిస్టు, (కంప్యూటర్ డిజైనింగ్, స్క్రీన్ ప్రింటింగ్) హాబీలు క్రికెట్ కళాకారుడుగా అనుభూతులు నా వృత్తి సంతోషము

## చంద్రశేఖర్



G Chandra Sekhar
G P Art Photo Studio
Near S L V Theater,
Guntakallu,
Ananthapuram-1
Hello 29005

పూర్తి పేరు గాండ్లపాటి చంద్రశేఖర్ (చిత్రకారుడు), పుట్టిన తేది 22 ఫిబ్రవరి 1962, తల్లితండ్రులు వీరమ్మ, రామప్ప, పుట్టిన ఊరు/జిల్లా తిమ్మాపురం, అభిమాన చిత్రకారుడు రవివర్మ, ఇష్టమైన శైలి వాష్ టెక్నిక్, ఆయిల్ పెయింటింగ్, విద్యార్హతలు బి కాం, ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్, టి టి సి హైయ్యర్, బహుమతులు నవరంగ్ చిత్రకళానికేతన్ వెల్లటూరు, కోనసీమ చిత్రకళా పరిషత్ అమలాపురం మొదలగునవి, వృత్తి ఆర్టిస్ట్, హాబీలు పెయింటింగ్స్, కళాకారునిగా అనుభూతులు బాలలకు చిత్రలేఖనం నేర్పించడం, పోటీలు నిర్వహించడంలో సంతృప్తి

## చెన్నకేశవులు యం.



M Chennakesavulu
S/o M Sundaresham,
H No 18-190 5
VenkateswaraNagar,
Kodumru 518 464

పూర్తి పేరు యం చెన్నకేశవులు (చిత్రకారుడు, కార్టూనిస్టు), పుట్టిన తేది 20 అక్టోబరు 1983, తల్లితండ్రులు సిద్ధమ్మ, సుందరేషం, పుట్టిన ఊరు/జిల్లా కర్నూలు అభిమాన చిత్రకారుడు/కార్టూనిస్టు బాపు, విద్యార్హతలు 10వ తరగతి, ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగు లోయర్ గ్రేడ్, వృత్తి గుమాస్తా, హాబీలు పెయింటింగ్

## చేగిరెడ్డి



Ch Chandrasekhar Reddy
Inkollu (P O & Mandal)
Pin 523 167
Hello 08594 44640

పూర్తి పేరు చేగిరెడ్డి చంద్రశేఖర రెడ్డి, (చిత్రకారుడు, శిల్పి) పుట్టిన తేది 1 జులై 1945, తల్లిదండ్రులు శ్రీమతి రాములమ్మ, లింగారెడ్డి, పుట్టిన ఊరు, జిల్లా మొహిదీన్‌పురం(పోస్ట్), ప్రకాశం, అభిమాన/ఆర్టిస్టు రవివర్మ, డావెన్సీ, విద్యార్హతలు ఎం ఏ ,(చరిత్ర), ఎం ఏ (తెలుగు) బి యిడి ఫైన్ ఆర్ట్స్ బి ఎఫ్ ఎ, టి టి సి హైయ్యర్, బహుమతులు యనెస్కో చిత్రకళారత్న, అనేక సంస్థల నుండి వృత్తి ప్రధానోపాధ్యాయుడు (జడ్ పి హెచ్చ్ స్కూల్,) బూదవాడ, హాబీలు చిత్రాలు, రచనలు, సామాజిక సేవ, నాటక రంగం అనుభూతులు అజ్ఞాతమైన దానిని అక్షర రూపాన్ని చిత్ర, శిల్ప రూపం చేయడం ప్రత్యక్ష్యం చేయడం, మాటల మధురిమల అనుభూతిని సైతం చిత్ర, శిల్ప రూపంలో ప్రత్యక్ష్యం చేయడం

## చంటి



K Narayana Rao
C/o S S Art Creations
21-8-52, Eluru Road,
Vijayawada-520 002
Hello 441197

పూర్తి పేరు కె నారాయణరావు (చిత్రకారుడు) పుట్టిన తేది 22 ఆగష్టు 1969 తల్లిదండ్రులు మహాలక్ష్మి, బాసన్న పుట్టిన ఊరు, జిల్లా మచిలీపట్నం, కృష్ణా అభిమాన చిత్రకారుడు రవివర్మ ఇష్టమైన శైలి రియలిజం విద్యార్హతలు 10వ తరగతి ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి వృత్తి కమర్షియల్ ఆర్ట్స్ & ఆయిల్ పెయింటింగ్స్ హాబీలు మ్యూజిక్, ప్రకృతి ఆరాధన కళాకారుడిగా అనుభూతులు గతాన్ని, భవిష్యత్‌ను, వర్తమానంలో ఆస్వాదించగలగటం

## జయన్ జి



G Jayanna
Kendriya Vidyalaya No2,
Carriage Repair Shop,
Settipalli, Tirupathi
Pin 517 506

పూర్తి పేరు జి జయన్న (చిత్రకారుడు, శిల్పి), పుట్టిన తేది 1 జూన్ 1971, తల్లిదండ్రులు రామయ్య, పుట్టిన ఊరు, జిల్లా బద్వేలు, కడప అభిమాన ఆర్టిస్టు ఎంద్రిమోర్, మైఖేలేంజిలో ఇష్టమైన శైలి ఆధునిక శైలి, విద్యార్హతలు ఫైన్ ఆర్ట్స్ బి ఎఫ్ ఏ , టి టి సి, బహుమతులు 1994లో జె ఎన్ టి యు వారిచే అవార్డు, 1998 ఏ పి గిల్డ్ అవార్డు, వృత్తి డ్రాయింగ్ టీచరు, హాబీలు ఆర్ట్ డైరెక్షన్

## జీవన్ ఆర్ కె




K Jeevanrao
Artist cum Photographer
Agrl Reasearch Station
Marteru 534 122


పూర్తి పేరు కుడిపూడి జీవన్‌రావు (చిత్రకారుడు) పుట్టిన తేది 17 డిసెంబరు 1955 పుట్టిన ఊరు/జిల్లా కాకినాడ, తూ॥గో॥ అభిమాన చిత్రకారుడు లియొనార్డో డావిన్సీ ఇష్టమైన శైలి సింపుల్ ఆర్ట్స్, క్లోజప్ ఫోటోగ్రఫీ విద్యార్హతలు ఇంటర్మీడియెట్ ఫైన్ ఆర్ట్స్ డిప్లొమా ఇన్ అప్లయిడ్ ఆర్ట్స్ వృత్తి ఆర్టిస్టు - కమ్ - ఫోటోగ్రాఫర్ హాబీలు బుక్స్ చదువుట, కంప్యూటర్ గ్రాఫిక్స్ కళాకారుడిగా అనుభూతులు "సృజనాత్మకతతో కూడిన నేను చేసిన పోస్టర్స్" అందరి మన్ననలు పొందడం

## జావేద్




Javed
(Vaartha Daily)
Lower Tank Bund Road
Hyderabad
Hello 7644999


ఆంధ్రభూమి దిన పత్రికలో కార్టూనిస్టుగా ప్రారంభ ఉద్యోగం ప్రస్తుతం వార్త తెలుగు దిన పత్రికలో కార్టూనిస్టుగా పనిచేస్తున్న ఈయన కథలకు, సీరియల్స్‌కు, ఇలస్ట్రేషన్స్ కూడా గీస్తున్నారు వార్త పత్రికలో




## జంగయ్య డి




D Jangaiah Artist
Doma (P O)
R R Dist
Pin 501 502


పూర్తి పేరు డి జంగయ్య (చిత్రకారుడు), పుట్టిన తేదీ 6 ఫిబ్రవరి 1973 తండ్రి పేరు వెంకటయ్య పుట్టిన ఊరు/జిల్లా దోమ, రంగారెడ్డి అభిమాన చిత్రకారులు ఎందరో మహానుబావులు ఇష్టమైన శైలి పెయింటింగ్ (కమర్షియల్ ఆర్ట్) విద్యార్హతలు బి ఏ , టి టి సి ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయ్యర్ బహుమతులు కొన్ని (ఇంకా సాధించాల్సి ఉంది) వృత్తి కమర్షియల్ ఆర్టిస్టు హాబీలు సామాజిక సేవ, బుక్ రీడింగ్ అనుభూతులు చిత్రకారుడిగా తృప్తి

## జంగయ్య గౌనికాడి



G Jangaiah
Drawing Teacher PSS,
Devaruppula,
Warangal Dist,
Pin 506 302

పూర్తి పేరు గౌనికాడి జంగయ్య (చిత్రకారుడు), పుట్టిన తేది 8 మార్చి 1952, తల్లిదండ్రులు వెంకటమ్మ, ఎల్లయ్య, పుట్టిన ఊరు, జిల్లా వెంకటాపురం, ఆర్ ఆర్ జిల్లా, అభిమాన ఆర్టిస్టు కె రాజయ్య, సిద్దిపేట, ఇష్టమైన శైలి జానపద చిత్రకళ, విద్యార్హతలు ఎస్ ఎస్ సి, ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయర్ బహుమతులు 1993 సం॥లో హైదరాబాద్ ఆర్ట్ సొసైటి వారిచే బంగారు పతకం 1989-90 సం॥లో వరంగల్ ఆర్ట్ సొసైటి వారిచే బెస్ట్ అవార్డు వృత్తి చిత్రకళా ఉపాధ్యాయుడుగ, హాబీలు చిత్రకళ

## జాన్‌రాజు ఇ ఇ



పూర్తి పేరు ఏలూరు ఎర్నెస్ట్ జాన్‌రాజు (చిత్రకారుడు), పుట్టిన తేది 1 జనవరి 1962 తల్లిదండ్రులు మార్తమ్మ, నవజీవన్ పుట్టిన ఊరు, జిల్లా విశాఖపట్టణం అభిమాన చిత్రకారుడు/శిల్పి పాల్‌గాగిన్ (ఐరోపా), హెన్రీమూర్ (ఇంగ్లండ్) ఇష్టమైన శైలి తక్కువరేఖలతో ఎక్కువ భావం చెప్పడం విద్యార్హతలు గ్రాడ్యుయేషన్ ఫైన్‌ఆర్ట్స్ బి ఎఫ్ ఎ (పెయింటింగ్) బహుమతులు/పురస్కారాలు 1978, 80, 85, 86 చిత్రకళా పరిషత్‌తో 1981 లలితకళా పరిషత్, 1993 నేషనల్ అవార్డు, 96లో బెస్ట్ టీచర్ అవార్డులతో పాటు అనేక కళామేళాలలో పాల్గొన్నాను వృత్తి ఆర్ట్ టీచర్ (జింక్ స్మెల్టర్ సీనియర్ సెకండరీ స్కూల్-విశాఖ) ఆశయం విద్యార్ధులకు చిత్రకళలో మెళకువలు సులభరీతిలో వివరించి, వారికి చిత్రకళ పట్ల మరింత మక్కువ కలుగజేయాలని నా పూర్తి ఆశయం



E E John Raju
445/C, Sec - III
V S P Town Ship
Visakha-530 032

## టీవీ



T Venkatrao
Artist,
Ramananagar,
Sunnapubhattela
Centre,
Vijayawada
Pin 520 010

పూర్తి పేరు టి వెంకట్రావ్ (చిత్రకారుడు, కార్టూనిస్టు, చిత్రకళా రచయిత) పుట్టిన తేది 2 ఫిబ్రవరి 1944 తల్లిదండ్రులపేర్లు అప్పాయమ్మ, రాములు పుట్టిన ఊరు, జిల్లా ఏలూరు, ప॥గో॥ అభిమాన చిత్రకారుడు లియొనార్డో డావిన్సీ ఇష్టమైన శైలి రియలిజం విద్యార్హతలు బి ఏ ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి బహుమతులు గోల్డ్ మెడల్ ఏరియా ఎడల్ట్ కాంపిటీషన్ వెల్లటూరు 1983, మరికొన్ని వృత్తి కార్టూనిస్ట్, పెయింటింగ్ టీచర్ హాబీలు గ్రంథపఠనం, పర్యటనలు ప్రచురించిన చిత్రకళా గ్రంథాలు 1) టి వి రాజకీయకార్టూన్లు, 2) చిత్రకళ చరిత్ర, 3) డ్రాయింగ్ నేర్చుకోండి, 4) పెయింటింగ్ నేర్చుకోండి, 5) కార్టూన్‌లు నేర్చుకోండి అనుభూతులు చిత్ర నగాత్ర కరస్పాండెన్స్ స్కూల్ ద్వారా



షుమారు1500 మందికి చిత్ర కళ, పెయిం టింగ్, కమర్షియల్ ఆర్ట్, కార్టూనింగ్‌లలో శిక్షణ ఇవ్వడం

## తులసీరాం



S T Ramachari,
D No 7-17-171,
Srinagar, 3rd Lane,
Guntur - 2

పూర్తి పేరు ఎస్ తులసీ రామాచారి, పుట్టిన తేది 24 ఏప్రిల్ 1941, తల్లిదండ్రుల పేర్లు సుబ్బమ్మ, షరాఫ్ పుల్లయ్య ఆచారి పుట్టిన ఊరు, జిల్లా ఆల్వకొండ, కర్నూలు అభిమాన కార్టూనిస్టు/శిల్పి ఆర్ కె లక్ష్మణ్, గణపతిస్థపతి, ఇష్టమైన శైలి క్రోక్విల్‌ని, బ్రష్‌ని ఫ్రీగా ఆడిస్తూ ఊహలకి రూపును కొత్తరీతిగా చిత్రీకరించడం, విద్యార్హతలు బి కాం ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్‌లో ఫ్రీహ్యాండ్, మోడల్ డిజైన్సు, నేచర్ పెయింటింగ్స్, లోయర్ గ్రేడు బహుమతులు ఎన్నెన్నో సంస్థల్నుంచి క్లబ్స్ నుంచి ప్రైజులు మెమెంటోలు వచ్చాయి, డ్రాయింగ్స్, కార్టూన్సు, ఎగ్జిబిషన్సు గుంటూరు, తెనాలి, నర్సాపురం వగైరా స్థలాలో జరిగాయి, వృత్తి జూనియర్ అకౌంట్స్ ఆఫీసర్‌గా రిటైర్డు, హాబీలు సంగీతం వినడం, శిల్పాలు చెక్కడం, నేచర్ పెయింటింగ్స్ గీయటం, చాక్‌పీస్‌లతో శిల్పాలు చెక్కడం, నా కార్టూన్లు వివిధ పత్రికలో ప్రచురించబడ్డాయి

## తార



పూర్తి పేరు తార రమేష్‌బాబు (చిత్రకారుడు,) పుట్టిన తేది 15 జనవరి 1960, తల్లిదండ్రులు లక్ష్మీనరసమ్మ, బసవలింగం, పుట్టిన ఊరు, జిల్లా భట్టిప్రోలు, గుంటూరు, అభిమాన ఆర్టిస్టు ఎస్ వి రామారావు, ఇష్టమైన శైలి నైరూప్యశైలి, విద్యార్హతలు ఇంటర్మీడియట్, టి టి సి, ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయ్యర్, బహుమతులు స్టేట్ క్యాష్ అవార్డు, చిత్రకళా కోవిద్ 1984, మచిలీ పట్టణం, ఆల్ ఇండియా ఆర్ట్ ఎగ్జిబిషన్ అవార్డు, వృత్తి డ్రాయిం గ్‌టీచర్, హాబీలు రచనలుచేయడం, చదవడం, కళా కారుడిగా అనుభూతులు కళాకారుడిగా జీవించడం నాకు లభించిన వరము



T Rameshbabu
Art Teacher,
A G K Municipal High School,
Gudivada,
Pin 521 301
Hello 46266 (R)

## త్రినాధ్ వి



పూర్తి పేరు వి త్రినాధరావు (ఆర్టిస్టు), పుట్టిన తేది 15 మే 1960, తల్లితండ్రులు చంద్రమ్మ, చంద్రయ్య, పుట్టిన ఊరు/జిల్లా తగరపువలస, విశాఖ, విద్యార్హతలు ఎస్ ఎస్ సి, ఫైన్ ఆర్ట్స్ బి ఎఫ్ ఏ(పెయింటింగ్) ఎం ఏ (పెయింటింగ్), బహుమతులు చదువుకునే రోజుల్లో చాలా బహుమతులు అందుకున్నాను వృత్తి ఫ్రీలాన్స్ ఆర్టిస్టు, హాబీలు పుస్తకాలు చదవడం, ఫోటోగ్రఫీ

V Trinadharao
# 9 111,
Narasimha Nagar,
Gopalapatnam,
Visakhapatnam 27
Hello 520468

## తపస్వి



పూర్తి పేరు వెనిగళ్ళ నరేష్‌కుమార్ (చిత్రకారుడు), పుట్టిన తేది 7 సెప్టెంబరు 1973, తల్లితండ్రులు లక్ష్మి, భాస్కరరావు, పుట్టిన ఊరు/జిల్లా నూజివీడు, కృష్ణా, అభిమాన చిత్రకారుడు/కార్టూనిస్టు రాజా రవివర్మ, బాపు, ఇష్టమైన శైలి లైన్ ఆర్ట్, విద్యార్హతలు బి కాం, వృత్తి పెయింటర్, హాబీలు ఆర్ట్స్, కవితలు వ్రాయడం

V Naresh Kumar
Opp Dwaraka Theatre
Sri Venkateswara Complex,
Nuzvid 521 201
Hello 34162 (R)

## త్రివేణి



పూర్తి పేరు పంతం రామానుజయ్య నాయుడు (నఖ చిత్రకారుడు,) పుట్టిన తేది 9 ఆగష్టు 1944, తల్లిదండ్రులు శేషవేణి, పీరయ్యనాయుడు, పుట్టిన ఊరు, జిల్లా చిక్కాల, ప॥గో॥ అభిమాన కార్టునిస్టు/ ఆర్టిస్టు బాపు, ఇష్టమైన శైలి నఖచిత్రం ద్వారా పేర్లు గీయుట, విద్యార్హతలు 8వ తరగతి, బహుమతులు పురప్రముఖులచే 2 సార్లు సన్మానం, స్థానిక పత్రికలలో ప్రశంసలు, వృత్తి వ్యవసాయం, హాబీలు బాల్ బ్యాడ్మింటన్ క్రీడ మరియు నఖచిత్రాలు గీయటం, కళాకారుడిగా అనుభూతులు స్థానికుల మరియు పత్రికల ప్రశంసలందుకున్నప్పుడు అమితోత్సాహము పొందినాను

P Ramanujayya Naidu,
Vangalapudi (Post),
Seethanagaram (Mandal)
Pin 533 287
Hello 458646

## తోటపల్లి మనోజ్



పూర్తి పేరు తోటపల్లి రస్సల్ మనోజ్ (కార్టూనిస్టు) పుట్టిన తేది 5 జులై 1974 తల్లిదండ్రులు సుహాసిని, హెన్రీ పుట్టిన ఊరు, జిల్లా తిరుపతి అభిమాన చిత్రకారుడు లియోనార్డో డావిన్సీ ఇష్టమైన శైలి కమర్షియల్ ఆర్ట్, కార్టూనిజం విద్యార్హతలు బి యస్ సి డి సి ఏ ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి బహుమతులు పాఠకుల అభినందనలు వృత్తి వ్యాపారం, రచనలు హాబీలు సంగీతం వినడం, మిమిక్రీ, నటన

T Manoj
East Mission Compound,
D No 6 1 9,
Maternity Hospital Road,
Tirupati - 517 501

## సన్నాల



పూర్తి పేరు  సన్నాల సత్యన్నారాయణ వరప్రసాద్ (చిత్రకారుడు) పుట్టిన తేది  30 ఆగష్టు 1948 తల్లిదండ్రులు  వెంకమహాలక్ష్మి, వెంకటేశ్వరరావు పుట్టిన ఊరు, జిల్లా  విజయవాడ,కృష్ణా అభిమాన చిత్రకారుడు రెంబ్రాండ్ ఇష్టమైన శైలి  మీనియేచర్స్ విద్యార్హతలు యస్ యస్ ఎల్ సి  ఫైన్ ఆర్ట్స్ మద్రాస్ హయ్యర్ బహుమతులు/పురస్కారాలు  దామెర్ల రామారావు మెమోరియల్ ఆర్ట్ గ్యాలరీ రాజమండ్రి(1972-74), కాకతీయ ఆర్ట్ సొసైటీ - వరంగల్ (1980), ఆంధ్రా అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ విజయవాడ  చిత్రకళా ప్రదర్శనలు  విజయవాడ, గుంటూరు న్యూఢిల్లీ, మద్రాసు, బెంగుళూరు, తంజావూరు మొ॥ జాతీయస్థాయిలో అనేక పట్టణాలలో జరిగిన కళామేళాలలోను, ఆర్ట్ క్యాంప్స్‌లోనూ పాల్గొన్నాను  సెక్రటరీ  ఆంధ్రా అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ విజయవాడ ఉపాధ్యక్షులు ఆస్కా వృత్తి  ఆయిల్ పోర్ట్రైట్స్,మీనియేచర్స్, పెయింటింగ్,డ్రాయింగ్ కోచింగ్  హాబీలు  పెయింటింగ్స్ చేస్తూ ప్రదర్శన ఇవ్వడం  కళాకారుడిగా అనుభూతులు  పెయింటింగ్ చేస్తున్నపుడు తరువాత ఆనందాన్నిపొందుతాను



Sannala S V Prasad,
D No 32-15-126,
Beside Earrameda,
Mogalrajpuram,
Vijayawada - 10
Hello 484189

## సత్యం పి



పూర్తి పేరు  పి వి వి యస్ ఎన్ రావు (చిత్రకారుడు)  పుట్టిన తేది  11 జూన్ 1969 తల్లిదండ్రులు  భువనేశ్వరి, జగన్నాధరావు  పుట్టిన ఊరు/జిల్లా  హైదరాబాద్, ఆర్ ఆర్ జిల్లా  అభిమాన చిత్రకారుడు  వడ్డాది పాపయ్య, బౌషర్  ఇష్టమైన శైలి  రినైజాన్స్, రీపొడక్షన్స్, ఇన్ ఆయిల్ కలర్స్ విద్యార్హతలు  పి యు సి ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయర్  వృత్తి  జూనియర్ అసిస్టెంట్, మున్సిపల్ ఆఫీస్  హాబీలు  పెయింటింగ్‌బుక్స్ కలెక్షన్  కళాకారుడిగా అనుభూతులు  మాటలకందనివి

P Satyam, Artist,
Dream Works Gallery
D No 29-3 19
Naidu Street,
Mandapeta - 533 308

# సత్యమూర్తి



పూర్తి పేరు  బావరాజు వెంకట సత్యమూర్తి (కార్టూనిస్టు, రచయిత) విద్యార్హతలు  బి యల్ ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి. బహుమతులు/ పురస్కారాలు  1986లో వంశీ బర్కిలీ అవార్డు, 1997లో ఢిల్లీ తెలుగు అకాడమీవారి ఉగాది పురస్కార్ అవార్డు, 1998లో ఢిల్లీ తెలుగు అకాడమీ వారు సన్మానించారు  ఆంధ్రసచిత్ర వార పత్రికలో 'చదువుల్రావు' 'అల్లాటప్పయ్య' అనే కార్టూన్ ఫీచర్స్, ఆంధ్రప్రభ వీక్లీలో బొమ్మల కథలు, కార్టూన్స్, ముఖచిత్రాలు, ఆంధ్రభూమి వీక్లీలో బొమ్మల కథలు, 'కార్టూన్స్ వేయడం ఎలా?' అనే ఫీచర్స్ నిర్వహణ  కార్టూన్ బుక్స్  'కార్టూన్స్ వేయడం ఎలా?' తెలుగులో స్వీయప్రచురణ ఇంగ్లీషులో 'హౌ టు డ్రా కార్టూన్స్' పేరుతో పుస్తక్‌మహల్ ఢిల్లీవారు ప్రచురించారు  ఎగ్జిబిషన్  1987లో ఎ పి భవన్ ఢిల్లీలో కార్టూన్ ఎగ్జిబిషన్, హైదరాబాద్‌లో యువ కార్టూనిస్టుల కోసం అనేకసార్లు వర్కుషాప్స్, నిర్వహణ, లలిత కళా అకాడమీలో ఐదుఏళ్ళు కౌన్సిల్ మెంబరుగా ఉన్నాను  వృత్తి  కార్టూనిస్టు మరియు అడ్వ టైజింగ్ కన్సల్టెంట్ - శ్రీ సత్యసాయి డిజైనింగ్‌స్టూడియో -హైదరాబాద్  కళాకారుడుగా అనుభూతులు



కార్టూనిస్టుగా లక్షలాది పాఠకుల అభిమానం ఆదరణ పొందడం


Satyamurthy
B 68/F5,
Vijayanagar Colony,
Hyderabad-57
Hello (O) 3317473
(R) 3342376


# సృజన్



పూర్తి పేరు  పాటిమళ్ళ వెంకట సుబ్బారావు (చిత్రకారుడు), పుట్టిన తేది  4 మే 1972, తల్లిదండ్రులు  శివరాజ్యలక్ష్మి, డా॥రామ్మోహన్‌రావు పుట్టిన ఊరు, జిల్లా  నరసరావుపేట, గుంటూరు  అభిమాన ఆర్టిస్టు  ఇంగ్రీస్, మైఖేలేంజిలో,  ఇష్టమైన శైలి  వాటర్ ఆయిల్ అండ్ వాటర్ మీడియా, విద్యార్హతలు  10 వతరగతి ఫైన్ ఆర్ట్స్  డి ఎఫ్ ఏ, టి టి సి, ఫోటోగ్రఫీ డిప్లొమా,  బహుమతులు  1991లో (వెల్లటూరు) నవరంగ్ చిత్రకళానికేతన్ ప్రధమ బహుమతి, 1977 ఆంధ్రా ఆర్ట్ అకాడమీ మ్యూజియం పర్చేజ్ అవార్డు,  వృత్తి  ఫ్రీలాన్స్ ఆర్టిస్టు,  హాబీలు  ఫోటోగ్రఫీ  కళాకారుడిగా అనుభూతులు  అసంతృప్తికరమైన జీవితం


Srujan
Sravanthi Graphics,
Museum Road,
Vijayawada-2
Hello 576084

# సీతారామస్వామి కొరసాల



పూర్తి పేరు  కొరసాల సీతారామస్వామి (చిత్రకారుడు) పుట్టిన తేది 26 ఏప్రిల్ 1948 తల్లిదండ్రులు  సత్యవతి, సత్యనారాయణమూర్తి పుట్టిన ఊరు, జిల్లా  మామిడికుదురు, తూ॥గో॥ అభిమాన చిత్రకారుడు బాపు ఇష్టమైన శైలి  వాటర్ టెంపారా కలర్ స్కీమ్ విద్యార్హతలు పి యు సి ఫైన్ ఆర్ట్స్ డిప్లొమో ఇన్ ఫైన్ ఆర్ట్సు బహుమతులు 2000 రాష్ట్రస్థాయి ఉత్తమ ఉపాధ్యాయ (ఆర్ట్) అవార్డు, చిత్రకళా ప్రపూర్ణ, చిత్రకళారాధక బిరుదులు వృత్తి  ఆర్టుటీచర్ జిల్లా పరిషత్ గరల్స్ హైస్కూలు, అమలాపురం హాబీలు  ఫోటోగ్రఫీ, కంప్యూటర్ డిజైనింగ్ కళాకారుడిగా అనుభూతులు  చిత్రకారుడుగా పుట్టడమే నేను చేసుకొన్న అదృష్టం ఇంతటి పేరు ప్రఖ్యాతులకు కారణం ఈ చిత్రకళే వ్యవస్థాపక కార్యదర్శి  కోనసీమ చిత్రకళా పరిషత్ అధ్యక్షులు  వండర్ ఆర్ట్ వరల్డ్ ఇంటర్నేషనల్  ఆరాధనా చిత్రావళి అనే పేరుతో అష్టోత్తర, సహస్రనామాలతో లక్ష్మి, వినాయక, సరస్వతీ మొదలగు '50' రకాల చిత్రాలను ప్రచురించిన నా 'చిత్రాలు' లక్షలాది గృహాల పూజామందిరాలలో నిత్యపూజకు నోచుకోవడం నా అదృష్టం



K Sitaramaswamy
Co Operative Colony,
Amalapuram,
Pin 533 201
Hello 31772

## సరసి



పూర్తి పేరు  ఎస్ రామనరసింహం (కార్టూనిస్టు), పుట్టిన తేది  5 జులై 1955, తల్లితండ్రులు  వెంకట రమణమ్మ, వెంకటేశ్వర్లు, పుట్టిన ఊరు/జిల్లా  బోడపాడు, పశ్చిమ గోదావరి  అభిమాన చిత్రకారుడు బాపు, విద్యార్హతలు  ఎం ఏ (ఫిలాసఫీ),ఎల్ ఎల్ బి , ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి, బహుమతులు  1993లో జపాన్ లార్జస్ట్ సర్క్యులేటెడ్ ఇంగ్లీషు డైలీ నిర్వహించిన ఇంటర్‌నేషనల్ కార్టూన్ కాన్టెస్ట్‌లో హానరబుల్ అవార్డు, ఏ పిలో కార్టూన్ కాంటెస్ట్‌లో పలుసార్లు ప్రథమ, ద్వితీయ బహుమతులు, కొరియా, జపాన్, ఇటాలియా, ఇరాన్‌దేశాల ఎగ్జిబిషన్స్‌లో నా కార్టూన్ల ప్రదర్శన  వృత్తి  రిపోర్టర్, ఏ పి లేజిస్లేటివ్ అసెంబ్లీ(హైదరాబాద్), హాబీలు  చిత్రరచన, కథారచన, సంగీతం (ఫ్లూట్), కళాకారుడిగా అనుభూతులు  కళాకారుడుగా పుట్టడం అదృష్టంగా భావిస్తున్నాను


› Ramanarasimham
Flat No 56, Street 3,
Anantha Saraswathi Nagar
Safilguda,
Hyderabad 500 047


## సుభాని



1986లో ఆంధ్రభూమి వారపత్రికలో స్టోరీ ఇలస్ట్రేటర్‌గా ప్రారంభ ఉద్యోగం, 1991 నుండి డెక్కన్ క్రానికల్ డైలీలో కార్టూనిస్టుగా ప్రమోట్ అయ్యారు  ప్రస్తుతం డెక్కన్ క్రానికల్ గ్రూపు ప్రచురణల విభాగానికి చీఫ్ కార్టూనిస్టుగా పనిచేస్తున్న సుభాని అనేక పుస్తకాలను తన కుంచెతో రూపొందించారు





Subhani
Deccan Dhronicle
Sarojini Devi Road
Secundrabad
Hello 7803930

## సత్యనారాయణ



S Satyanarayana
D No 939H2/C,
Vivekananda Street,
Korlagunta
Tirupati - 517 501
Hello 29868

పూర్తి పేరు  శింగంపల్లి సత్యనారాయణ (చిత్రకారుడు, ఫోటోగ్రాఫర్), పుట్టిన తేది  2 అక్టోబరు 1945, తల్లిదండ్రుల పేర్లు  రాములమ్మ, అప్పలస్వామి, పుట్టిన ఊరు, జిల్లా  పెద్దాపురం, తూ గో  అభిమాన చిత్రకారుడు  బాపు, ఇష్టమైన శైలి  రియలిస్టిక్, సింబాలిక్, విద్యార్హతలు  బి ఏ (తెలుగు), ఫైన్ ఆర్ట్స్  గవర్నమెంట్ డిప్లొమా ఇన్ కమర్షియల్ ఆర్ట్, జె ఎన్ టి యు  బహుమతులు  వర్క్‌షాప్స్, కోచింగ్ క్లాస్, ఎగ్జిబిషన్లు, తిరుపతి, కాళహస్తిలో సన్మానాలు అవార్డులు ప్రాంతీయస్థాయిలో  వృత్తి  ఆర్టిస్ట్ మరియు ఫోటోగ్రాఫర్ (యస్ వి అగ్రికల్చరల్ కాలేజి, తిరుపతి) హాబీలు  కథలు, కవితలు చిత్రకళపై వ్యాసాలు జీవితచరిత్రలు, నాటికలు, రూపకాలు(రేడియోలకు) కళాకారుడిగా అనుభూతులు  అన్ని కోణాలలో ఎదిగిన బాపు తెలుగు వ్యక్తిగా పుట్టటం మన అదృష్టం

## సుధ పచ్చిగోళ్ళ



P Sudha
R S Bhavan, Main Road,
Amalapuram
Pin 533 201

పూర్తి పేరు  పచ్చిగోళ్ళ సుధ (కార్టూనిస్టు), పుట్టిన తేది  1956, తల్లితండ్రులు  కురివేళ్ళ వెంకటరవణమ్మ, సుబ్బారావు, పుట్టిన ఊరు/జిల్లా  సీతానగరం, తూ॥గో॥ విద్యార్హతలు  10వ తరగతి బహుమతులు  సాహితీ బ్రహ్మ, సాహితీ రత్న, వృత్తి  రచయిత్రి ఎల్ ఐ సి  ఏజెంట్, హాబీలు  సంగీతం వినటం, కళాకారిణిగా అనుభూతులు  ఎన్నోవందల హృదయాల్లో స్థానాన్ని పొందడం

## సోములు నందవరపు



N Somulu
D No 6 211
Padmanabha Nagar
Venkatapuram (P O)
Visakha - 29

కలం పేరు  సోములు  పూర్తి పేరు  నందవరపు సోములు (చిత్రకారుడు), పుట్టిన తేదీ  15 ఏప్రియల్ 1967  తల్లిదండ్రులు  చిట్టెమ్మ, సన్యాసి  పుట్టిన ఊరు/జిల్లా  పద్మనాభనగర్, విశాఖ  అభిమాన చిత్రకారులు  ఎందరో మహానుబావులతో పాటు బాపు, వడ్డాది పాపయ్య  ఇష్టమైన శైలి  పెయింటింగ్  విద్యార్హతలు  ఎం ఏ , ఫైన్ ఆర్ట్స్  ఐ టి ఐ (పెయింటర్), స్వయంకృషి  బహుమతులు  జిల్లా మరియు రాష్ట్రస్థాయిలో  కొన్ని  హాబీలు  సామాజిక సేవా కార్యక్రమాలు చేపట్టడం  అనుభూతులు  చిత్రకళ ద్వారా మానసికానందం పొందుతాను

## సాల్మన్‌రాజు పి



Dr P Solomon Raju
54 16 4,
Loyola Gardens,
Vijayawada - 8
Hello 454765

కుంచె పేరు సరళశ్రీ పూర్తి పేరు పి సాల్మన్‌రాజు (చిత్రకారుడు, ఆర్టిస్టు) పుట్టిన తేది 21 ఫిబ్రవరి 1921 పుట్టిన ఊరు, జిల్లా నిగ్రహపురి, ప॥గో॥ అభిమాన చిత్రకారుడు ఆల్‌బ్రెక్ట్ డ్యూరర్ ఇష్టమైన శైలి బాతిక్స్ మరియు వుడ్‌కట్స్ విద్యార్హతలు బి యస్ సి , బి యిడి , పిహెచ్ డి ఫైన్ ఆర్ట్స్ యం యస్ (ఇండియన్ యూనివర్శిటీ యు యస్ ఎ) బహుమతులు Honarary Fellow of Selly Oak Colleges 1991, Agrist in Residence, three Lutheran Colleges in USA 1986, ACAA Scholarship 1992 వృత్తి ఫ్రీలాన్స్ ఆర్టిస్టు



## స్వామి



D Verabhadra Swamy,
Durgi (P O)
Guntur Dist,
Pin 522 612
Hello 78956

పూర్తి పేరు ధారల వీరభద్రస్వామి (చిత్రకారుడు), పుట్టిన తేది 13 మే 1971, తల్లితండ్రులు వెంకట్రావమ్మ, ఈశ్వర భిక్షమాచారి, పుట్టిన ఊరు/జిల్లా దుర్గి, గుంటూరు, అభిమాన చిత్రకారుడు/శిల్పి రవివర్మ, అమరశిల్పి జక్కన, విద్యార్హతలు 10వ తరగతి, ఫైన్ ఆర్ట్స్ ఫ్రీ హాండ్ అవుట్ లైన్, మోడల్ డ్రాయింగ్ (హైయ్యర్), ఆయిల్ పెయింటింగ్ (హైయ్యర్) బహుమతులు గ్రామస్థాయి చిత్రలేఖన ప్రశంసా పత్రం, మండల స్థాయి చిత్రలేఖన ప్రశంసా పత్రం, వృత్తి శిల్పం, హాబీలు పెయింటింగ్, శిల్పం

# సాయికృష్ణ



పూర్తి పేరు టి సాయికృష్ణ, ( ఆర్టిస్టు ) పుట్టిన తేది 16 జనవరి 1947 అభిమాన చిత్రకారుడు బాపు, వడ్డాది పాపయ్య విద్యార్హతలు ఫిలాసఫీలో మాస్టర్ డిగ్రీ అందుకున్న ఈయన ఉస్మానియా యూనివర్సిటీ నుంచి డాక్టరేట్ అయ్యారు హైదరాబాద్ ఎ వి కళాశాలలో బోటనీ శాఖాధిపతిగా మరియు వైస్ ప్రిన్సిపాల్‌గా కూడా భాధ్యతలు నిర్వహిస్తూ సుమారు మూడువేల చిత్రాలు రచించారంటే నమ్మశక్యం కాదు సాయికృష్ణ రేఖాచిత్రకళలో తనదైనశైలిని సృష్టించుకొని 1970 నుండి ప్రముఖ తెలుగు, ఇంగ్లీషు, కన్నడ పత్రికలలో గీస్తున్నారు గీతగోవిందం, అమరుక శతకం, ఋతుసంహారం, మనుచరిత్ర, మేఘ సందేశం, అన్నమాచార్య కీర్తనలు, క్షేత్రయ్య పదాలు, ఆరుద్ర 'దక్షిణవేదం', వాత్స్యాయనుడి 'కామసూత్రాలకు' చిత్రరచన చేసిన డాక్టర్ సాయికృష్ణ తొలిచిత్రకళా ప్రదర్శన 1975లో హైదరాబాద్ కళాభవన్‌లో జరిగింది తర్వాత ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా 1980లో మలేషియా, 1989లో రాజమండ్రి, 1990లో విజయవాడ, 1991లో మచిలీపట్నంలలో ఆయన చిత్రాలను ప్రదర్శించారు



Dr T Sai Krishna
Artist
Head of the Dept
of Botony
A V College
Hyderabad

## సుదర్శన్



పూర్తి పేరు  పిట్టంపల్లి సుదర్శన్ (చిత్రకారుడు,) పుట్టిన తేది  2 ఫిబ్రవరి 1951, తల్లిదండ్రులు  లక్ష్మమ్మ, మట్టయ్య, పుట్టిన ఊరు, జిల్లా  మిర్యాలగూడ, నల్గొండ, విద్యార్హతలు  బి ఏ , బి ఇడి  ఫైన్ ఆర్ట్స్  డిప్లొమా ఇన్ డ్రాయింగ్, బహుమతులు  1989లో 'దాసి' చిత్రానికి ఉత్తమ కాస్ట్యూమ్ డిజైనర్‌గా రాష్ట్రపతి నుండి జాతీయ బహుమతి, 1992లో రాష్ట్రస్థాయి ఉత్తమ ఉపాధ్యాయుడుగా ముఖ్యమంత్రి నుండి పురస్కారం, వృత్తి  డ్రాయింగ్ టీచర్, గవర్నమెంట్ మోడల్ స్కూల్, నాగార్జునసాగర్  హాబీలు  కళాత్మక చిత్రాలకు,



డాక్యుమెంటరీలకు కాస్ట్యూమ్స్, సంగీతం, నృత్యం, కళాదర్శకత్వం వహించడం, కళాకారుడిగా అనుభూతులు  కాస్ట్యూమ్ డిజైనర్‌గా జాతీయ బహుమతి అందుకున్న ప్రప్రధమ దక్షిణభారత కళాకారుడను కావడం, దాసి, మట్టిమనుషులు, చిత్రాలకు కాస్ట్యూమ్ డిజైనర్‌గా, మావూరు చిత్రానికి కాస్ట్యూమ్ డిజైనర్‌గా మరియు అసోసియేట్ ఆర్ట్ డైరెక్టర్‌గా పనిచేయడం, రెండువందల పుస్తకాలకు ముఖచిత్రాలు గీయడం


Sudharshan
B/744, Hill colony,
Nagarjunasagar
Pin  508 202,
Hello  76320


## సుతాపా



పూర్తి పేరు  సుతాపా దత్తా చటర్జీ (చిత్రకారిణి, టెక్స్‌టైల్ డిజైనర్) పుట్టిన తేది  6 మే 1975  తల్లిదండ్రులపేర్లు  సబితా చటర్జీ, శ్రీ క్రిష్ణా చంద్ర చటర్జీ పుట్టిన ఊరు, జిల్లా  రూప్‌నారాయనపూర్, బర్ద్‌మానే, వెస్ట్ బెంగాల్ అభిమాన చిత్రకారుడు  జమిని రాయ్, దేవిప్రసాద్ రాయ్ చౌదరి ఇష్టమైన శైలి  డిజైనింగ్ (టెక్స్‌టైల్) విద్యార్హతలు  హెచ్ యస్ ఇ. ఫైన్ ఆర్ట్స్ బి వి ఏ (టెక్స్‌టైల్ డిజైనింగ్) బహుమతులు  2 స్కాలర్‌షిప్స్ ఇన్ 1999–2000 గవర్నమెంట్ ఆర్ట్ అండ్ క్రాఫ్ట్స్ వృత్తి  టెక్స్‌టైల్ డిజైనింగ్ హాబీలు  సంగీతం వినడం కళాకారిణిగా అనుభూతులు  ఎలాంటి పరిస్థితిలోను కళా ప్రగతి ఆగకూడదు


Sutapa Dutta Chatarjee
W/o Sushant Dutta,
K V INS Kalinga
Bheemuni Patnam,
Visakhapatnam 63
Hello  899002

## సాగర్ జి.



G Venkateswarulu
(Sagar)
Skilled Asst
S V I T N A, T T D
Alipiri, Tirupati
Pin 517 507
Hello 08574
(O)31017, (R) 34497

పూర్తి పేరు గిన్నె వెంకటేశ్వర్లు (చిత్రకారుడు) పుట్టిన తేది 2 అక్టోబరు 1965 తల్లిదండ్రులు భీసమ్మ, రాములు పుట్టిన ఊరు/జిల్లా మూసాపేట్, మహబూబ్‌నగర్ అభిమాన చిత్రకారుడు రవివర్మ ఇష్టమైన శైలి రీఫిల్‌తో చుక్కల సహాయంతో చిత్రించడం విద్యార్హతలు యం ఏ ఫైన్ ఆర్ట్స్ బి ఎఫ్ ఏ (పొట్టి శ్రీరాములు) తెలుగు యూనివర్సిటి హైదరాబాద్ బహుమతులు జాతీయ స్థాయిలో స్కాలర్‌షిప్ అవార్డు, ఆం॥ప్ర॥రాష్ట్ర గవర్నర్ మరియు ముఖ్యమంత్రుల అభినందనలు ప్రత్యేక చిత్రరచన గతకొన్నాళ్ళుగా రీఫెల్‌పెన్స్ ఉపయోగించి చిత్రరచన చేయుచున్నాను బ్లాక్ రీఫిల్స్‌తో చుక్కలు మరియు లైన్స్ సహాయంతో చేస్తూ ఉన్నాను ఈ తరహా మీడియాతో దాదాపు వందకు పైగా చిత్రాలు చిత్రించాను ప్రదర్శనలు హైదరాబాద్, తిరుపతి, నాగపూర్, విశాఖపట్నంలలో వృత్తి ఉపాధ్యాయుడిగా(యస్ వి ఐటి యస్ ఎ –టి టి డి , తిరుపతి) హాబీలు చిత్ర రచన చేయడం కళాకారుడిగాఅనుభూతులు కళ కడుపు నిండిన వాడికి ఇంకా బాగుంటుంది



బాల్‌పెన్ రీఫిల్ చుక్కలతో – గాంధీ చిత్రం

## సత్యలింగం వుడయార్



D Satya Linga Udayar
Sri Lakshmi Silpa Nilayam
C/o Govada Ramesh Babu,
Tellbadu (P O)
Ongole (R M S)

పూర్తి పేరు దేవగుప్తపు సత్యలింగం వుడయార్ (శిల్పి), పుట్టిన తేది 11 మే 1977, తల్లితండ్రులు లక్ష్మీకాంతం, శ్రీనాధరత్న శిల్పి వుడయార్, పుట్టిన ఊరు/జిల్లా వెనుమంట్ర, ప॥గో॥ అభిమాన చిత్రకారుడు రవివర్మ, మా తండ్రిగారు, ఇష్టమైన శైలి శిల్పంలో సనాతన శైలి, విద్యార్హతలు ఇంటర్మీడియట్, ఫైన్ ఆర్ట్స్ డి ఎఫ్ ఏ, బహుమతులు 1991లో నాటి ముఖ్యమంత్రి ఎన్ జనార్ధన రెడ్డి గారిచే 14 ఏళ్ళప్రాయంలో యువ కళాబ్రహ్మ బిరుదు ప్రదానం, 1998లో కేంద్రమంత్రి రామ్ విలాస్ పాశ్వాన్ అభినందనలు వృత్తి శిల్పి హాబీలు పుస్తక పఠనం, ప్రకృతి సౌందర్య ఆరాధన, కళాకారునిగా అనుభూతులు మీ ఈ ఆంధ్ర కళాదర్శిని ముద్రణ మర్చిపోలేని అనుభూతి

# సుజాత



T Sujatha
D/o Ramakrishna Rao
D No 15/133,
Patapet,
Nuzvid-1

పూర్తి పేరు తలగడదీవి సుజాత (చిత్రకారిణి) పుట్టిన తేదీ 3 జూన్ 1976, తల్లిదండ్రులు జ్యోతి, రామకృష్ణ, పుట్టిన ఊరు, జిల్లా నూజివీడు, కృష్ణా, అభిమాన ఆర్టిస్టు దామెర్ల రామారావు, ఇష్టమైన శైలి మోడరన్ ఆర్ట్, విద్యార్హతలు ఇంటర్‌మీడియట్, టి టి సి, ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయ్యర్, బహుమతులు కోనసీమ కళాపరిషత్ వారు నిర్వహించిన పోటీలకు "బెస్ట్ టీచర్ అవార్డు - 1999" వృత్తి ఆర్టిస్ట్, హాబీలు మోడరన్ పెయింటింగ్ కలెక్షన్స్, డ్రాయింగ్ నేర్పుట, కళాకారిణిగా అనుభూతులు బెస్ట్ టీచర్ అవార్డు పొందుట

# సత్యనారాయణ పి.



P Satyanarayana
Chinarajupet,
D No 10-2-16,
Anakapalle
Pin 531 001
Hello 26473

కుంచె పేరు వాణీ ఆర్ట్సు పూర్తి పేరు పందూరి సత్యనారాయణ (చిత్రకారుడు, శిల్పి) పుట్టిన తేదీ 1 జులై 1963 తల్లిదండ్రులపేర్లు మహాలక్ష్మీమ్మ, సూర్యనారాయణ పుట్టిన ఊరు, జిల్లా అనకాపల్లి, విశాఖ అభిమాన చిత్రకారుడు మా నాన్నగారు, మరియు జి యల్లయ్య గారు ఇష్టమైన శైలి మోడరన్ ఆర్ట్ దేవాలయ విగ్రహం, దేవతా విగ్రహాలు విద్యార్హతలు పదవ తరగతి ఫైన్ ఆర్ట్సు డ్రాయింగ్ లోయర్ గ్రేడ్ బహుమతులు అనేకములు వృత్తి కమర్షియల్ ఆర్ట్సు శిల్పం (సిమెంటు విగ్రహాలు) హాబీలు వృత్తిపట్ల పెద్దల శైలిని గమనించడం కళాకారుడుగా అనుభూతులు చాలా సంతోషం, ఆనందంగా ఉంది



## సుషాంత్



Sushant Datta
Drawing Master,
I N S Kalinga,
Bheemunipatnam,
Visakhapatnam-63
Hello 899002

పూర్తి పేరు సుషాంత్ దత్తా (చిత్రకారుడు) పుట్టిన తేది 17 జనవరి 1970 తల్లిదండ్రులపేర్లు పద్మదత్తా, చిత్తరంజన్ దత్తా పుట్టిన ఊరు, జిల్లా అస్సాం సోల్, వెస్ట్ బెంగాల్ అభిమాన చిత్రకారుడు రవీంద్రనాథ్ రాగూర్, రామ్‌కింకర్ జైన్ ఇష్టమైన శైలి క్రియేటివ్ పెయింటింగ్, మ్యూరల్ విద్యార్హతలు హెచ్ ఎస్ ఇ. ఫైన్ ఆర్ట్స్ ఎమ్ ఎఫ్ ఏ యూనివర్శిటి ఆఫ్ హైదరాబాద్ (సెంట్రల్) బహుమతులు మెరిట్ సర్టిఫికెట్ (గవర్నమెంట్ ఆర్ట్ కాలేజ్ ఆఫ్ ఆర్ట్(క్రాఫ్ట్స్), గోల్డ్ మెడల్ ఇన్ యం ఎఫ్ ఏ వృత్తి డ్రాయింగ్ టీచర్ (కేంద్రీయ విద్యాలయ, భీమునివట్నం) హాబీలు రచనలు చేయడం కళాకారుడిగా అనుభూతులు చిత్రకళ జీవితానికి అద్దం వంటిది

## సూర్య



Surya
The Munsif Daily
Khan Lateef Khan
Estate
Hyderabad
Hello 242082

1995లో వార్త తెలుగు దిన పత్రికలో కెరీర్ ప్రారంభించి 1988 లో నుండి మన్సిఫ్ ఉర్దూ డైలీలో కార్టూనిస్టుగా పనిచేస్తున్నారు ఈయన కార్టూనిస్టు మాత్రమే కాదు, మంచి ఆర్టిస్టు, ఇలస్ట్రేటర్ కూడా




## సూరత్తు సుబాష్



S Subhas
Studio 7, No 37,
Rao & Raju Colony
Road No 2, Banjara Hills,
Hyderabad 34,
Hello 3544390

పూర్తి పేరు సూరత్తు సుబాష్ (చిత్రకారుడు, శిల్పి), తల్లిదండ్రుల పేర్లు రంగామణి, వేంకటేశ్వరరావు అభిమాన చిత్రకారుడు బాపు విద్యార్హతలు మెట్రిక్ వృత్తి కెమెరా అసిస్టెంట్, హాబీలు ఫోటోగ్రఫీ, యాక్షన్ మూవీస్ కళాకారుడిగా అనుభూతులు ఇ సి మెంబర్, చిత్రాకళా సంస్థ మచిలీపట్నం

## సత్య



T Satyanarayana
Tirupathipuram
Attili Mandal,
W G Dist ,
Pin 534 134

పూర్తి పేరు తమ్మా సత్యనారాయణ (చిత్రకారుడు), పుట్టిన తేది 01 జులై 1946, తల్లితండ్రులు వనువులమ్మ, మాణిక్యం, పుట్టిన ఊరు/జిల్లా తిరుపతిపురం, ప॥గో॥ అభిమాన చిత్రకారుడు/కార్టూనిస్టు దామెర్ల రామరావు, బాపు, పికాసో, ఇష్టమైన శైలి రవివర్మ శైలి మరియు ఇంప్రెషనిజం, విద్యార్హతలు ఎస్ ఎస్ ఎల్ సి, ఫైన్ ఆర్ట్స్ హయ్యర్, టి టి సి, బహుమతులు జిల్లా ఉత్తమ చిత్రకళా ఉపాధ్యాయుడు 1992, కేంద్ర పర్యావరణ శాఖ పురస్కారం 1993, వృత్తి చిత్రకళ ఉపాధ్యాయుడు, హాబీలు సంగీతం, కవితారచన, నటన, సాహితీవ్యాసంగం, కళాకారుడిగా అనుభూతులు కళాకారుడు కావటం నా జన్మకు ఒక వరం

## సాయి



K Madhav
5-4-262,
Vijayalakshmi St ,
Tirupati - 517 501
Hello 21887

పూర్తి పేరు కటకం మాధవ (చిత్రకారుడు), పుట్టిన తేది 29 ఆగస్టు 1974, తల్లితండ్రులు కృష్ణవేణమ్మ రామచంద్రయ్య, పుట్టిన ఊరు/జిల్లా తిరుపతి, చిత్తూరు, అభిమాన చిత్రకారుడు/కార్టూనిస్టు కరవగ్గియో డేవిడ్, మీలాస్ ఇష్టమైన శైలి రియలిస్టిక్, విద్యార్హతలు బి కాం, డి టి పి, బహుమతులు మూడు గ్రూపు ఎగ్జిబిషనులో పార్టిసిపేషన్, రెండు వర్క్ షాపులలో పార్టిసిపేషన్, వృత్తి ఫ్రీలాన్స్ ఆర్టిస్ట్, హాబీలు పెయింటింగ్స్ (గ్రాఫిక్స్, యానిమేషన్ పిక్చర్స్, కళాకారునిగా అనుభూతులు ఆర్టిస్ట్‌గా పుట్టడం దేవుడు ఇచ్చిన వరం

## సుజన



M Sujana
W/o Bhaskar Kumar,
D No 33 9-18
Bharistar Street,
Seetarampuram,
Vijayawada- 4

పూర్తి పేరు మామిడి సుజన (చిత్రకారిణి), పుట్టిన తేది 23 ఏప్రిల్ తల్లిదండ్రులు సరోజ, భాస్కర్ రామ్మోహనరావు, పుట్టిన ఊరు, జిల్లా ఏలూరు, ప॥గో॥ ఇష్టమైన శైలి ఫ్రీ హేండ్ పెయింటింగ్, విద్యార్హతలు పదవ తరగతి, వృత్తి హౌస్ వైఫ్, హాబీలు ఫ్యాబ్రిక్ పెయింటింగ్, స్టిచింగ్

## సురేష్



T Suresh Kumar,
Art Teacher,
Jawahar Navodaya Vidyalaya,
Paleru - 507 157,
Hello 73021 (R)

పూర్తి పేరు టి సురేష్ కుమార్ (చిత్రకారుడు ) పుట్టిన తేది 4 ఆగష్టు 1963, తల్లిదండ్రులు నాగరత్నం, అనంతరాములు, పుట్టిన ఊరు, జిల్లా గోపవరం, ఖమ్మం, అభిమాన ఆర్టిస్టు రాజా రవివర్మ, బాపు, ఇష్టమైన శైలి రియలిస్టిక్ పెయిటింగ్స్, విద్యార్హతలు (ఎం ఏ ప్రీవియస్), బహుమతులు రాజాజీ కళాపీఠం వారి నుండి సర్టిఫికెట్స్, శ్రీ అడవి బాపిరాజు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ & గ్యాలరీ మొదలగునవి, వృత్తి ఆర్ట్ టీచర్ హాబీలు ఆర్ట్ గ్యాలరీలను దర్శించటం, పెయింటింగ్స్ గీయడం, ఆర్ట్ ఎడ్యుకేషన్‌లోకి స్టూడెంట్స్‌ను ప్రోత్సాహించడం కళాకారుడిగా అనుభూతులు ఆర్టిస్ట్‌గా నేను చాలా సంతోషముతో ఉన్నాను

## సత్య



K Satyanarayana Rao
Advocate
60-20 5, Ashok Nagar
Vijayawada-10

పూర్తి పేరు కొండపల్లి సత్యనారాయణ (చిత్రకారుడు), పుట్టిన తేది 15 జనవరి 1961, తల్లిదండ్రులు తులసమ్మ, సూర్యనారాయణ, పుట్టిన ఊరు, జిల్లా కైకలూరు, కృష్ణా, అభిమాన ఆర్టిస్టు రూబెన్, విద్యార్హతలు బి యస్ సి , బి ఎల్ , ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి, బహుమతులు టాలెంట్ అకాడమీ షీల్డ్, పార్టిషిపేషన్ సర్టిఫికెట్స్, మొదలగునవి, వృత్తి అడ్వకేట్, హాబీలు పెయింటింగ్, ప్లేయింగ్ చెస్, క్యారమ్స్ మరియు సినిమాలు చూడడం మొదలగునవి, కళాకారుడిగా అనుభూతులు పెయింటింగ్‌లో సంతృప్తిచెందడం

## సోమ

A SomaShekhar
H No 6-1 68/c,
Hanmanpura
Near Govt Polytechnic College
Mahaboob Nagar
Pin 509 001

పూర్తి పేరు ఎ సోమశేఖర్ (ఆర్టిస్టు, కార్టూనిస్ట్) పుట్టిన తేది 5 జులై 1971, తల్లిదండ్రులు ఎ బాసిలింగమ్మ, అడివప్ప, పుట్టిన ఊరు, జిల్లా మహబూబ్‌నగర్, అభిమాన కార్టునిస్టు/ ఆర్టిస్టు ఆర్ కె లక్ష్మణ్, ఉత్తమ్, విద్యార్హతలు డి ఇ.ఇ.ఇ. (పాలిటెక్నిక్) ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి. బహుమతులు 3 సార్లు కన్సొలేషన్ ప్రైజెస్, వృత్తి సబ్–ఇంజనీరు హాబీలు పెయింటింగ్, మ్యూజిక్, కార్టూనింగ్, కళాకారుడిగా అనుభూతులు ఇండియన్ కార్టూన్ ఫెస్టివల్‌లో నా కార్టూన్లు సెలక్ట్ కావడం

## సోమశేఖర్



A Somasekhar
Ganga, No - 7
Jail Quarters Central
Prison
Charlapalli
Near Kushaiguda
Hyderabad

పూర్తి పేరు ఆశపు సోమశేఖర్ (చిత్రకారుడు), పుట్టిన తేది 22 ఆగస్టు 1970 తల్లిదండ్రులు శాంత, అప్పారావు పుట్టిన ఊరు, జిల్లా ఉప్పాడ, తూ॥గో॥ అభిమాన చిత్రకారులు ఎందరో మహానుభావులు ఇష్టమైన శైలి వాటర్ కలర్ పెయింటింగ్, జానపదశైలి విద్యార్హతలు డి ఇ ఇ.ఇ (పాలిటెక్నిక్) ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయ్యర్ బహుమతులు/పురస్కారాలు 1992 కోనసీమ చిత్రకళాపరిషత్ – క్యాష్ అవార్డు, 1994 లలిత కళాపరిషత్ – విశాఖ క్యాష్ అవార్డు చిత్రకళా ప్రదర్శనలు 1993 అనకాపల్లిలో, 1999 బొంబాయిలో ఆర్ట్ ఇండియా న్యూస్ మేగజైన్ ఎడిటర్ శ్రీమతి సంగీత జిందాల్ ప్రారంబించారు వృత్తి ఎలక్ట్రికల్ ఇంజనీర్ నాగార్జున గ్రూప్స్, హైదరాబాద్ హాబీలు పెయింటింగ్స్ స్పోర్ట్స్ కళాకారుడిగా అనుభూతులు ఎన్నో

## సాహిత్య



A Syamu
Kaleswaramud,
Mahadevarapur Mandal,
Karimnagar Dist
Pin 505 504

పూర్తి పేరు ఆరుట్ల శ్యామసుందరాచార్యులు (చిత్రకారుడు), పుట్టిన తేది 28 జులై 1982, తల్లిదండ్రుల పేర్లు రుక్మిణీదేవి, సత్యనారాయణ చార్యులు, పుట్టిన ఊరు, జిల్లా కాళేశ్వరము, కరీంనగర్, అభిమాన కార్టునిస్టు టీవి, విద్యార్హతలు ఇంటర్, ఫైన్ ఆర్ట్స్ హయ్యర్, టీచర్ ట్రైనింగ్, బహుమతులు 8 జిల్లాల స్థాయిలో బహుమతులు అందుకోవడం, 2000, ఆగష్టు 28 రాష్ట్రస్థాయిలో బహుమతి నందుకోవడం, వృత్తి టీచర్, హాబీలు ఇంతవరకు ఎవరు కనుగొనంది కనుగొనటం

## సుందరరావు జె



J Sundar rao
3-5-35,
Narasingaraopet
G V Koteswararao St,
Anakapalle-531 001
Hello 24214

కుంచె పేరు మణి ఆర్ట్స్ పూర్తి పేరు జొన్నకోట సుందరరావు (చిత్రకళ–హేండీక్రాఫ్ట్స్) పుట్టిన తేది 1 జులై 1953 తల్లిదండ్రులపేర్లు సూర్యకాంతం, చెన్నమూర్తి పుట్టిన ఊరు, జిల్లా అనకాపల్లి విశాఖ అభిమాన చిత్రకారుడు ఆశపు అప్పారావు విద్యార్హతలు పి యు సి ఫైన్ ఆర్ట్స్ స్వయంకృషి వృత్తి స్టోన్ ఎంగ్రేవింగ్, మెమెంటోలు, స్క్రీన్ ప్రింటింగ్ హాబీలు ఫోటోగ్రఫీ, హోమియో వైద్యం, కరాటే కళాకారుడుగా అనుభూతులు సుప్రసిద్ధ నటుల, రాజకీయవేత్తల వద్ద నేను చేసిన కళాకృతులు ఉన్నందుకు ఒక ఆనందం

## సోమశేఖర్ ఎ వి యస్



A V S Soma Sekhar
Artist,
4 37, Santhinagar,
Katheru - 533 105
Hello 435412

కుంచె పేరు అనూరాధ, ఆరుద్ర, శేఖర్ ఎ వి యస్ పూర్తి పేరు అద్దాల వెంకట సుబ్రహ్మణ్య సోమశేఖర్ (చిత్రకారుడు) పుట్టిన తేది 10 సెప్టెంబరు 1935 తల్లిదండ్రులు సూర్యావతి, సూర్యనారాయణ పుట్టిన ఊరు/జిల్లా రాజోలు, తూ॥గో॥ అభిమాన చిత్రకారుడు బాపు, వడ్డాది పాపయ్య ఇష్టమైన శైలి దామెర్ల రామారావు శైలి విద్యార్హతలు బి ఏ ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయర్ బహుమతులు నవరంగ్ చిత్రకళానికేతన్ వారిచే గోల్డ్ మెడల్, సుప్రీమ్‌కోర్టు జడ్జి - న్యూ ఢిల్లీ గారిచే సన్మానం చిత్రకళా ప్రదర్శనలు రాజమండ్రి, కాకినాడలో ప్రచురణలు 'చిత్రకళా స్వయంబోధిని' అనే పుస్తకాన్ని 2000 సం॥లో ప్రచురించాను వృత్తి రిటైర్డ్ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్, డిస్ట్రిక్ట్ కోర్టు, రాజమండ్రి హాబీలు చిత్ర కళారాధన కళాకారుడిగా అనుభూతులు ఎన్నో

## సురేష్ జి.



G SURESH BABU
Suresh Arts, # 24-1 64,
Sambamurthy Road,
Durgapuram,
Vijayawada 3
Hello 437131 (Resi)

పూర్తి పేరు గాజుల సురేష్ బాబు (చిత్రకారుడు) పుట్టిన తేది 1970, తల్లితండ్రులు బేబి సరోజిని, లింగేశ్వరరావు, పుట్టిన ఊరు/జిల్లా విజయవాడ, కృష్ణా, అభిమాన చిత్రకారుడు రవివర్మ, ఇష్టమైన శైలి ఆయిల్ పెయింటింగ్స్, విద్యార్హతలు 10వ తరగతి, ఫైన్ ఆర్ట్స్ సన్నాల వరప్రసాద్‌గారు కృష్ణాగార్ల ఆధ్వర్యంలో, వృత్తి కమర్షియల్ ఆర్టిస్ట్, హాబీలు బుక్ రీడింగ్, కళాకారునిగా అనుభూతులు పూర్తి సంతృప్తి

## సుధ



Sudha
Sri Lakshmi Prassana Traders,
D No 20/41/14/3,
Relli Veedhi, Jabbar Thota,
Visakhapatnam 1

పూర్తి పేరు ఆర్ ఏ పి వి సుధారాణి (చిత్రకారిణి) పుట్టిన తేది 30 జూన్ 1966 తల్లిదండ్రులు పరమేశ్వరి, కృష్ణమూర్తి పుట్టిన ఊరు/జిల్లా చీరాల, ప్రకాశం ఇష్టమైన శైలి సమకాలీన కళ విద్యార్హతలు బి ఎఫ్ ఏ (పెయింటింగ్) ఆంధ్రా యూనివర్శిటి, ఎమ్ ఎఫ్ ఏ పెయింటింగ్ ఎమ్ ఎస్ యూనివర్శిటి, బరోడా బహుమతులు వుడ్‌కట్‌ప్రింట్ - నేషనల్ ఎగ్జిబిషన్ ఢిల్లీ, బోంబే ఆర్ట్ సొసైటీలలో ప్రదర్శించబడినవి వృత్తి ఆర్ట్ టీచర్ (కేంద్రీయ విద్యాలయం - విశాఖ) హాబీలు కుకింగ్ ఇంటీరియల్ డెకరేషన్ టీ వి చూడటం, పూజలు చేయడం కళాకారిణిగా అనుభూతులు కుటుంబ వ్యవస్థ, స్త్రీ, సంఘ వ్యవస్థలోని అన్యాయం అరాచకం, మోసం, అన్నింటిని డిస్టోర్డ్ పిక్చర్స్ ద్వారా నాభావాల్ని నా పెయింటింగ్స్ లో చూపించగలిగాను

## సాయిబాబు ఎన్



N Sai Babu
C/o Sri Studio &
Auto Zerox
Racharla gate center
Giddalur - 523357
Prakasam Dist ,

పూర్తి పేరు సాయిబాబు ఎన్, (చిత్రకారుడు,) పుట్టిన తేది 2 మే 1945, తల్లిదండ్రులు శ్రీరామమూర్తి, పుట్టిన ఊరు, జిల్లా వినుకొండ, గుంటూరు, అభిమాన ఆర్టిస్టు రవివర్మ, సింగాల్,పండిట్, ఇష్టమైన శైలి న్యూడిజం & న్యాచురలిజం, విద్యార్హతలు ఎస్ ఎస్ సి, ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ హైయ్యర్ (ఆంధ్రప్రదేశ్) టి టి సి (టెక్నికల్ బోర్డాఫ్ ఎడ్యుకేషన్ (ఎ పి) బహుమతులు లలిత కళా అకాడమి, న్యూఢిల్లీవారి 1992 ఎగ్జిబిషన్, చండీఘర్ అంబొలాకంట్ వెల్లటూరు, మచిలీపట్నం, విజయవాడ, విశాఖపట్నం, మొ॥ బహుమతులు, వృత్తి చిత్రలేఖన ఉపాధ్యాయునిగా, హాబీలు ఫోటోగ్రఫీ

## సత్యనారాయణ చిత్తలూరి



Ch Satyanarayana
H No 44-14/4-30,
Hanuman Nagar
Gunadala,
Vijayawada - 4

పూర్తి పేరు చిత్తలూరి సత్యనారాయణ (చిత్రకారుడు, కార్టూనిస్టు, కవి) పుట్టిన తేది 10 డిసెంబరు 1970 తల్లిదండ్రులు రమణమ్మ, నరసయ్య అభిమాన చిత్రకారుడు వడ్డాది పాపయ్య ఇష్టమైన శైలి కవితాశైలి విద్యార్హతలు బి ఎస్‌సి బి ఇడి, డిప్లొమా ఇన్ ఫార్మసీ, ఎమ్ ఏ (లిట్) ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ లోయర్ బహుమతులు వివిధ వార, మాస పత్రికలలో రాష్ట్రస్థాయిలో గెలుచుకున్న బహుమతులు మరియు ఆకాశవాణి హైదరాబాద్‌లో యువవాణి కార్యక్రమాలలో ప్రవేశం వృత్తి టీచరు హాబీలు రచనలు కళాకారుడుగా అనుభూతులు కళ కళకోసమే కాదు ప్రజల్ని చైతన్యవంతం చేసేదిగా వుండాలి ప్రజలకోసం కళ కావాలి

## హేమంత్



K Hemanth Kumar
Qtr No 3700,
New Type III Qtrs
Ordnance Factory Estate
Eddumailaram,
Pin 502 205

పూర్తి పేరు కొలివి హేమంత్ (చిత్రకారుడు, కార్టునిస్టు) పుట్టిన తేది 11 నవంబరు 1957 తల్లిదండ్రులు పద్మావతి, శ్రీనివాసరావు అభిమాన చిత్రకారుడు పాబ్లో పికాసో ఇష్టమైన శైలి కవితాశైలి విద్యార్హతలు ఇంటర్మీడియట్, ఫైన్ ఆర్ట్స్ నేషనల్ డిప్లొమా ఇన్ ఫైన్ ఆర్ట్స్ (పెయింటింగ్) బహుమతులు 1994,94,96 సం॥గాను ఆల్ ఇండియా లెవల్‌లో కేంద్రీయ విద్యాలయం ఐఎస్‌టిసి వారిచే బెస్ట్ టీచరు అవార్డు గోల్డ్ మెడల్ , మొదలగునవి వృత్తి ఆర్ట్ టీచరు హాబీలు ప్రయాణం చేయటం, పుస్తకాలు చదవటం, మ్యూజిక్ వినడం, కుకింగ్

## హరిప్రసాద్



HariPrasad S D
Plot No 79/A,
R K Nagar, P M Palem,
Visakhapatnam - 41
Hello (0891) 811039

పూర్తి పేరు ఎస్ డి హరిప్రసాద్ (శిల్పి) పుట్టిన తేది 18 ఫిబ్రవరి 1970, తల్లిదండ్రులు డి బాలవీరాచారి, పుట్టిన ఊరు, జిల్లా ఆళ్ళగడ్డ, కర్నూలు, విద్యార్హతలు ఫైన్ ఆర్ట్స్ బి ఎఫ్ ఎ, ఆంధ్రాయూనివర్సిటీ అవార్డ్స్ 1998 నేషనల్ అవార్డు – లలితకళా అకాడమీ, న్యూ ఢిల్లీ చిత్రకళాప్రదర్శనలు గ్రూపు షోలు 8, ఒన్‌మేన్ షో 2, వృత్తి శిల్పి, కళాకారుడిగా అనుభూతులు వందల కొద్దీ శిల్పాలు తయారు చేయటం

## హరి



పూర్తి పేరు బి హరివెంకటరమణ (కార్టూనిస్ట్) పుట్టిన తేది 22 ఆగష్టు 1976, తల్లిదండ్రులు అనంతలక్ష్మి, బి త్రిమూర్తి, పుట్టిన ఊరు, జిల్లా విశాఖపట్నం, అభిమాన కార్టూనిస్టు శంకర్స్ వీక్లీ శంకర్, ఇష్టమైన శైలి సన్నటిలైన్, విద్యార్హతలు బి కాం , ఎం ఏ (మొదటి సం॥) ఫైన్ ఆర్ట్స్ డ్రాయింగ్ లోయర్ బహుమతులు జిల్లా, రాష్ట్రస్థాయి బహుమతులు, రూరెళ్ల సోమేశ్వరరావు ట్రస్ట్ అవార్డ్, వృత్తి కార్టూనిస్ట్ (లీడర్ డైలీ), హాబీలు పుస్తకపఠనం, సంగీతం వినటం, కళాకారుడిగా అనుభూతులు బొమ్మలేయడంలో ఆనందం ఉంది




Hari
D No 2-87,
Krishnarayapuram,
Pendurti (Post)
Visakhapatnam
Pin 531 173

ప్రాచీన యశోవైభవాన్ని పూర్వులు సృష్టించిన కళా ఖండాలను తలచుకొని మురిసిపోతూ కూర్చుంటే ప్రయోజనం లేదు ఈ యుగంలో జీవిస్తున్న మనం మన తరంలో మహోజ్వల చరిత్రను సృష్టించి దేశానికి కీర్తి తేవాలి

– డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్

# ANDHRA ARTISTS, SCULPTORS & CARTOONISTS ASSOCIATION

## చిత్ర, శిల్పులకు, కార్టూనిస్టులకు 'ఆస్కా' విజ్ఞప్తి

సుమారు 270 మంది కళాకారులతో సంబంధిత వ్యాసాలతో ప్రచురించిన ఈ ఆంధ్ర కళాదర్శినిలో మరో మూడువందల మంది కళాకారులను చేర్చి త్వరలో పునర్ముద్రిస్తున్నా మని తెలియజేయుటకు సంతోషిస్తున్నాము 'ఆంధ్ర కళాదర్శిని' ద్వారా పరిచయం కాగోరే వారు తమ బయోడేటాలను (మీ రెండు పాస్‌పోర్టు సైజు ఫోటోలు, మీడ్రాయింగ్/పెయింటింగ్ రెండు ఫోటోకాపీ లను జతచేసి) 'ఆస్కా' జనరల్ సెక్రటరీ చిరునామాకు పంప గలరు బయోడేటా ఈ పుస్తకములో ఉన్న నమూనాలో **ఉండాలి**, గమనించగలరు గతంలో గడువు తేదీ తర్వాత బయోడేటాలు పంపినవారు మళ్ళీ పంపాల్సిన అవసరం లేదు వారి పరిచయాలు రాబోయే బుక్‌లో ప్రచురించబడతాయి భవిష్యత్తులో మీ చిరునామాలో మార్పులుంటే మాకు తెలియజేస్తే వచ్చే ఎడిషన్‌లో మార్పు చేయగలం




తెలుగులో చిత్రకళాగ్రంథాలు, మోనోగ్రాఫులు, కార్టూన్ సంకలనాలు ప్రచురించిన వారు ఆయా పుస్తకాల రెండు ప్రతులను మాకు అందజేస్తే వాటి రివ్యూలను కూడా ప్రచురించగలం చిత్ర కళాసాహిత్యాన్ని ప్రోత్స హించి, ప్రచురిం చాలనేదే 'ఆస్కా' ప్రధాన ఆశయం మీలో ఎవరైనా చిత్రకళా రచయితలు చిత్రకారులు, శిల్పులు, కార్టూనిస్టులు ఆయారంగాలకు సంబం ధించిన పుస్తకాలు ప్రచురించదలస్తే మాకు వ్రాయండి వాటిని 'ఆస్కా' ద్వారా పబ్లిష్ చేయడానికి ప్రయత్నిస్తాం

ఈ పుస్తకంలో కళాకారుల పరిచయాలపైన, వ్యాసాలపైన మీ అమూల్యమైన అభిప్రాయాలను, సూచనలను మాకు వ్రాయండి మలి ముద్రణలో మెరుగుపరచగలం

మీ

సుంకర చలపతిరావు

అధ్యక్షులు – 'ఆస్కా'

టి వెంకట్రావ్ (టీ వీ )

# ఆంధ్రప్రదేశ్ - చిత్రకళారంగం

*భారతదేశం స్వాతంత్ర్యం పొందాక, ఆంధ్రప్రదేశ్ రూపొందిన తరువాత చిత్రకళ యెలా అభివృద్ధయిందో, ఏయే పోకడలు పోతోంది పరిశీలిద్దాం*

ఈనాటి మన చిత్రకారులకు ఉమ్మడి గమ్యం అంటూ యేమీ లేదు ఎవరి గమ్యం వారికుండవచ్చు ఒకరిది కీర్తి గమ్యం ఒకరిది డబ్బు గమ్యం మరొకరిది సామాజిక స్పందన, ఇంకొకరిది కాలక్షేపం, వేరొకరిది సాంప్రదాయపాలన యిలా ఎవరి గమ్యం వారికుంది తప్ప అందరికీ ఒకే గమ్యంలేదు

స్వాతంత్ర్యం రాకముందు అలాంటి ఉమ్మడి గమ్యం వుండేది భారతజాతికి సంబంధించిన సాంప్రదాయ జాతీయ కళని పునరుద్ధరించడం, గౌరవించడం వగైరా వుండేది పరాయిపాలనలో పరాయి పాశ్చాత్య చిత్రకళని ఆమోదించకుండా ధిక్కరించడం అనాటి దేశభక్తి చిత్రకారులకు గీటురాయిగా వుండేది



ఇప్పుడలాంటి ప్రత్యేకత పోయింది పాశ్చాత్య చిత్రకళే మనలో చాలామందికి ఆదర్శప్రాయమయింది కొందరు ఇంప్రెషనిజాన్ని, కొందరు ఎక్స్‌ప్రెషనిజాన్ని, మరి కొందరు సర్రియలిజాన్ని, ఇంకొందరు క్యూబిజాన్ని, ఇంకా కొందరు సోషల్ రియలిజాన్ని, నైరాష్య చిత్రధోరణినీ బహిరంగంగానే అనుకరిస్తున్నారు అలా చేస్తున్నందుకు ఎవరూ సిగ్గుపడటంలేదు గర్వపడుతున్నారు కూడా కాబట్టి ఈనాటి మనచిత్రకళ అంతర్జాతీయ చిత్రకళలో భాగం అయిపోయింది విశ్వజనీకత సంతరించుకొంది

అయినా కొంతలో కొంత ప్రత్యేకత కోసం మన భారతీయ చిత్రకారులు ప్రయత్నిస్తున్నారు మన ఆంధ్రులు కూడా టెక్నిక్‌లో పాశ్చాత్యరీతులను పాటిస్తూనే సబ్జెక్టులో భారతీయాన్ని యెంచుకుంటున్నారు మనదేశపు దేవుడయిన వినాయకుడ్ని క్యూబిస్టు శైలిలో ఒకరు చిత్రిస్తారు శివలింగాన్ని సెమీయాబ్‌స్ట్రాక్టుగా మరొకరు చిత్రిస్తారు హానుమంతుడ్ని సర్రియలిస్టు శైలిలో ఇంకొకరు చిత్రిస్తారు ఈ విధంగా ఇండియన్ సబ్జెక్టు, పాశ్చాత్య టెక్నిక్కును చాలా మంది చిత్రకారులు యెన్నుకుని చిత్రిస్తున్నారు

ఈనాడు కళాపోషకులు లేరు రాజులూ, జమీందార్లు లేరు కళను పోషించే మతమూ లేదు పెయింటింగ్‌లు కొని ప్రభుత్వ కార్యాలయాలలో పెట్టుకునే విధానమూ లేదు మన ప్రభుత్వానికి కొంతవరకు పత్రికలు పోషిస్తున్నాయి కనుక పత్రికలకు పనికి వచ్చే చిత్రకళ కార్టూన్‌లు, ఇలస్ట్రేషన్‌లు, వార - మాసపత్రికల ముఖచిత్రం రచన వగైరా

చిత్రకళా రీతులను కొందరు చిత్రకారులు చేపట్టారు పాఠకులను వినోదపరచడం, విజ్ఞానాన్ని అందించడం లేదా చైతన్యవంతులను చేయడం వగైరా చేస్తున్నారు

చిత్రకళను బోధించే సంస్థలు మనకు చాలా తక్కువ హైదరాబాద్‌లో 1940లో ప్రారంభమయింది ఒక కళశాల మొన్న మొన్నటి వరకూ అదొక్కటే అదే జె ఎన్ టి యూ ఇటీవల మరికొన్ని వచ్చాయి విశాఖపట్నంలోని ఆంధ్రాయూనివర్శిటీలో ఒకటి, హైదరాబాద్‌లోని తెలుగు



యూనివర్శిటీలో ఒకటీ, ఉస్మానియా యూనివర్శిటీ అనుబంధ సంస్థగా శ్రీ వెంకటేశ్వర కాలేజ్ ఆఫ్ ఫైన్ ఆర్ట్సు వంటి చిత్రకళాశాలలు నెలకొల్పబడ్డాయి ఆంధ్రప్రజలకు యివి ఏమూలకు, సరిపోతాయి?

ఆ కొరత తీర్చడానికా అన్నట్లు రాజమండ్రి, విజయనగరం, విజయవాడ, గుంటూరు, భీమవరం, విశాఖపట్నం మొదలైన నగరాలలో ప్రయివేట్ చిత్రకళాస్కూళ్లు పనిచేస్తున్నాయి ప్రభుత్వ హైస్కూళ్లలో, జిల్లా పరిషత్ స్కూళ్లలో డ్రాయింగ్ మాస్టరులుంటారు గానీ సిలబస్ చెప్పుకోదగినంతగా వుండదు చాలా స్కూళ్ళలోని డ్రాయింగ్ మాస్టర్లు రిటైర్ కాగా ఆస్థానంలో కొత్త డ్రాయింగ్ టీచర్లను గత 12 సం॥రాలుగా నియమించడం లేదు కూడా

లోయరు, హైయరు డ్రాయింగ్ పరీక్షల్ని సంవత్సరానికోమారు జరుపుతుంటారు అవి ఎప్పుడు జరుగుతుంటాయో ఎవరికీ తెలియదు రహస్యంగా జరిగిపోతుంటాయి వాటికి శిక్షణ యివ్వడానికి చాలా జిల్లా కేంద్రాలలో కూడా తగిన డ్రాయింగ్ మాస్టర్లుగాని, స్కూళ్లుగాని వుండవు ఆ పరీక్షల వివరాలు పత్రికలలో రావు జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయాల్లో కూడా సరిగా సమాచారం చెప్పరు ఏదడిగినా మాకు తెలియదు అంటారు

గవర్నమెంట్ ఫండ్స్‌తో పనిచేస్తున్న కేంద్ర లలితకళా అకాడమీ వారి సహకారాన్ని అందుకొని చిత్రకళా పోటీలునిర్వహించే సంస్థలు ఆంధ్రప్రదేశ్‌లో డజను దాకా వున్నట్లున్నాయి అవి పోటీలు, ప్రదర్శనలు నిర్వహించగా కొద్దిమందికి అవార్డుల రూపంలో బహుమతులందించి ప్రోత్సహిస్తుంటారు వర్క్‌షాప్‌లు, సెమినార్లు అరుదుగా రాష్ట్ర రాజధానిలో జరుపుతుంటారు రాజదానిలోని ఏ కొద్దిమంది ప్రముఖులవో పెయింటింగ్‌లను కొంటూ వుంటారు ఆంధ్రప్రదేశ్‌లో 1950 ప్రాంతంలో ఏర్పడ్డ లలితకళా అకాడమీ అన్నగారి హయాంలో రద్దయిపోయింది కదా తెలుగు యూనివర్శిటీ వారి సన్మాన కార్యక్రమాలు తప్ప యీనాడు చిత్రకళా ప్రోత్సాహం ఏముంది? కళాభిమానులూ, కళాభిలాషులూ పెయింటింగ్‌లు కొని ఇళ్లలోనో, తమ కార్యాలయంలలోనో పెట్టుకునే స్థితికి యింకా ఎదగలేదు అలాంటి సంస్కృతి ఇంకా

మబ్బు మధురభావన - వ పా



మనకు అలవడలేదు ఇన్ని ప్రతికూల పరిస్థితులున్నా కూడా చిత్రకారులు మనరాష్ట్రంలో వుండటం అద్భుతంగా వుంది వాళ్లు అపరాజితలన్నమాట

హైదరాబాద్ నగరంలోనే చిత్రకారులెక్కువ మందున్నారని అనిపిస్తుంది ఫైనార్ట్సు కాలేజీ లుండటం, చిత్రకళాకారుల సంఘాలుండటం, మీడియాకు కేంద్రస్థానం కావడం, మహానగరంగా అభివృద్ధి కావటం రాజధానీ నగరం కావటం యివన్నీ కారణాలు కావచ్చు కళాకారులకు నిలయంగా అభివృద్ధయింది ఇటీవలే ఏభైఏళ్ల క్రితం కళలకు కేంద్రాలుగా రాజమండ్రి, బందరు వుండేవి

ప్రఖ్యాత చిత్రకారులు కొండపల్లి శేషగిరిరావుగారు, పి ఆర్ రాజుగారు, లక్ష్మాగౌడ్‌గారు, వైకుంఠం మొదలైనవారంతా హైదరాబాదులో వుంటుంటారు అక్కడకి దగ్గర్లోనే వున్న సిద్ధిపేట వాస్తవ్యులు కాపు రాజయ్యగారు కూడా హైదరాబాద్‌కు అందుబాట్లోనే వుంటారు వీరంతా కలసి హైదరాబాద్‌ను, చిత్రకళా కేంద్రంగా వికసింపచేశారు కొండపల్లి శేషగిరిరావుగారు కలకత్తాలోని శాంతినికేతన్‌లోను, పి ఆర్ రాజుగారు మద్రాసులోనూ చిత్రకళను అభ్యసించిన వారే కాపు రాజయ్యగారు జానపద చిత్రకళా శైలిలోనూ, కొండపల్లి శేషగిరిరావుగారు తూర్పుదేశాల తరహా ప్రకృతి చిత్రణలోనూ, లక్ష్మాగౌడ్, వైకుంఠంగారులు గ్రామీణ జీవితాలను, గ్రామీణులను ఆధునిక రీతులలో చిత్రించారు వీరుగాక జగదీష్ మిట్టల్, సూర్యప్రకాశ్, గౌరీశంకర్, చంద్ర, జి వై గిరి, బి ఏ రెడ్డి యేలే లక్ష్మణ్ వగైరా ఆధునిక చిత్రకారులనేకమంది వున్నారు పి ఆర్ రాజుగారు చిత్తూరు జిల్లా నుండి వచ్చినవారు సాంప్రదాయ చిత్రణలోనూ సిద్ధహస్తులు వీరంతా జాతీయస్థాయిలో కీర్తి పొందినవారే

ఫైనార్ట్సు కళాశాలలు లేకపోయినా గత కాలపు వైభవానికి వారసులుగా ఆంధ్రకోస్తా ప్రాంతంలో కూడా చెప్పుకోదగిన చిత్రకారులున్నారు గుంటూరుజిల్లాల్లో ఉల్చి, వెల్లటూరి పుర్ణానంద శర్మ, గుంటూరు పాండవులు, శిల్పులలో, దేవుశంకర్, సి యస్ యన్ పట్నాయక్ వంటి ఉద్దండులనేక మంది ఉన్నారు పత్రికలలో చిత్రకారులైన బాపూగారిది గోదావరీతీరం ప్రముఖ కార్టూనిస్టులు, టి వీ, మోహన్‌లది ఏలూరు శేఖర్‌ది సూర్యాపేట శ్రీధర్‌ది నల్గొండ జిల్లా, శ్యాంమోహన్‌ది అమలాపురం, బాలిది విశాఖజిల్లా అనకాపల్లి, సుభానిది చీరాల, శంకర్‌ది వరంగల్, సురేంద్రది విజయవాడ ప్రముఖ సినీ పబ్లిసిటీ ఆర్టిస్టులు ఈశ్వర్, గంగాధర్ పశ్చిమ గోదావరి జిల్లాకు చెందినవారు

చిత్రకళాశాలలు లేని కొరతను తీర్చడానికి కొందరు చిత్రకారులు అంకితమయ్యారు గుంటూరులో వెల్లటూరు పూర్ణానందశర్మ, తెనాలిలో వడవల

నారాయణరావు, ఫణితపు నాగేశ్వరరావు, విజయవాడలో టి వీ, నన్నాల, ఎన్ నంజీవరావు, భీమవరంలో చల్లా కోటివీరయ్య, రాజమండ్రిలో ఎన్ ఎస్ శర్మ, హైదరాబాద్‌లో బి ఎ రెడ్డిగారు ఎంతో మంది చిన్నారులను చిత్రకళవైపు నడుపుతున్నారు

నైపూర్య చిత్రకళలో ప్రఖ్యాతి గాంచిన ఎన్ వి రామారావుగారు చికాగోలోనూ, పులికంటి కృష్ణారెడ్డిగారు న్యూయార్క్‌లోనూ కృషిచేస్తున్నారు



విజయవాడకు చెందిన సాల్మన్‌రాజుగారు లండన్‌లో కొన్నాళ్ళు ఉద్యోగం చేసారు ఆయన బాతిక్, వుడ్‌కట్ చిత్రణలో నిపుణులు శ్రీకాకుళం జిల్లాకు చెందిన ఉత్తమ్ అమెరికాలో యూనివర్సల్ స్టూడియోలో పనిచేసి, ప్రస్తుతం హైదరాబాద్‌లో యానిమేషన్ స్టూడియో నడుపుతున్నారు విజయవాడ, రాజమండ్రి, నెల్లూరు, కర్నూలు నగరాల్లో కూడా ఫైనార్ట్సు కాలేజీలు ఉండి ఉంటే ఇంకెంత మంది చిత్రకారులు తయారయ్యేవారో! మన ప్రభుత్వం దృష్టి కళలపై లేదు

విజయవాడ మేయరుగా వున్న టి వెంకటేశ్వరరావుగారు నగరంలోని అంబేద్కర్ పార్కులో ఒక చిత్రకళా గ్యాలరీని ఏర్పాటు చేసి 32 మంది ప్రముఖ చిత్రకారుల చిత్రాలను సేకరించి భద్రపరిచారు ఇదో కొత్త సంప్రదాయం రాష్ట్రంలోని కార్పొరేషన్‌లూ, మునిసిపాలిటీలూ ఈ సంప్రదాయాన్ని పాటించి తమతమ నగరాలలో ఆర్ట్ గ్యాలరీలు ఏర్పాటు చేస్తే చిత్రకళా సంస్కృతికి ఇదొక గొప్ప ప్రోత్సాహంగా ఉంటుంది

మనరాష్ట్రంలో కళాసంస్థలను రద్దు పరిచాక కళలకు అండగా తెలుగు యూనివర్సిటీ పనిచేస్తున్న విషయం అందరికీ తెలుసు వారు ప్రచురించిన గ్రంధాలలో చిత్రకళకు సంబంధించిన గ్రంధం ఒక్కటీ లేకపోవడం శోచనీయం ఇటీవలే ఒక సంస్థవారు చిత్రకారుల చిత్రాలను గ్రీటింగ్ కార్డులుగా ప్రింటు చేసి విడుదల చేసారు యూనిసెఫ్ వారనుకుంటూ ఇదొక శుభపరిణామం మన చిత్రాకారుల చిత్రాలను క్యాలండర్లుగా మార్చుకునే వారు ఇంకా తగిన సంఖ్యలో లేరు రంగుల ప్రింటింగ్ అందుబాట్లోకివచ్చాక కొంతమంది చిత్రకారులు తమ చిత్రాలఆల్బంను ప్రింటింగ్ చేయించుకున్నారు ఈ పనిని తెలుగు యూనివర్సిటీ చేయడం లేదు ఇటీవల హైదరాబాద్‌లో యానిమేషన్ ట్రైనింగ్ సెంటర్లూ, యానిమేషన్ సినిమాలు, వీడియోలూ నిర్వహించే సంస్థలూ ప్రారంభమౌతున్నాయి ఆంధ్రప్రదేశ్‌లోని యువ చిత్రకారులందరినీ సమీకరించి ఉద్యోగాలిస్తున్నారు ఇదో కొత్త పరిణామం, మన చిత్రకారులు అంతర్జాతీయ యానిమేషన్ కళారంగంలోనికి అడుగుపెడుతున్నట్లు భావించవచ్చు త్వరలోనే ఒక తెలుగు చిత్రకళా దర్శకుడు వాల్ట్‌డిస్నీలాగా, స్పీల్‌బర్గ్‌లాగా పేరు ప్రఖ్యాతులు సంపాదించినా ఆశ్చర్యపడ నవసరం లేదు ■

కొల్లూరి

# మానవ సృజనాత్మక శక్తికి ప్రతీక చిత్రకళ

రూపం, భావం ఉన్నదే ఉత్తమ కళా సృష్టి అనుభవం లేకుండానే దానిని ఆనందించటం రసానుభూతి అలా రసానుభూతిని కలిగించే కళ చిత్రకళ

చిత్రకళ అంటే రూపచిత్రాలు, కుడ్య చిత్రాలు, శిల్పాలు మాత్రమే కావు చక్కని పాత్రలు, ధూళి పుష్పచిత్రాలు, నేత, గృహాలంకరణ ఇవన్నీ చిత్రకళనే వ్యక్త పరుస్తాయి చిత్రకళ పరమావధి సౌందర్యోపాసన కాదు అది కేవలం మానవ సృజనాత్మక శక్తికి ప్రతీక

అనాది నుంచి వాడుకలో ఉన్న మట్టి పాత్రలకు ప్రప్రథమంగా చిత్రకళకు స్థానం లభించింది మానవుని ఇంద్రియ జ్ఞానానికి, మృదుహృదయానికి, శీఘ్రగ్రహణానికి ఈ మట్టి పాత్రలు నిదర్శనాలు

చిత్రకళ ఒక సమాజావసరాన్ని సంతృప్తి పరిచేందుకు రూపొందినది కనుక మానవుడు ఉన్నంత వరకు అది చిరస్థాయిగా ఉంటుంది అయితే రూపం ధ్యేయం మారుతూ ఉంటాయి

చిత్రకళలో ఆకృతి, వర్ణము భావము ప్రధానాంశాలు మానవునిలో ఇంద్రియాంతర జ్ఞానాలు బాహ్య వస్తువుల ప్రేరణతో ఆలోచనా రూపమైన భావము 'ఆకృతి' చిత్రీకరణకు దోహదపడుతుంది చిత్రకారుడు చిత్రంలోని వస్తువునకు రూపము, ప్రమాణము, ఘనపరిమాణము కాక ఆ చిత్రంలో వస్తువునకు ఉండే విలువ, భావం మొదలైన అంశాలను వ్యక్త పరుస్తాడు అలాగే రంగుల ద్వారా కూడా చిత్రకారుడు భావ చిత్రీకరణ చేయగలడు

అధునాతన చిత్రకారులు అయిన గాగిన్, మొదగ్లాని, పికాసో వంటివారు ఆదిమ చిత్రకళ ఔన్నత్యాన్ని గ్రహించి అందులోని కొన్ని అంశాలను అనుకరిస్తూ అధునాతన చిత్రకళ పేరుతో పునరుద్ధరించడానికి ప్రయత్నించారు కాగా ప్రముఖ కవి చిత్రకారులు అయిన అడివి బాపిరాజు విశ్వాత్ముల నరసింహమూర్తి వంటివారు ఈ చిత్రకళను ప్రజలకు దగ్గరగా తెచ్చేందుకు ప్రయత్నించారు

కళ ప్రజల కోసమే అని వాదించేవారు కళనుఒక గొప్ప చైతన్య సాధనంగా గుర్తించి దానిలో మానవుని ఉత్తేజ పరిచే మహత్తర శక్తి ఉందని భావిస్తారు ఆ కోవకు చెందినది ఆధునిక చిత్రకళ ఈ ఆధునిక చిత్రకళలో అసంఖ్యాకంగా చిత్రాలు శిల్పాలు సృష్టించి జగద్విఖ్యాతుడైన వ్యక్తి పాబ్లో పికాసో తన చిత్ర విచిత్ర ప్రయోగాలతో కళా ప్రపంచాన్ని సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తి ప్రపంచ వ్యాప్తంగా తనకు ఏకలవ్య శిష్యులను తయారు చేసుకున్నాడు ఆధునిక కళా పద్ధతులు చిత్రకారులకు దొరికిన గొప్పవరం అయితే దానిని సద్వినియోగం చేసుకుంటేనే కళాకారుడు రాణిస్తాడు 1930 ప్రాంతాల్లో తెలుగువారిలో పత్రికాముఖంగా సుపరిచితుడైన తొలి కార్టూనిస్ట్ తలిశెట్టి రామారావు ఆయన హాస్యాన్ని, వ్యంగ్యాన్ని సున్నితంగా తన చిత్రాలలో అందించేవారు ఇంకా టైమ్స్ ఆఫ్ ఇండియాలో కార్టూన్‌లు వేసే ఆర్ కె లక్ష్మణ్ ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో వేసే ఆబూ అబ్రహాం ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియాలో వేస్తుండే 'మేరియో', 'పేట్రియట్', 'హిందూ' పత్రికలలో ఒ వి విజయన్ సమర్థులైన ప్రఖ్యాత కార్టూనిస్టులు వీరిలో రాజకీయ వ్యంగ్యాన్ని సున్నితంగా దట్టించడంలో ఆర్ కె లక్ష్మణ్ సిద్ధహస్తుడు

శంకర్‌గా సుపరిచితుడై 'శంకర్స్ వీక్లీ' పత్రిక నడిపిన 'శంకర్ పిళ్ళై' ఆరంగంలో దాదాపు 4 దశాబ్దాలు కృషి చేసి ఎందరో కార్టూనిస్టులకు అవకాశాలు కల్పించారు తెలుగు వారిలో చిత్రలేఖనంపైన కార్టూన్లపైన అభిమానం, ఆదరణ పెంపడంలో 'బాపు' పాత్ర విశిష్టమైనది

కళాసాగర్

# బహువిధ కళా ప్రపూర్ణుడు..బాపూ!

బాపు బొమ్మలతో ఆంధ్రపత్రికా చిత్రలేఖనంలో ఒక కొత్తయుగం అరంభమయిందనక తప్పదు అనేక పాత్చాత్య చిత్రకారులను శ్రద్ధతో పరిశీలించి వారి గీతల గంభీరతను ఆమూలాగ్రం అర్ధం చేసుకొన్నప్పటికీ తనకంటూ ఒక ప్రత్యేక బాణీని సృష్టించుకొని చిత్రకళా జగత్తులో 'బాపుఇజమ్"ను స్థాపించారు బాపు గీచిన ప్రతీ గీతలోనూ, ఆయన వ్రాసిన ప్రతీ అక్షరంలోనూ తెలుగుతనం ఉట్టిపడుతుంది

'బాపు'గా అందరికీ సుపరిచితుడై ప్రముఖ చిత్రకారుడిగా, కార్టూనిస్టుగా, సినీదర్శకుడిగా ప్రసిద్ధి చెందిన ఈయన అసలు పేరు సత్తిరాజు లక్ష్మీనారాయణ, బాపూ నర్సాపురం (పశ్చిమ గోదావరి జిల్లా)లో 1933 డిసెంబరు 15న జన్మించి, మద్రాసులో న్యాయశాస్త్ర విద్య అభ్యసించాడు కొన్నాళ్ళు ప్రసిద్ధ అడ్వర్‌టైజింగ్ ఏజెన్సీలలో ఆర్ట్ డైరెక్టరుగా పనిచేసాడు సుప్రసిద్ధ రచయిత ముళ్ళపూడి వెంకటరమణతో కలసి ఒకరు బొమ్మా, మరొకరు రచన ఇద్దరూ కలసి 'బాపూ రమణీయం' హాస్య వ్యంగ్య కళాకారుల జంటగా అయిదు దశాబ్దాల పాటు తమ 'బొమ్మ-రచన'లతో తెలుగు ప్రజానీకాన్ని అలరించారు ఈ ఇద్దరి సచిత్ర రచనలు బాలసాహిత్యంలో చోటుచేసుకొన్నాయి బాల చిత్రకారుడిగా 'బాల' పత్రికకు సరదాగా (1949) బొమ్మలు వేస్తూ చివరకు ఆ ప్రవృత్తినే వృత్తిగా మలచుకున్నాడు



అపురూపమైన జోడీ బాపు రమణ

రేఖా సృజనాత్మకత ఆయన సొత్తు కోక్విల్ పెన్‌తో అడుతూ పాడుతూ బొమ్మలు గీయగల బాపు, ముఖ్యంగా స్త్రీని అందంగా మలచడంలో ఆయనకు ఆయనే సాటి అనిపించుకున్నాడు ఈ 'కళా తపస్వి' జనార్ధనాష్టకం (1966) 'బాల రామాయణం' (1976)లలో రంగుల జిలుగులతో తీర్చిదిద్దిన బొమ్మలు ప్రముఖ కళాఖండాలు 1964లో సాక్షి సినిమాతో చలన చిత్ర దర్శకుడిగా మారి ఆయన సృష్టించిన వినోదాత్మక చలన చిత్రాలు కళాఖండాలు, బుద్దిమంతుడు( గోరంత దీపం సీతాకళ్యాణం త్యాగయ్య, సంపూర్ణ రామాయణం, ముత్యాల ముగ్గు, మిస్టర్ పెళ్ళాం బహుజనాదరణ పొందిన సినిమాలు పత్రికా రంగంలో పుస్తకాలకు ముఖచిత్రాలు కధలకు బొమ్మలు, కార్టూన్లు, పొట్రయిట్స్ వేయడంలోను, అక్షరాల వ్రాయడంలోనూ

వేటికవే విభిన్న రకాలుగా చిత్రించడం ఒక్క బాపూకే సాధ్యమేమో ఇన్ని పనులనూ బాపుయే చేస్తాడంటే నమ్మలేని సమయంలో 43 సినిమాలకు దర్శకత్వం కూడా వహించడం ఆయన ప్రతిభకు తార్కాణం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నియోగంపై ప్రాధమిక తరగతులకు 'వీడియో పాఠాలు' అందించారు 1991లో ఆంధ్రాయూనివర్శిటీ 'కళా ప్రపూర్ణ' గౌరవ డాక్టరేటు బిరుదు, 1992లో బాలల అకాడెమీ పక్షాన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు 'బాలబంధు' బిరుదును ప్రదానం చేసి సత్కరించారు

వెండితెరపై సంపూర్ణ రామాయణం, సీతాకళ్యాణం వంటి కమనీయ చిత్రాలకు రూపకల్పన చేసిన బాపు త్వరలో మహాభాగవతాన్ని బుల్లితెరపై అవిష్కరించనున్నారు ప్రచురణా రంగంలో చిత్రకారుల అవసరాన్ని, గుర్తింపుని, గౌరవాన్ని పెంచింది బాపూనే అంటే అతిశయోక్తి కాదు ఈనాడు మనకు 'వాసి' సంగతెలా ఉన్నా 'రాసి' లోనైనా ఇంతమంది చిత్రకారులు న్నారంటేనూ వారిలో 'హస్తవాసి' గలవారు కనీసం కొంతమందైనా ఉన్నారంటేనూ ఆ ఘనత 'బాపూ'దే! నేటి డిజిటల్ పబ్లిషింగ్‌లో ఆయన సృష్టించిన అక్షరాలు, చిత్రాలు 'అనూఫాంట్' వారు అందరికీ అందుబాటులోకి తీసుకొచ్చారు అరవైఆరు వసంతాలు పూర్తి చేసుకొన్న బాపు స్థిరయశస్వి చిత్రకళా సంపదను భావి తరాలకు అందిస్తోన్న బాపు అభినందనీయులు ■



## బాపూ నువ్వే టాపు

*నీ గీతల్లో భాషకందని భావాలెన్నో*
*నీ రాతల్లో వంపుసొంపుల వయ్యారాలెన్నెన్నో!*

*తెలుగు అక్షరాలకు తెచ్చావో కొత్త షేపు*
*దేవతామూర్తులకు నీ బొమ్మలే ప్రతిరూపు!*

*నీ కార్టూన్‌లు అందరినీ కడుపుబ్బ నవ్విస్తాయి*
*కొందరికి గుండెలోతుల్లో గుచ్చుకుంటాయి!*

*నీ కుంచె నుండి జాలువారిన బొమ్మాయిలు*
*వెన్నెల్లో ఆడుకొనే అందమైన అమ్మాయిలు!*

*వెండితెరపై సైతం సృష్టించావు నూతన ఒరవడి*
*నేడయ్యింది ఎందరికో అది బడి!*

*అందం తెలుగుతనం నీ బొమ్మలకే సొంతం*
*ఆధునిక చిత్రకళలో నీస్థానం సుస్థిరం!*

*నీ రాక తెలుగు చిత్రకళకు గొప్పమలుపు*
*రేఖా చిత్రకళలో ఇప్పటికీ నువ్వే టాపు!*

కళాసాగర్

కరుణాకర్‌తో ఇంటర్వ్యూ

# చిత్రకళపై చిన్నచూపు తగదు

*ఒకింత లాలిత్యం, హొయలొలికించే సౌందర్యం, కాస్తంత జాణతనం, కావలసినంత జానపదం అన్నీ కలిసి విరబోసే వినూత్న చిత్రాలకు చిరునామా కరుణాకర్ కరుణాకర్ బొమ్మ లేకుండా ఏ పాపులర్ వీక్లీనీ పాఠకులు ఊహించలేరు చిత్ర రచనలో ఇది కరుణాకర్ ముద్ర! వేల బొమ్మలేసినా, ప్రతి బొమ్మలో ఓ కొత్తదనం పరవళ్లు తొక్కేది అతడి చిత్రాల్లోనే! కమర్షియల్ ఆర్టిస్టే అయినా కళాత్మకత విషయంలో ఎక్కడా రాజీపడని కుంచె అతడిది -ఈ రంగంలో అశేష పాఠకుల అభిమానాన్ని విశేషంగా చూరగొన్న కరుణాకర్‌తో చేసిన ఇంటర్వ్యూ ఇది!*

**? ఈ రంగంలోకి ఎలా వచ్చారు?**

నాకు ఎనిమిదేళ్ల వయసునుండి బొమ్మలు చూడటం, బొమ్మలు వేయడంలో శ్రద్ధ ఏర్పడింది ఉదాహరణకు ఒక చేతిలో వెన్న ముద్ద పట్టుకుని బాలకృష్ణుడు పాకుతూండే బొమ్మ నన్ను ఆ వయసులో ఎంతగానో ఆకర్షించింది ఆ విధంగా దేవుళ్ల బొమ్మలు ఎక్కువగా వేస్తూండేవాడిని ఆ తరువాత వివిధ తెలుగు, ఇతర భాషా పత్రికలు చూసేవాడిని అందులో చిత్రకారులు చిత్రించిన బొమ్మల్ని, కార్టూన్లనూ పరిశీలిస్తూండేవాడిని నేను కూడా పత్రికల్లో బొమ్మలు వేయాలనుకునేవాడిని ఆ అభిలాషతో నా మొట్టమొదటి కార్టూను గీసి ఆంధ్రజ్యోతి వారపత్రికకు పంపాను అది 27-7-1973 సంచికలో ప్రచురితమైనది ఆ తరువాత ఆంధ్రప్రభలో ఫిల్లర్స్ కింద కొన్ని చిత్రాలు, కార్టూన్లు వచ్చాయి

**? మీ మొదటి బొమ్మకు ప్రేరన ఎవరు?**

23-5-1979 సంచిక ఆంధ్రప్రభ వారపత్రికలో 'రంగు మారింది' కథ రాశాను ఆ కథకు బొమ్మ కూడా వేశాను అప్పటి నుండి కథలకు బొమ్మలు వేయడం



ప్రారంభించాను

**? ఇప్పటివరకు ఎన్నివేల బొమ్మలు (సుమారు) వేసి ఉంటారు?**

ఇప్పటివరకు ఇరవై వేలకు పైగా బొమ్మలు వేశాను

**? కథకు బొమ్మ వేయడంలో మీరు ఎంచుకునే ప్రాధాన్యత ఏది?**

కథను పూర్తిగా చదివిన తరువాత రచయిత కథ ద్వారా ఏం చెప్పదలచుకున్నాడో తెలుస్తుంది ఆ విషయం బొమ్మల్లో చూపించటం జరుగుతుంది మరికొన్నిటికి ఒక సన్నివేశాన్ని చిత్రంలో చూపించటం జరుగుతుంది

**? ఇప్పటి వరకూ అవార్డులు ఏవైనా వచ్చాయా?**

1983లో ట్రేడ్ ఫెయిర్ అథారిటీ ఆఫ్ ఇండియావారు నిర్వహించిన ఆల్ ఇండియా కేరికేచర్ కాంపిటీషన్లో నాకు ద్వితీయ బహుమతి వచ్చింది జెమినీ టీవీలో స్వామి గణపతి సచ్చిదా నంద సంక్షిప్త జీవిత చరిత్ర 'గురుబ్రహ్మ' సింగిల్ ఎపిసోడ్‌కు గాను రాష్ట్ర నంది అవార్డు వచ్చింది అలాగే వివిధ సందర్భాలలో బహుమతు లందుకున్నాను

**? మీరు ఏం చదివారు ? ఏ ఊరివారు?**

సైన్స్, ఫైన్ ఆర్ట్స్ (ఫొటోగ్రఫీ)లో పట్టభద్రుణ్ణి జర్నలిజంలో పి జి డిప్లొమా చేశాను పుట్టింది విశాఖపట్నం, పెరిగింది హైదరాబాదులో చదువంతా హైదరాబాదులోనే

**? ఈ బొమ్మలమీద మీరు ఏం సంపాదించారు, ఎంత సంపాదించారు?**

పత్రికలకు బొమ్మలు వేయటంలో ఎంతో సంతృప్తిని పొందాను వివిధ పత్రికా సంపాదకులు నన్నెంతో ప్రోత్సహించారు ఆ విధంగా కాస్తో కూస్తో చిత్రకారుడిగా పేరు సంపాదించగలిగాను ఇక సంపాదన అంటారా పదిహేనేళ్ల కిందట ఏదయితే బొమ్మలకుగాను పారితోషికం ఇస్తూండేవారో పత్రికలవాళ్లు ఇప్పుడూ అంతే ఇస్తున్నారు దాన్నిబట్టి నేనెంత సంపాదిస్తున్నానో అంచనా వేసుకోవచ్చు



**? మీరు వేసిన బొమ్మల్లో మీరు మరువలేని బొమ్మ ఏమిటి?**

ఫలానా బొమ్మ అంటూ చెప్పలేను నేనింత వరకూ వేసిన బొమ్మలో ఓ వెయ్యివరకూ నాకు బాగా నచ్చాయి

**? మనరాష్ట్రంలో ఆర్టిస్టులకు ప్రోత్సాహం ఎలా ఉంది? ప్రభుత్వం నుంచి ఏ రకమైన సపోర్ట్ ఆశిస్తున్నారు?**

మనరాష్ట్రంలో చిత్రకళమీద చాలా చిన్నచూపు ఉంది అటు సాంస్కృతిక సంస్థలు కానీ, ఇటు రాష్ట్ర ప్రభుత్వం కానీ చిత్రకళను గుర్తించాల్సిన విధంగా గుర్తించలేదనే చెప్పాలి అసలు మన రాష్ట్రంలో చిత్రకళాకారుల మధ్య సత్సంబంధాలు కరువైనాయి ఎవరికి వారే యమునా తీరే అన్నట్లు ఎవరికి వారు ఎగ్జిబిషన్లు నిర్వహించుకోవటం ఆ విధంగా తమపై ఆర్థికభారం పడటం, ఖర్చుకు తగ్గ ఆదాయం లేకపోవటం జరుగుతోంది ఇకనైనా చిత్రకారులు (ఆర్టిస్టులు, పెయింటర్లు, కార్టూనిస్టులు) కలిసి రాష్ట్రవ్యాప్తంగా ఒకే ఒక సంఘంగా ఏర్పడి ఆ సంఘం ద్వారా వారానికి, లేదా నెలకొకసారి ఒకో చిత్రకారుడి పెయింటింగ్స్ ఎగ్జిబిట్ చేయాలి దేశ విదేశాల్లో చిత్రకాళాకారులకు సంబంధించిన సమాచారాన్ని ఆ సంఘం చిత్రకారులకు అందిస్తూండాలి అలాగే రాష్ట్ర కళా సాంస్కృతిక మండలి ఆర్థిక సహాయాన్ని అందించాలి ఈ ఎగ్జిబిషన్లు వివిధ జిల్లాల్లో నిర్వహిస్తే బాగుంటుంది ఇప్పుడు అటువంటి ఆర్టిస్టుల సంఘాలు లేవా అని మీరు ప్రశ్నించవచ్చు, ఉన్నాయి కానీ, వాటి నిర్వహణావరిధి, సామర్థ్యం నామమాత్రంగానే ఉన్నాయి

**? ఈ రంగంలో మరువలేని జ్ఞాపకాలు, అనుభవాలు తెలియజేయండి**

నా బొమ్మలను అభిమానించే పాఠకులు మన రాష్ట్రంలో, ఇతర రాష్ట్రాల్లోనే కాక విదేశాల్లో కూడా ఉన్నారు అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను వారి అభిమానాన్ని శాశ్వతంగా నిలుపుకొనేటట్లు నేను ప్రయత్నిస్తూంటాను

(ఆంధ్రప్రభ సౌజన్యంతో )

## శిరోజం పై 100 ఏనుగులు

అత్యంత ఓర్పు, అపురూప కళా చాతుర్యంగల కొందరు చెక్కడపు పనివారు అతి సూక్ష్మ కళాఖండాలను(మినియేచర్ ఫిగర్స్) సృష్టించి ప్రపంచానికి విస్మయం కలిగించారు

ఎడ్వర్డు కాజర్‌యాన్ అను ఆర్మేనియన్ (సోవియట్) యువకుడు మానవ శిరోజంపై 100 ఏనుగులను చిత్రించి, ఆ చిత్రాలుగల శిరోజాన్ని మరియొక శిరోజంలో తొలచిన రంధ్రంలో అమర్చాడు ఆ కళా ఖండాన్ని గూర్చి 'బెర్లియన్ జీటింగ్' పత్రికా ముఖాన తెలిసికొన్న పాఠకులు ఇది సాధ్యమా, అని అనుమానం వెలిబుచ్చుతూ లేఖలు వ్రాసారు ఆ లేఖలకు సమాధానంగా కాజర్‌యాన్ అరంగుళం శిరోజాన్ని తీసుకొని దానిపై "ఆర్మేనియన్ ప్రజల తరపున జర్మన్ ప్రజలకు శుభాకాంక్షలు" అని వ్రాశాడు శిరోజంపై లిఖితమైన ఆ లేఖనూ, అత్యంత శక్తివంతమైన భూతద్దాన్ని ఆ పత్రికా కార్యాలయానికి పంపాడు

గుత్తుల శ్రీనివాసరావు

# కవ్వించి నవ్వించే కార్టూన్

**ప్రతి మనిషి పుడుతూ తను ఏడుస్తాడు**
**చనిపోతూ తనవాళ్లను ఏడిపిస్తాడు**
చావు, పుట్టుకల మధ్య ఏడ్వడానికి, ఏడిపించడానికి మధ్య ఉన్న కాలాన్ని నవ్వుతూ, నవ్విస్తూ జీవితాన్ని ఆనందమయం చేసుకోగల్గితే మనిషికి అంతకంటే అదృష్టం మరొకటి లేదు సృష్టిలోని చరాచర జీవరాసుల్లో నవ్వు అనేది కేవలం మనిషికి మాత్రమే భగవంతుడిచ్చిన అద్భుతమైన వరం ఈ ప్రపంచంలో హాస్యమనేది మనిషిని నవ్వించడానికి అనేక రకరకాల పద్ధతుల్లో పుట్టుకొస్తోంది ముఖ్యంగా సినిమాలు, టి వీ లు, నాటకాలు, సర్కస్‌లో బఫూన్ చేష్టలు, పత్రికా పరంగా హాస్యరచనలు, జోకులు, కార్టూన్లు లాంటివి ఎన్నో హాస్యాన్ని సృష్టించి మనల్ని నవ్విస్తున్నాయి

కార్టూన్ గురించి చెప్పుకోవలసి వస్తే మనదేశంలో దీనికి ఒక విభిన్నమైన ప్రత్యేకత ఉంది మనకున్న కళలు అరవైనాలుగు లలిత కళలు ఐదు వాటిలో చిత్రలేఖనం ఒకటి రసాలు తొమ్మిది, వాటిలో హాస్యం ఒకటి లలిత కళల్లో చిత్రలేఖనం, నవరసాల్లో హాస్యం మిళితమై కార్టూన్‌గా ఉద్భవించింది పదివేల మాటల్లో చెప్పలేని భావాన్ని సైతం ఒక్క కార్టూన్‌లో చూపించవచ్చునేది జగమెరిగిన సత్యం కార్టూన్ సామాన్య మానవుడి దగ్గర్నుండి, ఉన్నతస్థాయి వ్యక్తుల వరకు అందర్నీ ఆకర్షిస్తుంది కార్టూన్‌ను అడుక్కు తినే ముష్టివాడి దగ్గర్నుండి, దేశాన్ని పాలించే నాయకుడి వరకూ అన్నిరంగాల మీద గీయొచ్చు. కార్టూన్‌కు అనర్హమైన రంగం కాని, విషయం కాని ఏదీ లేదు

మనదేశంలో దినపత్రికలు పొలిటికల్ కార్టూన్లకు ఎంతో ప్రాధాన్యతనిస్తున్నాయి వార, పక్ష, మాస పత్రికలు పొలిటికల్ కార్టూన్లతో పాటు అన్ని రకాల కార్టూన్లకు ప్రాధాన్యతనిస్తున్నాయి కొన్ని పత్రికలు కేవలం కార్టూనిస్ట్ యొక్క ప్రతిభ వల్లే సర్క్యులేషన్లను అగ్రస్థాయిలో నిలబెట్టుకున్నాయి హిట్లర్ అంతటి ప్రచండశాసనుడే కార్టూన్స్ అంటే భయపడేవాడట కార్టూన్ గీతలతో కార్టూనిస్టులు ప్రభుత్వాల్ని గజగజలాడించిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి

పొలిటికల్ కార్టూన్లలో కార్టూనిస్ట్ యొక్క చిత్రకళా ప్రతిభ మామూలు కార్టూన్లకంటే ఇంకాస్త మెరుగు పరచవలసి ఉంటుంది కారణం పొలిటికల్ కార్టూన్ చూడగానే అందులో కనిపించే బొమ్మలోని మనిషి తాలూకు నిజరూపం మనకి వెంటనే



మోహన్ గీసిన దాసరి కారికేచర్




స్ఫురిస్తుంది కార్టూన్‌లోని వ్యక్తులకు, నిజరూపానికి ఉండే తేడా ఏమిటని పరిశీలించిన ఒక్కొక్క వ్యక్తిలోని ఒక్కొక్క ప్రత్యేకత మనకు కన్పిస్తుంది ఆ ప్రత్యేకతను మరికొంత ఎక్కువచేసి గీసినట్లయితే అది కార్టూన్ అవుతుంది

ఉదాహరణకు ఫ్రెంచ్ అధ్యక్షుడు డిగోల్ యొక్క ముక్కు సహజంగానే పెద్దది దీన్ని ఇంకా పెద్దముక్కు చేసి బొమ్మ వేస్తే అది డిగోల్‌గా ప్రజలు గుర్తిస్తారు అలాగే నెహ్రూ టోపి, గాంధీ బట్టతల, కళ్ళజోడు, చర్చిల్ చుట్ట, ఇందిరా గాంధీ రుద్రాక్షమాల, ఎన్ టి ఆర్ నుదుట విభూదినామం, వంచె, లాల్చీ, చంద్రబాబు గెడ్డం మొదలైనవి కార్టూనిస్టుల కొండ గుర్తులు

కార్టూన్ల పట్ల పాఠకులలో అభిరుచిని, ఆశక్తిని పెంచడంలో బాపు పాత్ర చిరస్మరణీయం ఆయన కార్టూన్లు చూసిన వారు వెంటనే ఇది బాపు కార్టూన్ అనేంత పాపులర్ కార్టూనిస్టుగా గుర్తించబడి, ఎందరో కార్టూనిస్టులకు మార్గదర్శకులయ్యారు

మన రాష్ట్రవ్యాప్తంగా ఎంతో మంది కార్టూనిస్టులు ప్రతిభ ఉండి కూడా సరైన ప్రోత్సాహం లేక మరుగున ఉన్నారు ఈ విషయాన్ని గ్రహించి కొన్ని సేవాసంస్థలైనా ముందడుగు వేసి కార్టూన్ల పోటీలలాంటివి నిర్వహించి మంచి కార్టూనిస్టులను వెలుగులోనికి తీసుకురావాల్సిన అవసరం ఎంతో ఉంది

రాష్ట్రవ్యాప్తంగా ఎక్కడెక్కడో మారుమూల ప్రాంతాల్లో సైతం ఉన్న కార్టూనిస్టుల అందరి వివరాలను ఒక చోట చేర్చి, వారి మధ్య స్నేహ సంబంధాలను ఏర్పరచి, వారి అభివృద్ధికి తమవంతు ప్రయత్నంగా మెరుగులు దిద్దబోతున్న ఆస్కా ప్రయత్నం అభినందనీయం, అనితర సాధ్యం

ఆస్కావారు రూపొందించే ఈ "ఆంధ్ర కళాదర్శిని" చిత్రకారులు, శిల్పులు, కార్టూనిస్టుల ఉన్నతికి మరెంతో సహాయపడ గలదని ఆశిద్దాం ■

ఎ.పి రావ్

# సృష్టికి ప్రతిసృష్టి చేయగల శిల్పి వుడయార్

ఈ నల్లనిరాళ్ళలో ఏ కన్నులు దాగెనో ఈ బండల మాటునా ఏ గుండెలు మ్రోగెనో అన్న కవితా భావనకు రూపం ఈయన శిల్పాలు పైకి కఠినంగా కనిపించే కరకు రాళ్ళు సైతం ఆయన కరస్పర్శకు వెన్నలా వయ్యారంగా కరిగిపోతాయి, ఆయన 'ఉలి' తగిలిన వెనువెంటనే జలజలా పొంగిపొరలి సౌందర్య రాశులుగా మారతాయి శిల్ప కళారాధనలో నిత్యం జీవించే ఆ కళాతపస్వి శ్రీనాధ రత్నశిల్పి వుడయార్ ప్రధానంగా శిల్పి అయినా వుడయార్ బహుముఖ ప్రజ్ఞావంతులు ఆయనలో ఓ శిల్పి, చిత్రకారుడు, జ్యోతిష పండితుడు, వాస్తుశాస్త్ర వేత్త, కవి, రచయిత, గురువు, స్వాతంత్ర్య సమరయోధుడు, వైద్యుడు, ప్రజాసేవకుడు ఉన్నారు అన్నిటికీ మించి మననున్న మనిషి గండ పెండేరాలూ, ఘనమైన బిరుదులూ, ప్రశంసాపత్రాలూ, ప్రముఖుల సత్కారాలూ ఆయన బహుముఖ ప్రజ్ఞతో తూగలేకపోయాయి అప్రతిహతప్రతిభా నైపుణ్యాలే సోపానాలుగా అంతర్జాతీయస్థాయికి చేరుకున్న వుడయార్ ఎందరికో గురుతుల్యులు, మరెందరికో ఆదర్శప్రాయులు



గవర్నర్ రంగరాజన్ అభినందనలు

1938లో పశ్చిమ గోదావరి జిల్లా నత్తారామేశ్వరంలో కాశీపండితులు, ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధులైన దేవగుప్తపు సత్యలింగం వుడయార్, భద్రమాంబ దంపతులకు జన్మించిన వుడయార్ డిగ్రీ అనంతరం 1959లో విశ్వకవి రవీంద్రుడు స్థాపించిన శాంతినికేతన్‌లో చేరి ఎనిమిది సంవత్సరాలపాటు పద్మభూషణ్ నందలాల్ బోన్, పద్మభూషణ్ రాంకింకర్‌జైజ్, పద్మశ్రీ రాధాచరణ బక్షి, రామ్ మనోహర్ సిన్హా వంటి ఉద్దండులైన గురువుల వద్ద చిత్రశిల్పకళలు అభ్యసించి ఫైన్ ఆర్ట్ అండ్ క్రాఫ్ట్స్‌లో డిప్లోమా పొందారు

పండిట్ జవహార్‌లాల్ నెహ్రూ, డా॥ బాబూరాజేంద్రప్రసాద్, బి ఆర్ అంబేద్కర్, లాల్ బహుదూర్ శాస్త్రి, ఇందిరాగాంధీ, ఎలిజబెత్‌రాణి, కుముద్‌బెన్ జోషిలచే ప్రశంసలు, అవార్డులు అందుకున్న వుడయార్ రూపొందించిన కళాఖండాలు కాశ్మీర్, ఇండోర్,



అస్సాం, నాగాలాండ్ వారణాసి, లక్నో, కలకత్తా, నేపాల్, టిబెట్, మణిపూర్, తిరుపతి, ఢిల్లీ, బొంబాయి, మీరట్, మద్రాను మ్యూజియంలలో శోభిల్లుతున్న వీరి కళాఖండాలు, వీరి అంతర్జాతీయ స్థాయిని చాటుతున్నాయి

చిత్రశిల్పకళల రెండింటిలోను ప్రాక్ప పశ్చిమశైలిలో సమానంగా కళారచన చేయగల దిట్ట అయిన వుడయార్ విదేశీ పర్యటనావకాశం లభించగా జపాన్, టిబెట్, నేపాల్, భూటాన్, చైనా, శ్రీలంక, ఇండోనేషియా, మంగోలియా, అమెరికా దేశాలు పర్యటించి అక్కడి శిల్పకళా నైపుణ్యాలను పరిశీలించి శాంతికేతన్ ప్రతిష్ఠను మరింత ఇనుమడింప చేసారు

1986లో హైదరాబాద్‌లోని టాంక్‌బండ్ పై అన్నమాచార్యుని కాంస్య విగ్రహాన్ని రూపొందించి అప్పటి ముఖ్యమంత్రి ఎన్ టి ఆర్ ను ముగ్ధుల్ని చేసారు నాలుగు దశాబ్దాలుగా శిల్ప రచనచేస్తూ ఇప్పటికి సుమారు 45,960 శిల్పాలు రూపొందించారు వీరి అద్భుత కళానైపుణ్యానికి తార్కాణంగా ఇండియన్ మైఖేలేంజిలో, శిల్పకళాసార్వభౌమ, ఆచార్య శిల్పశ్రీ, శిల్ప సరస్వతి, అభినయమయిబ్రహ్మ, ఆదర్శశిల్పి, సమతాశిల్పి వాస్తు విశారద, ది రియల్ స్కల్ప్టర్ ఆఫ్ ఇండియా, మానవతా శిల్పి వంటి అనేక బిరుదులు వరించాయి

పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లి గూడెంలో వుడయార్ అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ పేరుతో శిల్ప కళాశాలను స్థాపించి ఎందర్నో యువశిల్పులుగా రూపుదిద్ది భావితరానికి శిల్పకళా చాతుర్యాన్ని అందిస్తూ కళాసేవ చేస్తున్నారు ■

## రినైజాన్సు ఆర్ట్

*14-16 శతాబ్దాల మధ్య యూరప్‌లో భూస్వామ్య సంస్కృతి క్షీణిస్తూ, ఆధునిక సంస్కృతి రూపొందిన కాలంలో కళలు, సారస్వతం, విజ్ఞానశాస్త్రాలు పునర్వికాసం పొందాయి మధ్య యుగాల నాటి మతపరమైన, నిర్జీవమైన సిద్ధాంతాలను త్రోసిపుచ్చి మానవతా వాదం నెలకొంది లియోనార్డోదావిన్సి, మైకేలేంజిలో వంటి మహామహులు వాస్తు, శిల్పం, చిత్రకళలను అపూర్వమైన రీతిలో మలచి, తరువాత తరాలవారికి మార్గదర్శకులయ్యారు*

సుంకర చలపతిరావు

# చిత్రకళావనంలో వికసించిన 'పద్మాలు'

ఆధునిక ఆంధ్ర శిల్ప చిత్రకళారంగాలకు శతసంవత్సరాల విశిష్ట చరిత్ర వుంది నాటి దామెర్ల రామారావు నుండి నేటి శిరందాసు వెంకటరామారావు వరకు, ఎందరెందరో కళాకారులు తమదైన శైలిలో కళాఖండాలు సృష్టించి, తెలుగు పతాకాన్ని వినువీధుల్లో ఎగుర వేసి ప్రశంసలు పొందారు అటు ప్రజలు ఇటు ప్రభుత్వం అండదండలు లేకపోయినా, స్వయంకృషితో సాధన చేసి, తమ ప్రతిభను చాటుకొన్నవారిలో కూర్మాపు నరసింహం, ఇరుకుల కుమారిలస్వామి, కంచర్ల బ్రహ్మయ్య, వడ్లమాని, పి టి రెడ్డి, వేలూరి రాధాకృష్ణ, ఎం రాజాజీ, అంట్యాకుల పైడిరాజు, కేతా, తలిశెట్టి, సి ఎన్, బి వి, చామకురా, కొండపల్లి, బద్రినారాయణ, పిలకా, వైకుంఠం, గుర్రం, ఉల్చి, గౌరీశంకర్, దొరైస్వామి, సూర్యప్రకాష్, జగదీష్ మిట్టల్, లక్ష్మాగౌడ్, గిడుతూరి లక్ష్మీనారాయణ, వ పా, తాడేపల్లి వెంకన్న, బాపు, శిష్ట్లా తదితరుల్ని ప్రముఖంగా పేర్కొనవచ్చు వీరంతా అంతర్జాతీయ, జాతీయస్థాయిల్లో అవార్డులు పొంది నిపుణకళాకారులుగా గుర్తింపు పొందారు అయితే వీరి ప్రతిభను ప్రభుత్వం గుర్తించలేదు ప్రతిభావంతులందర్నీ ప్రభుత్వం గుర్తించాలన్న నిబంధనలేవీ లేవు ప్రభుత్వం గుర్తించిన వారంతా ప్రతిభావంతులే అనడంలో సందేహానికి తావులేదు

తెలుగు చిత్రకళావనం ఒక పూదోట ఇందులో రకరకాల సువాసనలు వెదజల్లే రంగురంగుల పుష్పాలు వున్నాయి ఈ పుష్పాల్లో 'పద్మా'లకు ఒక ప్రత్యేకత వుంది అందం, ఆకర్షణ, సువాసనలో దీనికి ఇదేసాటి భారతదేశానికి ఈ పద్మమే జాతీయ పుష్పం వివిధ రంగాల్లో ప్రతిభ కల్గినవార్ని కేంద్ర ప్రభుత్వం గుర్తించి పద్మశ్రీ, పద్మభూషణ్, పద్మవిభూషన్ పేర్లతో అవార్డుల్ని ఇచ్చి గౌరవిస్తున్నది ఈ అవార్డు పొందిన వారికి ప్రభుత్వం తరపున రాష్ట్రపతి ఒక ప్రశంసా పత్రం, జ్ఞాపిక అందజేస్తూంటారు ఈ అవార్డుల్ని ఏర్పాటు చేసినప్పటి నుండి ఇప్పటి వరకు తెలుగుశిల్ప, చిత్రకళారంగాల్లో బద్రినారాయణ, జగదీష్ మిట్టల్, తాడేపల్లి వెంకన్న, ఎస్వీ రామారావు, తోట తరణిలు అందుకొని తెలుగు కళకు వెలుగు తెచ్చారు అయితే వీర్ని గురించి ఆంధ్రేతరులకు తెలసినంతగా మనకు తెలియదు కళ కుల, మత ప్రాంతీయం, భాషా, భేషజాలకు అతీతమైనదని ఈ తెలుగు వెలుగులు మరోసారి సాటిచెప్పారు వీరిలో తాడేపల్లి వెంకన్న, తోటతరణి తప్పించి మిగిలినవారు ప్రవాసాంధ్రులే ఆంధ్రప్రదేశ్‌లో పుట్టి 'పద్మశ్రీ' అవార్డుల్ని అందుకొన్న శిల్ప చిత్రకారుల్ని గురించి ఈ వ్యాసంలో తెలుసుకొందాం!

ఆంధ్ర జానపదశైలిని ఆధారం చేసుకొని ఆధునాతనంగా అనేక చిత్రాలు గీచి

వలు ఉత్తమ జాతీయ బహుమతులు గెలుపొందిన చిత్రకళా స్రష్ట బద్రినారాయణ సికింద్రాబాద్‌లో జన్మించిన బద్రి దేశంలోని అన్ని పెద్దనగరాల్లోనూ, పట్టణాల్లోను అయన సొంతంగా చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించి కళాభిమానుల ప్రశంసలందుకొన్నారు హైద్రబాద్‌లోనున్న సాలార్‌జంగ్ మ్యూజియంలో వీరిచిత్రాలు మనం చూడవచ్చు వీరు రచయిత, కళావిమర్శకులు కూడా 1987లో కేంద్ర ప్రభుత్వం వీరికి 'పద్మశ్రీ' అవార్డుని అందజేసింది మన రాష్ట్రానికి చెందిన చిత్రకారునికి ఈ అవార్డు రావడం ఇదే ప్రధమం



పద్మశ్రీ ఎస్ వి రామారావు

చిత్రకారునిగా, చిత్రకళా చరిత్రకారునిగా, గ్రాఫిక్ అర్టిస్టుగా సుప్రసిద్ధి పొందిన జగదీష్ మిట్టల్ 1925లో సికింద్రాబాద్‌లో పుట్టారు కోల్‌కత్తాలో నున్న శాంతినికేతన్‌లో చిత్రకళలో శిక్షణ పొందారు భారతీయ సంస్కృతి కళల జాతీయనిధిని భార్య కమలతో కల్సి అయన స్థాపించారు 1976లో హైద్రాబాద్‌లో జగదీష్, కమల మిట్టల్ మ్యూజియం ఆఫ్ ఇండియన్ ఆర్టును స్థాపించారు దేశవ్యాప్తంగా వారు సేకరించిన కళాఖండాల్ని అమెరికా, ఫ్రాన్స్, మొదలగు దేశాలల్లో జరిగిన భారతీయ సాంస్కృతిక ఉత్సవాల్లో ఈ కళాఖండాల్ని ప్రదర్శించి, భారతీయ కళను అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చారు కేంద్రప్రభుత్వం వీరి సేవల్ని గుర్తించి 1990లో 'పద్మశ్రీ' అవార్డు అందజేసింది

తెలుగు శిల్ప కళకు అంతర్జాతీయ గుర్తింపు తెచ్చిన శతశాతం అంధ్రుడు తాడేపల్లి వెంకన్న పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెంలో పుట్టిన వీరు శిల, దారువు అన్నిరకాల లోహములతో శిల్పాలు తయారు చేయడంలో నేర్పరి మన జాతీయ నాయకులైన జవహర్‌లాల్ నెహ్రూ, సర్వేపల్లి రాధాకృష్ణన్, ఇందిరా గాంధీ, వి వి గిరి, లాల్ బహుదూర్ శాస్త్రి నీలం సంజీవరెడ్డి తదితరుల శిల్పాలేకాక అంతర్జాతీయ గుర్తింపు పొందిన రెండవ ఎలిజబెత్‌రాణి, అమెరికా మాజీ అధ్యక్షుడు జాన్సన్, రష్యా ప్రధాని కొసిగిన్, క్రైస్తవ



పద్మశ్రీ తోట తరణి

మతాధికారి అంతర్జాతీయ ప్రశంసలం దుకొన్నారు లండన్ బకింగ్‌హామ్ ప్యాలస్, వాషింగ్‌టన్ వైట్‌హౌస్‌లో వీరి శిల్పాలు ఉన్నాయి వీరికి శిల్ప చిత్రకళలతో పాటు గణితశాస్త్రమంటే ప్రత్యేక అభిమానం అదే విధంగా అశువుగా తెలుగు పద్యాలు చెప్పగల నేర్పరి

అమెరికా, లండన్ ఫ్రాన్స్ వంటి దేశాల్లో ప్రముఖ చిత్రకారునిగా గుర్తింపు పొందిన వ్యక్తి ఎస్వి రామారావు ఆధునిక చిత్రకళకు ఆది పురుషుడు పికాసో, ప్రముఖ కళాకారుడు కోసోర్చలతో పాటు ఇంటర్నేషనల్ బైనిమీల్ ఆహ్వానం పొందిన యశస్వి, ఎస్విరామారావు ఇంటర్నేషనల్ హెరాల్డ్, వాషింగ్‌టన్ పోస్టులకి చెందిన చిత్రకళా

విమర్శకుల ప్రశంసలందుకొన్న ఏకైక భారతీయుడు మన రామారావు రెండవ కామన్ వెల్త్ ఫెస్టివల్ ఆఫ్ యాబ్‌స్ట్రాక్ అర్టులో లార్డక్రాఫ్ట్ అత్యుత్తమ నైరూప్య చిత్రబహుమతి అందుకొన్న ఒకేఒక్కరు ఎస్వీరామారావు లండన్‌లో ప్రసిద్ధి పొందిన విక్టోరియా ఆల్‌బర్ట్ మ్యూజియంలో పికాసో, మరోబ్రాంక్‌ల చిత్రాలు సరసన మన రామారావు చిత్రాలున్నాయంటే అది మనకెంత గర్వకారణమో ప్రతేకించి చెప్పాల్సిన అవసరం లేదు

కృష్ణాజిల్లా గుడివాడకు చెందిన రామారావు డ్రాయింగ్ టీచరు కె వేణుగోపాల్, చలనచిత్ర కళాదర్శకులు మా గోఖలే మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్సు ప్రిన్సిపాల్ దేవీప్రసాద్‌రాయ్ చౌదరి, ప్రముఖ ఆధునిక చిత్రకారులు ఫణిక్కర్, జగమెరిగిన జానపద చిత్రకారులు కె శ్రీనివాసులు తదితరుల వద్ద ఆయన శిక్షణ పొంది మహకళాకారుని స్థాయికి ఎదిగారు వీరి చిత్రాలు ప్రపంచ ప్రసిద్ధి పొందిన మ్యూజియం ఆఫ్ మోడ్రన్ ఆర్టు న్యూయార్కు, నేషనల్ గ్యాలరీ అఫ్ అర్టు న్యూజిలాండ్, సిట్టెల్ వాషింగ్‌టన్, సాలార్‌జంగ్ మ్యూజియం హైద్రాబాద్‌లలో వున్నాయి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం గత సంవత్సరం వీరికి గౌరవ డాక్టరేట్ పట్టా ప్రధానం చేసింది గత రిపబ్లిక్ ఉత్సవాల్లో కేంద్ర ప్రభుత్వం రామారావుకి 'పద్మశ్రీ' అవార్డు అందజేసింది అదే విధంగా ప్రముఖ సినీ కళాదర్శకులు తోటతరణిని కూడా ప్రభుత్వం 'పద్మశ్రీ'తో గౌరవించిందింది ఆయన కళాప్రతిభకు 'బొంబాయి' చిత్రం ఒక ప్రతీక భవిష్యత్తులో మరెందరో మనకళాకారులు 'పద్మ'ల్ని కైవసం చేసుకొని తెలుగుతేజాన్ని సాటి చెప్పగలరని ఆశిద్దాం ■

## కార్టూన్ చిత్రాలు

కార్టూన్ చిత్రాల్లో చిత్రకారులు గీచిన చిత్రాలను ఫిల్మ్ తీస్తారు ఈ చిత్రాల్లో యాక్టర్స్ జంతువుల, పక్షుల, మనుషుల కార్టూన్‌లు సూట్లు వేసుకొన్న కోతులను, మాట్లాడే చుంచులను, పియానో వాయించే నందులను తెరపై కెక్కించిన కీర్తి వాల్ట్ డిస్నీకి దక్కింది ఆయన మొదటి కార్టూన్ చిత్రం "మిక్కిమౌస్" 1928లో నిర్మించబడింది 1938 లో పూర్తి నిడివిచిత్రం స్నోవైట్ అండ్ సెవన్‌డ్వార్ఫ్సు నిర్మించాడు ఆ చిత్రాన్ని తయారు చేయడానికి డిస్నీ 3 సం॥లు శ్రమించాడు చిత్రంలోని కార్టూన్ల సంఖ్య 4,77,000 మిక్కీమౌస్ ఒక గంతువేసినట్లు చిత్రించడానికి 16 డ్రాయింగులు, హలో అని చుంచు అనటానికి 8 డ్రాయింగులు అవసరం

కార్టూన్ చిత్రాలు ఒక నిమిషం సేపు తెర మీద ప్రదర్శింపబడాలంటే 1,440 బొమ్మలు గీసి వాటిని షూట్ చేయాలి 10 నిముషాల కార్టూన్ ఫిల్ముకోసం 14,400 బొమ్మలు గీస్తారు 10ని॥ కార్టూన్ సినిమా కోసం 5 నుండి 7 నెలలు కృషి చేస్తారు ఒక పెద్ద కార్టూన్ చిత్రాన్ని తీయడానికి 4 లక్షలకు పైగా బొమ్మలు గీయాలి

వాల్ట్‌డిస్నీకి చనిపోయేముందు తన కార్టూన్ చిత్రాలపై ఏటా 100 కోట్లు రూ॥ ఆదాయం వచ్చేది

ఇండియాలో కార్టూన్ చిత్రాల నిర్మాణం 1944లో ప్రారంభమైనది

రా రా ప్రసాద్

# వ్యంగ్య బాణాలు సంధిస్తున్న శ్రీధర్

కొంతమంది జీవితాల్లోని కొన్ని అపశృతులే తర్వాత వారి జీవితాలకి ఫలశృతులుగా పరిణమిస్తాయి నార్ల వెంకటేశ్వరరావు తన జీవిత ప్రదమభాగంలో బడిపంతులు ఉద్యోగం కోసం చెప్పులరిగేలా తిరిగి విఫలమై జర్నలిస్టు అవతారం ఎత్తారు ఆ రోజు బడిపంతులుగా ఆయన సఫలమై ఉంటే తెలుగు జర్నలిజం ఓ పెద్ద దిక్కును కోల్పోయేదే

అలాగే ఓ యువకుడు ఇంజనీరు కావాలని కలలు కని అందులో విఫలమై ఆఖరికి ఎలక్ట్రానిక్స్‌లో బీ యస్సీ ఐనా చేయాలని ప్రయత్నించి ఆరోగ్యం అనుకూలించక ఆ డిగ్రీని కూడా అసంపూర్తిగా వదిలి తిరిగి ఇంటిముఖం పడితే ఆ జీవితానికి అంతకన్నా అపశృతి ఏముంది? నిరాశా వాదులకు అది అపశృతే కానీ ఆ అవశృతే అతని జీవితానికో ఫలశృతి అయింది కోట్లాది మంది ఆంధ్రుల హృదయాలలో అతనో అభిమాన కార్టూనిస్టుగా స్థిరపడే అవకాశమైంది



సితార సినీపత్రికలో లే అవుటు ఆర్టిస్టుగా జీవితాన్ని ప్రారంభించినప్పటి శ్రీధర్‌కు కార్టూన్‌లంటే అభిరుచే గాని ప్రవేశం లేదు కాని ఒకసారి తనలోని ప్రతిభ గుర్తింపబడి తన ధశ, దిశ, నిర్దేసించుకున్న తర్వాత తీవ్రమైన కృషిసల్పి తన స్ధానాన్ని సమర్ధతని నిరూపించుకున్నవాడు శ్రీధర్

డేవిడ్‌లో, శంకర్ ఆర్ కె లక్ష్మణ్ లను అభిమానించే శ్రీధర్‌కు ఆర్ కె లక్షణ్ ఏకలవ్య గురువు అనుకోవచ్చు చూడడానికి కొంటె బొమ్మలుగానే కనిపించినప్పటికి కఠోరశ్రమ చేయకపోతే కార్టూన్స్ అందులోని కారికేచర్లు వంటబట్టవు అంటారు శ్రీధర్ ఆరడుగుల అందగాడు ఆంధ్రుల అభిమాన నాయకుడు శ్రీధర్ గీతలో కనిపించినంత సరళంగా స్పష్టంగా మరెక్కడా కనపడదు అందు కోసం వందలాది బంగిమలో ఎన్ టి ఆర్ చిత్రాన్ని ప్రాక్టీస్ చేయవలసి వచ్చింది అంటారు ఆ ప్రాక్టీసే కళాకారుడికి తపస్సుతో సమానం

రోజువారి జర్నలిజం (డైలీ జర్నలిజం) లో కార్టూన్ ఓ అత్యవసర సరుకులాంటిది ఓ ప్రముఖ సంఘటన జరిగిన పన్నెండు గంటలలోపు స్పందన రావాలి, స్పష్టత ఏర్పడాలి అప్పుడే ఓ మంచి కార్టూన్ రూపుకడుతుంది కాని ఇది అన్నిసార్లు ఒకేలా జరగదు అందుకే అన్నీ కార్టూన్లు ఒకేస్థాయిలో ఉండవు అంటూ అసంతృప్తి పడతాడు శ్రీధర్ ఒకోసారి సరయిన ఐడియా స్టైల్ కావడానికి




కొన్ని రోజులు, మాసాలు కూడా పట్టవచ్చు ఎందుకంటే ఆలోచలకెప్పుడూ ఎక్స్‌ఫరీడేటు ఉండదు అందుకే కార్టూనిస్టు దినపత్రికల డెడ్‌లైన్ దాటి మానవత్రికలలో కూడా, భిన్నమైన పత్రికలలో కూడా కార్టున్స్ వేసే అవకాశాన్ని కలిగి ఉండాలి భిన్నమైన రంగాలలో తన కుంచెను కదిలించ గలగాలి (సాహిత్యం, సామాజికం సంస్కరణ, తదితర రంగాలలో) సారాద్యమాన్ని వందలాది కార్టూన్స్‌తో బలపరిచిన శ్రీధర్‌కు నిజంగా అవకాశం ఉంటే దాని వెన్నుపోటు దార్లను వేలాది కార్టూన్లతో వేదించి వుండేవాడే కాని మిన్నకుండే వాడు కాదు

ఇప్పటికే వేలాది కార్టూన్స్ పూర్తి చేసిన శ్రీధర్ నుండి లక్షలాది కార్టూన్ రావాలని కోట్లాది మంది ఆంధ్రులు ఆసిస్తున్నారు వాటిలో తమ కష్టాలు వాటి పరిష్కారాలు చూడాలని అభిలషిస్తున్నారు ఒక సమర్దుడైన కళాకారుడి నుండి సమకాలిన సమాజం అలా ఆశించడంలో ఆపేక్షించ వలసింది ఏమీలేదు ఎందుకంటే ప్రతీ కళాకారుడు ఒక సామాజిక ఉత్పన్న మే సమాజం వెనుక బడి ఉన్నప్పుడు దాన్ని ముందుకు నడిపే బాధ్యత బుజానవేసుకున్న కళాకారుడికి ఆ సమాజం ఋణపడుతుంది అలాకాక తనకు అవసరం ఉన్న మేరకే సమాజానికి ఉపయోగపడే కళాకారుడు సమాజానికే ఋణపడతాడు

సమాజం తనకి ఋణపడేలా ఉండాలో, సమాజానికి తాను ఋణపడి ఉండాలో నిర్ణయించుకునే స్వేచ్ఛ వ్యక్తికి ఎప్పుడూ ఉంటుంది

శ్రీధర్ తన చారిత్రక పాత్రను ఇంకా నిర్వర్తించ వలసి ఉంది అది పూర్తయినరోజున డేవిడ్‌లో, శంకర్, ఆర్ కె లక్ష్మణ్‌ల సరసన తెలుగువాళ్ళు శ్రీధర్ పేరును కూడా చేర్చుకోవచ్చు అందుకు తగిన సామర్ద్యం కలవాడు శ్రీధర్ ■

## కళలు – సామాజిక ప్రగతి

కళ అనేది ప్రజలకు చెందిన ఆస్తి అది గనిలోనుంచి తీసిన బంగారం అది ప్రజల హృదయకుహరాల్లో నాటుకుపోయి, వారి అభ్యుదయానికి మార్గదర్శకం కావాలి

– లెనిన్

మాకినీడి సూర్యభాస్కర్

# చిత్రకళా విమర్శకులు

లలిత కళలు అందరికీ అలవడవు అలవడినా ఏ ఒక కళ ఒక్కొక్కరికి అబ్బుతుంది అలా కాకుండా రెండు మూడు కళలు ఒకరికే అబ్బాలంటే వారిలో సృజనశక్తి అపరిమితం కావడమే కాకుండా, ఆ శక్తిని భిన్న కళామార్గాల్లో ప్రవహింప జేయగలిగే నేర్పు ఉండాలి అప్పుడే వ్యక్తి సకల కళా పారంగతుడై, ఒక శక్తిగా రూపొందుతాడు దృష్టిని సమిష్టి చేయగలుగుతాడు అయితే ఇంతటి సృజనా వైవిధ్యం చాలా చాలా కొద్దిమందిలోనే కనబడుతుంది

కొందరు చిత్రకారులు కావచ్చు కొందరు రచయితలు కావచ్చు చిత్రకారులందరూ రచయితలు కూడా కాగలరు అలాగే రచయితలందరూ చిత్రకారులూ కాలేరు కొందరు మాత్రం చిత్రకారులూ, రచయితలూ కూడా కాగలరు అయితే ఈ కావడంలో మళ్ళీ రెండు రకాలు, సృజనశీలియైన ఒక చిత్రకారుడు సృజనశీలియైన రచయిత కావచ్చు లేదా, విమర్శనాత్మక రచయిత కూడా కావచ్చు సృజనశీలియైన రచయిత (ఆ మాటకొస్తే ఏ కళాకారుడైనా సరే) సంశ్లేషణ కావిస్తే, విమర్శనాత్మక రచయిత విశ్లేషణ చేస్తాడు చిత్రకారులైన వారిలో ఈ రెండు రకాల రచయితలూ ఉన్నారు అడవి బాపిరాజు, మొక్కపాటి కృష్ణమూర్తి, సంజీవదేవ్ వంటివారు మొదటి కోవకు వస్తే, ఇరుకుల కుమారిలస్వామి, పిలకా లక్ష్మీనరసింహమూర్తి, చలసాని ప్రసాదరావు, కొండిపర్తి శేషగిరిరావు, సుంకర చలపతిరావు మొదలైన వారు రెండో కోవలోకి వస్తారు రెండో సమూహంలోని వారు మొదటి సమూహంలోనికి వెళ్ళడం అరుదుగాని, మొదటివారు రెండో సమూహంలోకి సునాయాసంగా రాగలరు అలా వచ్చిన వారే అడవి బాపిరాజు, సంజీవదేవ్‌గార్లు వారు సృజనశీలకమైన రచనలతో పాటు విమర్శ కూడా చేయగల మేధావులు అట్టి చిత్రకళా విమర్శకులను గురించి వివరించడమే ప్రస్తుత వ్యాస ఉద్దేశ్యం

చిత్రకళా విమర్శకులలో చిత్రకళను అభ్యసించిన వారూ ఉండవచ్చు, కేవలం ఆరాధకులూ ఉండవచ్చు కూర రుచిగా ఉన్నదీ లేనిదీ వండిన వారే కాక, వండడం రానివారూ చెప్పగలరు చిత్రాలను విమర్శించాలంటే ఆ కళలో ప్రవేశం ఉండనవసరం లేదు ఆస్వాదించగల రసహృదయం ఉంటే చాలు అయితే ఇటువంటి చిత్రకళా విమర్శకులు బహుకొద్దిమంది మాత్రమే వారిలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, చాగంటి సోమయాజులు, ఆనంత సోమసుందర్‌లు ప్రముఖులు శ్రీపాదవారు దేవాలయ శిల్పాలను గురించి వివరిస్తూ ఎన్నో విమర్శక వ్యాసాలు రాశారు వీరు కొన్ని వ్యాసాలను 'కృష్ణశ్రీ' పేర ప్రచురించారు చాసో వారి ఎరుకలో జరిగిన చిత్రకళా ప్రదర్శనలను వివరిస్తూ కొన్ని సమీక్షాత్మక వ్యాసాలను పత్రికలలో

ప్రకటించారు సోమసుందర్ అలాంటి వ్యాసాలేవీ ఎప్పుడూ రాయకపోయినా, లియోనార్డో డావిన్సీ కళాజీవన గాథని రచించి కళా విమర్శకులయ్యారు ఈ కళాజీవనగాథను మొదట ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో ధారావాహికగా వెలువరించి, ఆ తరువాత పుస్తకరూపంలోనికి తీసుకువచ్చారు

కళాతత్వాన్ని శాస్త్ర దృక్పథంలో వివేచించిన పండితులు పురాణం సూరిశాస్త్రిగారు ఈయన 1925 లో తమ (విమర్శక పారిజాతము'ను ప్రచురించారు ఆ గ్రంథంలోని 'కళారహస్యము' అనే



సంజీవదేవ్



అధ్యాయంలో 'రసవిచారణ – ఈస్థటిక్స్' అన్న ఉపశీర్షిక క్రింద వారు కళాతత్వ వివేచనను సవివరంగా చేశారు ఆ విధంగా కళాతత్వ వివేచన చేసిన తొలి మేధావి ఆయన తరువాత 1926లో బసవరాజు అప్పారావుగారు 'ఆంధ్ర కవిత్వ చరిత్రము'ను ప్రకటించారు ఈ రెండు గ్రంథాలలోను సాహిత్యానికి అధిక ప్రాధ్యానా కాగా, బసవరాజుగారు అక్కడక్కడా శిల్ప చిత్రకళలను కూడా ప్రస్తావించారు ఈ రెండు గ్రంథాలూ ఎక్కువగా సౌందర్య వివేచనను చేశాయి ఆ తర్వాత రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, విశ్వనాథ సత్యనారాయణగార్లు కూడా సౌందర్య మీమాంసను క్వాచిత్కంగా పరామర్శించినా, కొండూరు వీరరాఘవాచార్యులు తమ 'వ్యాసావళి'లో సాహిత్యేతర లలిత కళలను, ముఖ్యంగా శిల్పకళను బాగా వివేచించారు ఆ తర్వాత లలితకళలన్నింటిలోని పరస్పర సామ్యాన్నీ వివరిస్తూ 'సాహిత్య శిల్ప సమీక్ష'లో చక్కగా వివేచించారు పింగళి లక్ష్మీకాంతంగారు

చిత్రకళా విమర్శ చేసినవారిలో అధికులు చిత్రకారులే కావడం విశేషం చిత్రకళా అనే కాదు, ఏ రంగంలోనూ తెలుగులో పుస్తకాలే లేని రోజులలో చిత్రకళ గురించి రాసినవారు మంత్రవాది వేంకటరత్నము, మ సూర్యప్రకాశరావు, అడవి బాపిరాజు వంటివారు ప్రాతఃస్మరణీయులు మాగంటి బాపినీడు సంపాదకత్వంలో వెలువడిన 'ఆంధ్ర





చలసాని

సర్వస్వము'లో అడవి బాపిరాజుగారు ఆంధ్ర శిల్ప చిత్రలేఖనాలను స్థూలంగా పరిచయం చేశారు త్రివేణి సహాయక సంపాదకునిగాను, మీజాన్ సంపాదకునిగాను ఆయన ఎన్నో కళావిమర్శక వ్యాసాలు రాశారు ఆయన నవలల్లో కూడా సాధ్యమైనప్పుడల్లా కళాచర్చ చేసేవారు 'తుపాను'లో ముఖ్యంగా ఆయన చేసిన కళావిమర్శ, అభిప్రాయాలు గమనించ దగ్గవి మ ప్రకాశరావుగారు మద్రాసు 'తెలుగు భాషా సమితి'వారు ప్రచురించిన తెలుగు విజ్ఞాన సర్వస్వపు మూడో సంపుటిమైన 'తెలుగు సంస్కృతి'లో ఆంధ్ర శిల్పకళా పరిణామం గురించి, ఆంధ్ర చిత్రకళ గురించి సవిమర్శనాత్మకంగా వివరించారు

చిత్రకళా విమర్శకు పర్యాయపదం సూర్యదేవర సంజీవదేవ్ చిత్రకళా

విమర్శకునిగా ఆయన ఆంధ్ర రాష్ట్రానికే కాక యావత్ భారతావనికే సుపరిచితులు అసిత్‌కుమార్ హల్దార్ తర్వాత చిత్రశిల్ప కళల్లోని సౌందర్యాలను, లోతులను ప్రతిభావంతంగా విమర్శించిన ఏకైక విమర్శకులాయన వారి తర్వాత అంత గొప్ప కళాసమీక్షకులు లేరంటే అతిశయోక్తి కాదు 'తెల్లమచ్చలు'(కవిత్వం) లాంటి సృజనాత్మక రచనలను అటుంచితే, ఆయన వెలువరించిన కళావిమర్శక, గ్రంధాలు -రసరేఖలు, తేజోరేఖలు, కాంతిమయి, రూపదర్శిని మొదలైన గ్రంధాలలో ఆయన వస్తురూపాల గురించి, సౌందర్యం ఉనికి గురించి, కళాప్రయోజనం, రసానుభూతుల గురించి కళాకారునిగా తమకున్న అనుభవాన్ని జోడించి మంచి కళావిమర్శక వ్యాసాలు రాశారు వారిది ముఖ్యంగా అన్ని లలితకళల సమన్వయ దృష్టి ఈ సమన్వయ దృష్టితోనే కళావిమర్శ చేసిన మరొకరు కొండిపర్తి శేషగిరిరావు వీరు లలితకళలను సమన్వయ పరుస్తూ భారతి, కృష్ణా పత్రిక, ఆంధ్రప్రభ, పత్రిక, జ్యోతి, మూసీ, విశాలాంధ్ర, మిసిమి, ప్రజాశక్తి సప్తగిరి, తెలుగు, శ్రీవాణి, సాహితీమిత్ర వంటి పత్రికలలో ఎన్నో వ్యాసాలను ప్రచురించారు వాటిని 1986లో 'శాంతి -కాంతి' పేర, 1993లో 'సమన్వయ స్వరాలు' పేర గ్రంధస్థం చేశారు

తరువాత కళావిమర్శలో చెప్పుకోదగిన వారు చలసాని ప్రసాదరావు ప్రజాశక్తి వార పత్రికలో (1951-56), కాకతీయ పత్రిక అసోసియేట్ ఎడిటరుగా (1956-58), వసుధ సంపాదకునిగా (1971) 1975 నుండి విపుల, చతుర, ఈనాడు ఆదివారం అనుబంధం సంపాదకులుగా ఈయన ఎన్నో వ్యాసాలు ప్రచురించారు వాటిలో కళావిమర్శక వ్యాసాలూ ఉన్నాయి వీరి సంపాదకత్వంలో 'కళ' పేర ఏడు సంపుటాలు వెలువడ్డాయి వీరి కళావిమర్శక వ్యాసాలు కాకతీయశిల్పం, ఆధునిక చిత్రకళ, రష్యా చిత్రకళ, చిత్రప్రసాద్ మొదలైన గ్రంధాలుగా రూపుదిద్దుకున్నాయి 'కళ' సంపుటుల్లో కె కె రంగనాధాచార్యులు, రాంభట్ల కృష్ణమూర్తి, ఎన్ ఎ ఎస్ రావు, బొజ్జా తారకం వంటి ప్రముఖులు తమ వ్యాసాలలో కళావిమర్శచేయడం గమనించదగిన అంశం 'కళ' ఏడు సంపుటాలను వెలువరించడంలో ప్రముఖ చిత్రకారులు పి ఆర్ రాజుగారి కృషి ఎంతో ఉంది 1964-66 ప్రాంతంలో మాదేటి రాజాజీ 'తూలిక' అనే చిత్రకళా మాస పత్రికను నిర్వహిస్తూ ఆంధ్రాంగ్లాలలో ఎన్నో వ్యాసాలు ప్రచురించారు 1948లో దుర్గవరపు సర్వేశ్వరరావు అనే చిత్రకారులు ప్రచురించిన 'చిత్రకళా విమర్శ' అనే గ్రంధం కళావిమర్శలో చెప్పుకోదగింది

ఆంధ్ర ఆర్నాల్డుగా పేరుగాంచిన పిల్లల మర్రి వెంకట హనుమంతరావు (చిత్రకారులు కాదు) గారు తమ 'సాహిత్య సమాలోచనము' అన్నా గ్రంధంలో(1962, అయిదవ ముద్రణ) సాహిత్యంతోపాటు ఇతర లలితకళలను ముఖ్యంగా శిల్ప, చిత్రకళలను సమాలోచన గావించారు కవిని, చిత్రకారుణ్ణి పోలుస్తూ రాసిన తులనాత్మక వ్యాసం గొప్పది ఇంచుమించు ఇదే కాలంలో అంటే అరవయ్యవ దశకం తొలి సంవత్సరాలలో దిన, వార పత్రికలలో కళారంగ వ్యాసాలు తప్పని సరిగా వస్తుండేవి ఇ.కుమారిలస్వామి, పిలకా లక్ష్మీ గణపతి శాస్త్రి, ఆకురాతి కోటేశ్వరరావు, ఆచంట జానకిరాం వంటి కొంతమంది క్రమం తప్పకుండా రాస్తూండేవారు మొదటి ముగ్గురు చిత్రకారుల జీవన సంగ్రహాలు, పరిచయవ్యాసాలు ఎక్కువగా రాసేవారు పిలకావారి వ్యాసాలు ఆంధ్ర సచిత్ర వార

పత్రికలోను, ఆకురాతి వారి వ్యాసాలు ఆంధ్రప్రభ దిన పత్రికలోను అధికంగా వస్తుండేవి ఆచంట జానకిరాం సౌందర్యచర్చ, సౌందర్యానుభూతి గురించిన వివిధ వ్యాసాలను ఆంధ్రప్రభ సచిత్రవార పత్రికలో ప్రకటించారు వీరే కాక ప్రముఖ చిత్రకారులు మొక్కపాటి కృష్ణమూర్తి, కొండపల్లి శేషగిరిరావు చాలా వ్యాసాలు రాశారు

స్వర్గీయ చిత్రా వీరభద్రరావుగారు కేరళలోనున్న ప్రసిద్ధ దేవాలయాల గురించి 'కొచ్చిన్ మ్యూరల్స్' అనే గ్రంథాన్ని ఆంగ్లంలో రాశారు ఇంకా చిత్రమాలిక, వడ్రంగపు వస్తువుల డిజైన్లను తెలిపే 'ఫర్నిచర్ డిజైన్స్' అనే గ్రంథాలను, ఆంధ్రశిల్పి, ఎన్ ఛాంటెడ్ హిమాలయాన్ అన్న గ్రంథాలను వెలువరించారు అలాగే వేలూరి రాధాకృష్ణ ఆంధ్ర చిత్రకళ గురించి, తెలుగు చిత్రకారుల గురించి ఎన్నో వ్యాసాలు పత్రికల్లో ప్రచురించారు చిత్రకళా వివరాలు తెలిపే 'కళోదంతం' అనే గ్రంథాన్ని కూడా ప్రచురించారు నవరంగ్ చిత్రకళానికేతన్ వెల్లటూరి పూర్ణానందశర్మ లోగడ 'రేఖాంజలి' పేర వివిధ సందర్భాలలో గీసిన చిత్రాలను వ్రాసిన చిత్రకళా వ్యాసాలను కూర్చి వెలువరించారు 1990 లో రేఖాచిత్రాలతో కూర్చిన 'మన పండుగలు' అనే గ్రంథాన్ని ఇటీవలనే 'చిత్రకళా దీపిక' అనే మరో గ్రంథాన్ని వారు ప్రచురించారు విశ్వవిఖ్యాత ఆంధ్ర చిత్రకారులు పద్మశ్రీ యస్ వి రామారావు రేఖా ప్రచురణల పేర ఈ మధ్యనే చిత్రకళా విమర్శక గ్రంథాలను ప్రచురించడం ఆరంభించారు

టీ వి గా ప్రఖ్యాతి గాంచిన టి వెంకట్రావు, సుంకర చలపతిరావు, కళాసాగర్ ప్రస్తుతం అనేక పత్రికలలోను, మాగజైన్లలోను విరివిగా చిత్రకళా విమర్శక వ్యాసాలను ప్రకటిస్తున్నారు చిత్రకళ చరిత్ర గురించీ, రీతుల గురించి, సంవిధానాల గురించిన సమీక్షాత్మక వ్యాసాలెన్నో ప్రకటించారు టీ వీ వారు 1993లో 'చిత్రకళా చరిత్ర' అనే గ్రంథాన్ని ప్రచురించారు సుంకర చలపతిరావు దామెర్ల, వడ్డాదిలపై మోనోగ్రాఫ్‌లు ప్రచురించారు 'చిత్రకళా రత్నాలు' పేర సుమారు వందమంది తెలుగు చిత్రకారులను పరిచయం చేసే గ్రంథాన్ని 1987లో ప్రచురించారాయన ఇంకా కొందరు చిత్రకారులు యీడూరి రామచంద్రరావు, గొల్లపల్లి వెంకటేశ్వరరావు, బద్రినారాయణ మొదలైన వారెందరో కళావిమర్శక వ్యాసాలను రాశారు 1987లో యం ఆర్ అప్పారావు గారు 'భారతీయ చిత్రకళ' పేర ప్రచురించిన గ్రంథంలో షడంగచర్చ, ప్రాచీన చిత్రికా చిత్రాల గురించి, వామ చిత్రాల (మినియేచర్స్) గురించి చాలా విపులంగా వివరిస్తూ రాశారు ఇంతకు ముందు ఏమీ రాయకపోయినా, రావు వెంకటరావుగారు ఈ మధ్యనే ఒక చిన్న పుస్తకాన్ని రాశారు ఈ వ్యాసకర్త చిత్రాలను పరిచయం చేస్తూ రాసిన సమీక్షాత్మక గ్రంథం అచ్చులో ఉంది

పిల్లలు చిత్రకళను స్వయంగా నేర్చుకునేందుకు వీలుగా కొందరు చిత్రకళా బోధినులను రచించారు తలిశెట్టి రామారావు రచించిన 'తెలుగు బాలల చిత్రకళా స్వబోధిని' బాలల కోసం తెలుగులో ప్రచురింపబడిన మొట్టమొదటి గ్రంథం (వీరు 'భారతీయ చిత్రకళా' అనే గ్రంథాన్ని కూడా రాశారు) ఇదే ఒరవడిలో బాలలకోసం 'చిత్రలేఖన బోధిని రచించిన రెండవవారు కుసుమ విశ్వనాధన్ కంచర్ల బ్రహ్మయ్య 'చిత్రకళాబోధిని'ని ప్రచురించగా, ఎ వి బి యస్ ఆనంద్ పిల్లలూ బొమ్మలు వేయడం ఎలా? అన్న చిరుపొత్తాన్ని ప్రచురించారు టి వీ కూడా చిత్రకళను స్వయంగా నేర్చుకొనేందుకు వీలు కలిగించే

పుస్తకాన్ని రెండు ఈ మధ్యనే ప్రచురించారు 'మీరూ ఆర్టు నేర్చుకోండి' పేరుతో బుద్ధా సత్యనారాయణ రెండు చిన్నచిన్న సంపూటాలను ప్రచురించారు చామర్తి సూర్యచంద్ర ప్రకాష్ తమ స్వీయ సంపాదకత్వంలో 'చిత్రలేఖనము' పేర టి టి సి పరీక్షార్థులకు ఉపయోగపడే పుస్తకాన్ని ప్రశ్న-జవాబుల రూపంలో వెలువరించారు

వీరేకాక పెద్దతరంలో సి శివరామమూర్తి, విస్సా అప్పారావు పంతులు, శ్రీమతి రాగిణీదేవి, శీలా వీర్రాజు గార్లు, నేటితరంలో వై బాలయ్య 'బాతిక్', ఆర్ ఆర్ రెడ్డి (కాకతీయ శిల్పం) అనిపెద్ది జగన్నాథశాస్త్రి, ఎస్ ఎస్ రెడ్డి, ఎన్ కుమార్, పున్నా కృష్ణమూర్తి, చిలుకూరి హరిప్రసాద్, నాగేంద్ర, టి ఉదయవర్లు మొదలైన వారు కళావిమర్శక వ్యాసాలు రాస్తున్నారు కార్టూన్ కళ గురించి కూడా మోహన్, టివీ, సత్యమూర్తులు మంచి గ్రంథాలను వెలువరించారు ఈ వ్యాస రచయిత కూడా కళావిమర్శక వ్యాసాలనెన్నో తెలుగు, మిసిమి పత్రికలలో ప్రకటించారు ఆ వ్యాసాలను 'కళాతోరణం' పేర సంకలించడం కూడా జరిగింది

ఈ వ్యాసంలో పేర్కొన్నవారే కాక యింకా ఎందరో కళాకారులు, విమర్శకులు కళానుశీలన చేసినవారు ఉండవచ్చు రాసే సమయంలో గుర్తు వచ్చిన వారిని గుర్తుకొచ్చిన క్రమంలోనే రాసేయడం జరిగింది కాలానుక్రమణికను పట్టించుకోలేదు చిత్రకళా విమర్శకుల గురించి నాకు తెలిసిన సమాచారాన్ని స్థూలంగా యివ్వాలనుకోవడమే కారణం, మరేమీ కాదు ■

## కొంటె 'బొమ్మల'కు కోటి రూపాయల మ్యూజియం

తెలుగు కార్టూన్‌కి ఓనమాలు దిద్ది, చమత్కారం, వ్యంగ్యం, వెటకారం నేర్పి కొత్తదారి చూపిన మన కొంటె బొమ్మల బాపూగారి 'బొమ్మల కొలువు' చూపే అదృష్టం మనందరికీ కలుగబోతుంది

హైదరాబాద్‌లోని శిల్పారామం ఎదురుగా బాపు బొమ్మలకోసం మ్యూజియం ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది ఒక తెలుగు కార్టూనిస్టుకి ఇంతటి గౌరవం దక్కడం వెనుక ఇద్దరు అధికారుల కృషి పట్టుదల వుంది అసలు 'బాపు' బొమ్మల కోసం ఒక మ్యూజియం' వుండాలనే ఆలోచనకు సారధ్యం వహించింది, పునాది వేసింది ఐ ఎ ఎస్ అధికారి రాణికుముదిని మరో ఐ ఎ ఎస్ అధికారి హుడా మేనేజింగ్ డైరెక్టర్ లక్ష్మీపార్థసారధి భాస్కర్‌గారు మ్యూజియం కోసం శిల్పారామం ఎదురుగా అయిదు ఎకరాల స్థలంలో కోటిరూపాయల వ్యయంతో నిర్మాణం ప్రారంభించారు బాపు బొమ్మల మీద అభిమానంతో ఈ ఇద్దరు ఐ ఎ ఎస్ ల కృషి వల్ల బాపు అపరూప చిత్రాలను కాపాడుకునే అదృష్టం కలిగింది మనకి

మూడువేలకు పైగా కార్టూన్లు, లైన్ డ్రాయింగ్స్ కాక మరో అయిదువందల కలర్ ఇలస్ట్రేషన్స్‌ని ఈ మ్యూజియంలో తీర్చి దిద్దుతున్నారు బాపు గీసిన కదలని బొమ్మలతో పాటు ఆయన తీసిన కదిలే బొమ్మల వివరాలు సి డీల్లో భద్రపరుస్తున్నారు ఈ ఏడాది ఆఖరుకి మ్యూజియం సిద్ధం అవుతుంది

– స్మైల్

# ఫైన్ ఆర్ట్స్ కాలేజీలు - కోర్సులు

*సౌందర్యం, సత్యం - ఈ రెంటింటి రసత్సమ్మేళనమే కళ అంటాడు టాగోర్ కళ గురించి చెబుతూ టాల్‌స్టాయ్ ఒక వ్యక్తి తాను అనుభవించిన ఆనందాన్ని ఇంకొరిలో కలిగించడానికి చేసే ప్రయత్నమే కళ అని వివరిస్తాడు*

మనిషి ఆవిర్భావంనుంచీ ఎంతో కొంత దృష్టిని కళ వైపు సారించాడనడానికి ఉదాహరణలు చాలా దొరుకుతాయి త్రవ్వకాలలో బయటపడిన వస్తువులు కుడ్యచిత్రాలు ఈ విషయాన్ని స్పష్టపరుస్తున్నాయి ఆనందం, దుఃఖం వంటి అనుభూతులను వ్యక్తపరిచేందుకు కళను ఉపయోగించుకొనేవారు కాలం గడిచే కొద్ది మానవుడితో బాటు కళలు పరిణామం చెందాయి కళలలో భేదాలు స్పష్టమయ్యాయి

లలితకళలలో ప్రధానమైనవి శిల్పం, చిత్రలేఖనం, సాహిత్యం, సంగీతం, నాట్యం, నాటకం వీటినే ఫైన్ఆర్ట్స్ అంటారు ఇంగ్లీషులో కళ గురించి మనిషిలో తెలుసుకోవాలని, నేర్చుకోవాలని తపన ప్రారంభమైన నాటి నుంచీ అందుకోసం అధ్యయనం నిమిత్తం ఒక వేదిక అవసరమైన నేపధ్యంలో విద్యాలయాలు ఆరంభమయ్యాయి అవే నేడు ఫైన్ఆర్ట్స్ కాలేజీలుగా పిలువబడుతున్నాయి

ఫైన్ఆర్ట్స్ కాలేజీల్లో మనదేశంలో అత్యంతపురాతనమైనది జె జె స్కూల్ ఆఫ్ ఫైన్ఆర్ట్స్ ఇది 1857లో జెమ్షెడ్జీ జీబోయ్ స్కూల్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ పేరుతో బొంబాయిలో స్థాపించబడి (ముంబయి యూనివర్సిటీకి అనుబంధంగా) ఇప్పటికీ దేశంలో అత్యుత్తమ కళాశాలగా నడుపబడుచున్నది మన రాష్ట్రంలో అయితే హైదరాబాద్‌లో ప్రారంభించిన జె ఎన్ టి యు ప్రప్రధమ ఫైన్ ఆర్ట్స్ కాలేజి

మనరాష్ట్రంలోనే కాక దేశవ్యాప్తంగా డ్రాయింగ్, పెయింటింగ్, శిల్పం, గ్రాఫిక్స్, అప్లైడ్ ఆర్ట్, ఫొటోగ్రఫీలలో శిక్షణయిచ్చే కళాశాలల వివరాలు దిగువన ఇవ్వబడినవి ఆయా కోర్సులలో ప్రవేశానికి అర్హతలు బ్రాకెట్స్‌లో సూచించబడినవి సంబంధిత యూనివర్శిటీ నిర్వహించే ఆప్టిట్యూడ్ టెస్టు ఆధారంగా అభ్యర్థులను ఎంపికచేస్తారు బ్యాచిలర్ డిగ్రీ - బి ఎఫ్ ఎ (లేదా) బి ఎ (ఫైన్)

## ANDHRA PRADESH

1 Jawaharlal Nehru Technological University
Masab Tank, Mahaveer Marg
Hyderabad - 500 028
Course B F A (4 years)
(Eligibility Intermediate)
Subjects Painting, Applied Art, Sculpture, Photography

2 Sri Venkateswara College of Fine Arts
(Osmania University)
86, Madapur, Jubli Hills
Hyderabad - 500 033
Course B F A (5 years)
(Eligibility S S C)
Subjects Painting, Sculpture, Photography

3 Potti Sri Ramulu Telugu University
Lalita Kala Kshetram,
Public Gardens, Nampalle
Hyderabad - 500 004
Course B A (3 years)
Subjects Painting, Sculpture
(Eligibility Intermediate)

4 Andhra University
(Faculty of Fine Arts)
Near Out Gate Visakhapatnam - 530 003
Course B F A (4 years)
(Eligibility Intermediate)
Subjects Painting, Applied art, Sculpture

5 Nagarjuna University
Nagarjuna Nagar
Guntur - 522 510
Course B A (3 years)
Eligibility Intermediate
Subjects Painting, Sculpture

**P G Course M F A**

6 University of Hyderabad
Central University
P G Course M F AGolden Threosold
Hyderabad - 500 001
Course M F A (2 years)
Eligibility Degree in relavent Subject

**OTHER STATES**

1 Banaras Hindu University
Varanasi - 221 005

2 The Maharaja Sayajirao University of Baroda, Opp Drug Laboratory,
Shastri Bridge Road,
Fatehganj Vadodara - 39000 (BA (Fine Arts) (4 years)

3 University of Bombay, M G Road Fort, Bombay-400 032 (5 years)

4 University of Delhi
Delhi - 110 007
BA (Fine Arts) (4 years duration)

5 Dr Babasaheb Ambedkar Marathwada
University, Aurangabad - 431 004 (4 years)

6 Goa University
PO Santacruz, Taleigao Plateau, Goa - 403 203 (5 years)

7 Jamia Millia Islamia,
Mohammad Ali Jauhar Marg,
Jamia Nagar, New Delhi - 110 025 (4 years)

8 University of Jammu,
Babasaheb Ambedkar Road,
Jammu- 180 004 (3 years)

9 Karnataka University
Pavate Nagar, Dharwad - 580 003 (3 years)

10 University of Mysore,
Craw-fold Hall, Mysore - 570 005 (3 years)

11 Nagpur University
Ravindra Nath Tagore Marg,
Nagpur - 440 001 (4 years)

12 North Maharashtra University
Post Box No 80, NH No 6,
ITI Hostel, Jalgam - 425 001 (4 years)

13 Punjab University
Sector 14, Chandigarh - 160 014 (4 years)

14 University of Rajasthan
Gandhinagar, Jaipur - 302 004 (4 years)

15 Chitrakoot Gramodaya Vishwavidyalay
P O Nayagaon Dist
Santna - 485 331 (4 years)

16 Gauhati University
PO Gopinath, Bordoloi Nagar, Guwahati - 781 014

17 Kashi Vidyapith
Varanasi - 221 002 (4 years)

18 University of Kerala,
University Po, Thiruvananthapuram-695 034 (4 years)

19 University of Lucknow
Badshah Bagh, Lucknow - 226 007 (5 years)
Eligibility 10 year High School Certificate

20 University of Pune,
Ganeshkhind, Pune - 411 007 (6 semesters)

21 Utkal University
PO Vani Vihar, Bubaneswar - 751 004 BFAC (5 years duration)

22 Berhampur University
Bhanja Bihar, Berhampur-760 007 (5 years)

23 Bharathidasan University
Palkalai Perur, Tiruchirapalli-620 024
Integrated (5 years)

24 Indira Kala Sangit Vishwavidyalaya,
Khairagarh - 491 881 (5 years)

25 University of Madras
Centenary Buildings Chepauk, Triplicane Po,
Madras - 600 005 (3 years)

26 University of Rajasthan,
Gandhi Nagar, Jaipur - 302 004 (4 years)

27 Visva - Bharati,
PO Santiniketan - 731 235, B Fine (5 years)

28 University of Bombay
MG Road, Fort, Mumbai - 400 032 (5 years)

29 University of Mysore
Craw-ford Hall, Mysore - 570 005
BPA (Visual Arts) 5 years

Following Universities in India offer Fine Arts as a subject in Bachelor of Arts (BA) (3 years)

**OTHER STATES**

1 Gulbarga University
Jnana Ganga, Gulbarga-585 106

2 Gurukula Kangri Vishwavidyalaya,
PO Gurukula Kangri, Hardwar - 249 404

3 Maharshi Dayanand University
Rohtak - 124 001

4 Punjab University
Patiala - 147 002

5 SNDT Women's University
Inathibai Thackersey Road,
Bombay - 400 020

6 Utkal University
PO Vani Vihar, Bhubaneswar 751 004

7 Manipur University,
Canchipur, Imphal - 795 003

## P G COURSES - M F A OTHER STATES

1 Aligarh Muslim University
Aligarh - 202 002

2 Banaras Hindu University
Varanasi - 221 005

3 University of Bombay
MG Road Fort, Bombay - 400 032

4 University of Delhi
Delhi - 110 007

5 Jamia Millia Islamia
Mohammad Ali Jawhar Marg,
Jamia Nagar, New Delhi-110 025

6 Nagpur University
Ravindranath Tagore Marg,
Nagpur - 440 001

7 Karnataka University
Pavate Nagar, Dharwad-580 003

8 Visva - Bharati,
PO Santiniketan - 731 235 (M Fine)

9 Indira Kala Sangit Vishwavidyalaya,
Khairagarh - 491 881

## M A FINE ARTS OTHER STATES

1 University of Gorakhpur
Gorakhpur - 273 009

2 Gulbarga University
Jnana Ganga, Gulbarga-585 106

3 Guru Nanak Dev University
Amritsar - 143 005

4 Maharshi Dayanand University
Rohtak - 124 001

5 Punjab University
Sector 14, Chandigarh - 160 014

6 The Maharaja Sayajirao University
Baroda, Opp Drug Laboratory,
Shastri Bridge Road, Fatehganj,
Vadodara - 390 002 MA (Fine Arts)
Eligibility BA (Fine Arts)

7 Guru Nanak Dev University
Amristar - 143 005

## DIPLOMA COURSES

1 University of Lucknow
Badshah Bagh, Lucknow-226 007
Course Diploma in Fine Arts
Eligibility Matric or its equivalent examination

2 Tilak Maharashtra Vidyapeeth,
Vidyapeeth Bhavan, Gultekadi,
Pune - 411 037
Course Diploma in Fine Arts

3 Visva - Bharati,
PO Santiniketan - 731 235
Course Post diploma course in Fine Arts
Eligibility Matric or its equivalent examination

## CERTIFICATED COURSES

1 Jamia Millia Islamia
Mohammad Ali Jawhar Marg,
Jamia Nagar, New Delhi-110 025
Course Short - term course in Fine Arts

వి కృష్ణకిశోర్

# మాయాజాలం - మల్టీమీడియా

మానవజీవితంలో కంప్యూటర్ ఒకరకమైన విప్లవం తీసుకువస్తే కంప్యూటర్ రంగంలోనే విప్లవం తీసుకువస్తున్న అంశం 'మల్టీమీడియా" ఏ అంశానికయినా కొన్ని ప్రయోజనాలు ఉంటాయి అది దేనికోసం పనిచేస్తుందో వివరించగలం దానిని స్పష్టంగా నిర్వచించగలం స్పష్టంగా నిర్వచించలేనంతటి విస్తృత ప్రయోజనాలతో, రకరకాల అంశాలతో 'మల్టీమీడియా' శరవేగంతో అభివృద్ధి చెందుతోంది కళకు కంప్యూటర్ ద్వారా మెరుగుదిద్ది ఈ 'మల్టీమీడియా'తో ముద్రణ, వినోదం, అడ్వర్‌టైజింగ్ వంటిరంగాలలో సృష్టిస్తున్న అద్భుత దృశ్యాలు మాయాజాలాన్ని' తలపింపజేస్తున్నాయి

'మల్టీమీడియా' అంటే ఏమిటో మనం స్థూలంగా దానిపేరును బట్టే అర్థం చేసుకోవచ్చు కంప్యూటర్ ద్వారా టెక్ట్స్ లేదా ప్రింట్ మీడియా, గ్రాఫిక్స్, యానిమేషన్స్, వీడియో, ఆడియోల వంటి ఎన్నెన్నో విభిన్న క్షేత్రాల అద్భుత సమ్మేళనం 'మల్టీమీడియా" ఈ నిర్వచనాన్ని బట్టి "మల్టీమీడియా" ఎప్పటికప్పుడు నిరంతరంగా విస్తృతి చెందుతోందన్న విషయము మనకు అర్థమవుతుంది పైన పేర్కొన్న పబ్లిషింగ్, ఆడియో, వీడియో వంటి ఏ రంగంలో ఏ మార్పు చోటుచేసుకొన్నా, అది "మల్టీమీడియా"కు వ్యాపిస్తూ మరిన్ని సత్ఫలితాలను ఇస్తోంది 'మల్టీమీడియా" లో ప్రధానమైన విభాగాలు ఇవి



- టెక్ట్స్
- గ్రాఫిక్స్ లేదా ఇమేజస్
- యానిమేషన్
- వీడియో
- సౌండ్

వీటిని ఒక్కోదాన్ని కొంత విశదంగా చూద్దాం

**టెక్ట్స్** - అర్థసహితమైన పదాల కూర్పును టెక్ట్స్ అనవచ్చు సమాచారంలో కీలకమైనవి పదాలు పదాల కూర్పుతోనే మనం మన భావాలను ఎదుటివారికి సరిగ్గా, పూర్తిగా చేర్చగల్గుతున్నాము కేవలం టెక్ట్స్ కోసమే అయితే ప్రత్యేకంగా ఏ హార్డ్‌వేర్ అవసరం లేదు వర్డ్‌ప్రోసెసింగ్ ప్యాకేజి అయినా దీనికి సరిపోతుంది 'మల్టీమీడియా"లో టెక్ట్స్ కూడా ప్రధాన పాత్ర నిర్వహిస్తోంది

**ఇమేజస్** - ఇమేజస్ అంటే స్టిల్ పిక్చర్స్ అని అర్థం "మల్టీమీడియా" లో వీటివల్ల కొన్ని సమస్యలు ఉత్పన్నమయ్యే మాట వాస్తవం ఇమేజస్‌ను సరిగ్గా చూపటానికి బోలెడంత

డిజిటల్ ఇన్ఫర్మేషన్ అవసరమవుతోంది ఇమేజెస్‌ను సరిగా రెండర్ చేయటానికి రిజల్యూషన్ క్వాలిటీ బాగుండాలి కంప్యూటర్ రంగంలో కంప్యూటర్ తెరమీద కానవచ్చే డిస్‌ప్లేస్నీ వేలాది పిక్సిల్స్‌తో ఏర్పడి ఉంటాయని తెలిసిందే

**యానిమేషన్** - చాలా ప్రాథమిక స్థాయిపరిభాషలో చెప్పాలంటే - యానిమేషన్ అనేది ఒక పప్పెట్ (కీలుబొమ్మ) లేదా ఒక మోడల్ లేదా ఒక డ్రాయింగ్ ఇలస్ట్రేషన్ వంటి వాటి వరస క్రమంలోని కదలికలను నిర్ధారించే సిరీస్ ఫోటోగ్రాఫ్ అని చెప్పవచ్చు ఈ ఫిల్మ్‌ను గనుక వేగంగా ప్రొజెక్ట్ చేస్తే ఆ మోడల్ (లేదా పప్పెట్) కదులుతున్న ఫీలింఒగ్ ఏర్పడుతుంది వీడియోకు యానిమేషన్‌కు ప్రధానమైన వ్యత్యాసం ఒక్కటే భౌతిక ప్రపంచంలో సజీవంగా లేని వాటిని చూపేది యానిమేషన్ సజీవంగా ఉన్నవాటి కదలికలు చూపేది వీడియో

**వీడియో** - ఒక సంఘటనను ఒక మోషన్ ఫిల్మ్‌కెమెరా ద్వారా షూట్ చేయడమే వీడియోగ్రఫీ డిజిటల్ వీడియో అంటే వీడియోను కంప్యూటర్ హార్డ్‌డిస్క్ మీద కాప్చర్ చేయటం అనుకోవచ్చు అవసరాన్ని బట్టి దీనికి కంప్యూటర్ జనరేటెడ్ ఎఫెక్ట్స్‌ను జోడించవచ్చు ఇలా మార్పులు చేర్పులు చేసిన ఎడిటెడ్ వీడియోను టేప్ లేదా మరే ఇతర "మల్టీమీడియా" ప్రాజెక్ట్‌లోకి అనుసంధానించుకోవచ్చు

**సౌండ్** - శబ్దమనేది ప్రధానంగా ఓ శక్తిరూపం మనమాశక్తిని "మల్టీమీడియా"లో ఒక భాగంగా వాడుకోవడంతో దృశ్యశ్రవణ శక్తులు రెండూ మిళితమై "మల్టీమీడియా" ను పరిపుష్టం చేశాయి

**"మల్టీమీడియా" ప్రయోజనాలు**

అదీ ఇది అని లేకుండా "మల్టీమీడియా" తో సాధించగల ప్రయోజనాలు అనేకంగా ఉంటున్నాయి శాస్త్ర, సాంకేతిక, విద్యా, శిక్షణ, వినోద, వ్యాపార, మార్కెటింగ్ రంగాల్లో "మల్టీమీడియా" సమాచార ప్రసారానికి విశేషంగా తోడ్పడుతోంది నేడు "మల్టీమీడియా"లో శిక్షణ పొందటం అంటే రేపటి ఆధునాతన సాంకేతిక ప్రపంచ ఆధిపత్యానికి మెట్లెక్కడమే ననుకోవచ్చు "మల్టీమీడియా" రంగంలో నైపుణ్యం గల వారికి దేశ విదేశాల్లో విశేష ఉపాధి అవకాశాలు లభిస్తూనే ఉన్నాయి నిజానికి సరైన నైపుణ్యం గలవారి కొరత 'మల్టీమీడియా"లో చాలా అధికంగా ఉంది

ఇరవయ్యవ శతాబ్దం నూతన త్వానికి నాంది పలికింది అత్యంత శక్తివంతమైన సమాచార సాధనాలైన టెలివిజన్, కంప్యూటర్‌లు సరికొత్త విప్లవాన్ని సృష్టించి మానవాళి జీవన విధానంపై తమ ప్రభావాన్ని చూపుతున్నాయి కంప్యూటర్ల ద్వారా అనేక క్లిష్టమైన విధులు అతి సులభంగా జరుగుతున్నాయి కంప్యూటర్‌లలోని ఇంటర్ యాక్టివ్ పవర్, వీడియోలలోని కమ్యూనికేషన్ సామర్థ్యాలను మిళితం చేసి మల్టీమీడియాను రూపొందించడం జరిగింది టెక్స్ట్, గ్రాఫిక్స్, మ్యూజిక్, వాయిస్, యానిమేషన్, వీడియోల సమ్మేళనమే మల్టీమీడియా, నేటి సినిమాలలో టెలివిజన్‌లలో కనిపించే అనూహ్యమైన అద్భుతదృశ్యాల రూపకల్పన వెనుక మల్టీమీడియా దాదాపు అన్ని ముఖ్య వ్యాపార రంగాల్లోను ప్రవేశిస్తోంది దీని వల్ల మల్టీమీడియా రంగంలో ఉపాధి అవకాశాలు కూడా బాగా మెరుగవుతున్నాయి ఏయే రంగాల్లో ఉద్యోగాలు లభించే అవకాశం ఉందో పరిశీలిద్దాం

**ఎడ్వర్టయిజింగ్**

నిత్యజీవితంలో వివిధ టీవి ఛానళ్ళ ద్వారా కంటిచూపు మరల్చనీయకుండా అంతర్జాతీయ స్థాయిలో తయారవుతున్న అన్నిరకాల ప్రకటనల వెనుక మల్టీమీడియా స్పెషలిస్ట్‌ల సృజనాత్మకత దాగి ఉంది వినియోగదారులను ఆకర్షించే ప్రక్రియలో భాగంగా ఎన్నో రకాల స్పెషల్ ఎఫెక్ట్స్‌ను ఈ

ప్రకటనల్లో ఆకర్షణీయంగా చొప్పించగలుగుతున్నారు ఆర్ట్‌పట్ల ఆసక్తి ఉన్నవారు కళాత్మకంగా, ఆకర్షణీయంగా దృశ్యాల రూపకల్పన (జరిరీతిబిజిరిరీలి) చేయగల వారు "మల్టీమీడియా" నేర్చుకోవడం వలన ఎడ్వర్టయిజింగ్ రంగంలో ప్రవేశించి Artists, Visualisers, Creative Support Professionals Studio Managers Designers, Art Consultants గా స్థిరపడగలిగితే అవకాశాలు లభిస్తున్నాయి

**ప్రింటింగ్ – పబ్లిషింగ్**

ముద్రణ – ప్రచురణ రంగాల రూపురేఖల్ని మల్టీమీడియా టెక్నాలజీ మార్చేస్తోంది కోరినరీతిలో దేన్ని అయినా ఆకర్షణీయంగా ప్రచురించుకోవడానికి ఇపుడు మార్గం సుగమమయ్యింది డి టి పి , సిడిరామ్, ఇంటర్‌నెట్‌లు, ప్రచురణ ముద్రణ – పరిశ్రమకు కొత్త రూపాన్నిస్తున్నాయి మల్టీమీడియా ముద్రణ – ప్రచురణల రంగంలో శిక్షణ పొందిన వారు ప్రతిభగల వారైతే ఉపాధికి కొరత లేదు సైన్స్‌ఫిక్షన్ నుంచి చిన్నపిల్లల సాహిత్యం దాకా కాల్పనిక సాహిత్యం నుంచి సైకలాజికల్ ఫిక్షన్ దాకా వివిధ అంశాలపై తయారుచేసే ప్రచురణలను కావలసిన విధంగా రూపొందించవచ్చు మల్టీమీడియా నేర్చుకున్న వారికి ఈ రంగంలో మల్టీమీడియా ఆథర్స్‌గా, స్క్రిప్ట్‌రైటర్స్‌గా, డిటిపి స్పెషలిస్టులుగా, క్రియేటివ్ పబ్లిషింగ్ ప్రొఫెషనల్స్‌గా, గ్రాఫిక్ ఆర్టిస్టులుగా ఉపాధి లభించే అవకాశాలు ఉన్నాయి

**టెలివిజన్**

ప్రపంచంలో ఏ మూలనైనా ఎక్కడ ఏమి జరుగుతుందో తెలుసుకునేందుకు వీలుకల్పిస్తూ శాటిలైట్ ఛానల్స్ ఎన్నోకరాల కార్యక్రమాలను ప్రసారం చేస్తున్నాయి టీవీ కార్యక్రమాల్లో దాదాపు అన్నింటా మల్టీమీడియా పాత్ర ప్రభలంగా ఉంటోంది వీడియో, రికార్డింగ్, సౌండ్, తదితర అంశాల్లో ఆసక్తి ఉన్నవారు టీవి పరిశ్రమల్లో ఉద్యోగాల కోసం ప్రయత్నించవచ్చు అయితే ఈ అంశాల్లో మల్టీమీడియా శిక్షణ కలిగి ఉండటం ప్రధాన అర్హతయింది మల్టీమీడియా ప్రక్రియలతో ఆడియో, వీడియో అంశాల్లో ప్రతిభ కనబరిస్తే రికార్డింగ్, ఎడిటింగ్, డబ్బింగ్, స్పెషల్ ఎఫెక్ట్స్ తదితర అంశాల్లోను ఆకర్షణీయంగా కార్యక్రమాల రూపకల్పన చేసే అవకాశం ఉంది టీవి పరిశ్రమలో ప్రస్తుతం విజువల్‌ఎఫెక్ట్స్ డిజైనర్స్ నాన్‌లీనియర్ ఎడిటర్, మిక్సర్స్, ఆడియో వీడియో స్పెషలిస్టులు టెలికాస్ట్ ప్రొఫెషనల్స్‌గా పనిచేసేందుకు అవకాశాలు లభిస్తున్నాయి

**ఫిల్మ్ మేకింగ్**

చలనచిత్ర పరిశ్రమలోనూ మల్టీమీడియా తనదైన ప్రత్యేకతను సొంతం చేసుకుందంటే అందుక్కారణం సృజనాత్మకత, ప్రతిభ గల మల్టీమీడియా – ప్రొఫెషనల్స్ మాత్రమే దృశ్యాన్నే కాదు, శబ్దాన్నీ చూపరుల/శ్రోతల గుండెల్లోకి దూసుకుపోయేలా రూపొందించే అవకాశం మల్టీమీడియా వల్లే సాధ్యం దాదాపు ఈ మధ్యన వస్తున్న అన్ని భాషల సిన్మాల్లోను మల్టీమీడియా టెక్నాలజీ వినియోగం ఎక్కువవుతోంది స్పెషల్ ఎఫెక్ట్‌లు, ద్విపాత్రాభినయాల్ని మల్టీమీడియా నల్లేరు మీద నడకలా మార్చి వేసింది ఈ విధమైన స్పెషల్ ఎఫెక్టులే కొన్ని చిత్రాల ఘనవిజయానికి ప్రధానకారణం అంటే అతిశయోక్తి కాదు చలనచిత్రరంగంలో కెరీర్‌ను పలురకాలుగా కొనసాగించవచ్చు స్క్రిప్ట్ రైటర్స్‌గాను, యానిమేటర్స్‌గాను, విజువల్ ఎఫెక్ట్స్ ప్రొఫెషనల్స్‌గానూ, కార్టూనిస్టులుగానూ, ఎడిటర్స్‌గానూ, సెట్–కాస్ట్యూమ్స్ డిజైనర్స్‌గానూ, డిజిటల్ వీడియో ఎడిటర్స్‌గానూ, 3డి యానిమేటర్స్, మోడలర్స్‌గానూ మల్టీమీడియా శిక్షణపొందిన వారు స్థిరపడవచ్చు

**విద్యారంగం**

విద్యార్థులకు సులభంగా అర్థమయ్యే

విధంగాను, గుర్తుండిపోయే విధంగాను వివిధ అంశాల్లో మల్టీమీడియా సాయంతో ప్రత్యేకంగా ప్రతిభావంతంగా రూపకల్పన చేసే అవకాశం ఉంది సంక్లిష్టమైన అంశాలను సులభంగా కళ్ళకుకట్టినట్టుగా తయారుచేసి ప్రదర్శించి బోధనచేయొచ్చు లేదా సొంతంగా మీట నొక్కితే సమాచారమంతా స్క్రీన్‌పై దర్శనమిచ్చేలా ఏర్పాటు చేయవచ్చు వాటికి సి డి లు ఇంటర్నెట్ సైట్స్ ద్వారా రంగురంగుల చిత్రాలతో శబ్దం, ఆకృతులతోను కావలసిన అంశాలను రూపొందించడంలోను శిక్షణ పొందవచ్చు

**ఇంటర్నెట్**

ఇంటర్నెట్ – ప్రపంచాన్నంతా అన్ని ప్రాంతాలతో అనుసంధానం చేస్తున్న సాంకేతిక విప్లవం ఇంటర్‌నెట్ సమాచారం పంపటంలో వెబ్‌పేజి డిజైనింగ్ ముఖ్యపాత్ర పోషిస్తోంది మనం తయారు చేసిన వెబ్‌సైట్ ద్వారా మన ప్రొడక్ట్స్‌ను వివిధ దేశాల్లో ప్రచారంచేసేందుకు ఆకర్షణీయమైన వెబ్‌సైట్ అవసరం అటువంటి వెబ్‌సైట్స్ తయారు చేయడానికి వివిధ విభాగాల్లో నైపుణ్యం పొందిన ప్రొఫెషనల్స్ అవసరం ఎంతైనా ఉంది వెబ్ మేనేజర్లు, సైట్ మేనేజర్లు గ్రాఫిక్ డిజైనర్లు, యానిమేటర్లు ఆడియో విజువల్ స్పెషలిస్టులు, వెబ్‌పేజ్ డిజైనర్ల ఆవశ్యకత ఆధునిక వెబ్‌సైట్‌లో ఉంది విస్తృతమవుతున్న ఇంటర్నెట్ అవకాశాల దృష్ట్యా మల్టీమీడియా సాయంతో వెబ్‌సైట్స్‌ను ఆకర్షణీయంగా చేయగల ఈ నిపుణులకు అద్భుతమైన ఉపాధి అవకాశాలు అందుబాటులో ఉన్నాయి

**ఇతర అవకాశాలు**

పై అవకాశాలే కాకుండా డిజైనింగ్‌లో నవ్యతకు, సృనాత్మకతకు ప్రాధాన్యతనిచ్చే ఫేషన్ డిజైనింగ్, ఇంటీరియర్ డిజైనింగ్, రంగాల్లోనూవస్త్రోత్పత్తికి సంబంధించిన తయారీలోనూ కొత్త పుంతల్ని తొక్కుతూ తనకు సంబంధంలేని రంగమేలేదని నిరూపిస్తోంది మల్టీమీడియా ఇంతేకాకుండా మల్టీమీడియా గేమ్స్, ఎడ్వర్‌టైజ్‌మెంట్ టైటిల్స్, ఎన్‌సైక్లోపీడియాలు మరియు కార్పొరేట్ ప్రెజెంటేషన్స్‌లోనూ విరివిగా వాడబడుతున్న మల్టీమీడియాలో సృజనాత్మకతతో కూడిన నైపుణ్యం సంపాదించుకున్నట్లయితే భవిష్యత్తుకు బంగారుబాటలు వేసుకున్నట్లే రాబోయే సంవత్సరాల్లో వారికి ఉండబోయే డిమాండుకు కొదువలేదని నిస్సందేహంగా చెప్పవచ్చు నైపుణ్యం గల మల్టీమీడియా స్పెషలిస్టులకు చాలా ఆకర్షణీయమైన పేకేజీలు లభిస్తున్నాయి కొన్ని సంస్థలలో అయితే జీతభత్యాలతో బాటు వాళ్లు చేసిన పనికి లభించే ఫీజు మీద కమీషన్ కూడా లభిస్తుంది ఆ కోణంలోంచి చూస్తే వాళ్ళ ఆదాయానికి హద్దంటూ లేదన్నది వాస్తవం

**మల్టీమీడియాలో శిక్షణ**

అసలు మల్టీమీడియా నేర్చుకోవడంలో మీ ఆశయం ఏమిటనే దానిని బట్టి మల్టీమీడియాలో శిక్షణ పొందవలసి ఉంటుంది క్లిష్టతరమైన Higher End ప్యాకేజీలు నేర్చుకోవాలంటే మాత్రం ప్రొఫెషనల్ ట్రైనింగ్ తప్పనిసరి అక్కడ ట్రైనింగ్ తీసుకొంటే మీరు మీ అంతటమీరే యానిమేషన్, వీడియోలలో మల్టీమీడియా ప్రోగ్రాంలను తయారు చేయగలుగుతారు వీటికి కూడా మన రాష్ట్రంలో ఎన్నో ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్స్ ఉన్నాయి APTECH వారి 'ARENA', జడ్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ కంప్యూటర్ యానిమేషన్ (ZICA), Yodhan Edutainment Services (YES) వంటి సంస్థలు హైదరాబాద్‌లో, EDIT, ARENA, MULTI-TECH వంటి సంస్థలు విజయవాడ లోనూ, విశాఖపట్నంలో సాయికృప స్కూల్ వంటి అనేక సంస్థలు మల్టీమీడియాలో శిక్షణనిస్తు న్నాయి ట్రైనింగ్ పొందేవారు ఆయా ఇన్‌స్టిట్యూట్స్‌లలో ఫాకల్టీ, ఫీజులు తదితర విషయాలను గూర్చి క్షుణ్ణంగా తెలుసుకొని చేరినట్లయితే కోర్సును విజయవంతంగా పూర్తి చేయగల్గుతారు ■

శింగంపల్లి సత్యనారాయణ

# భారతీయ శిల్పకళ

శిలకు రూపకల్పనే శిల్పం అది ఒక సౌందర్యరాశి శిలను తీర్చిదిద్దేవాడే శిల్పి ప్రపంచంలో ప్రతి శిల్పం ఒక కళాపుష్పం ప్రతి శిల్పి ఒక కళాద్రష్ట శిల్పోపాసకులు శిల్పాలు కప్పుకున్న మేలి ముసుగును తమ ఉలులతో తొలగించి సౌందర్య రహస్యాన్ని రసహృదయాలకు చూపిస్తారు అందుకే మానవ మేధస్సుకు కళాత్మక పరాకాష్ఠే శిల్పం

క్రీస్తుకు పూర్వమే, భారత్, ఈజిప్ట్, గ్రీస్, రోమ్, హిబ్రూఫ్రొనీషియా, బాబిలోనియా, ఆస్సేరియా, పర్శ్య, క్రీట్, చైనా దేశాలలోని శిల్పులు, శిలలను, లోహాలను, కర్రలను, దంతాలను, మట్టి, గాజు, పింగాణీ, లక్కలను ఉపయోగించి సౌందర్యవంతమైన విగ్రహాలను తయారుచేసేవారు నేడు రాయే కాదు, మంచుముక్కలు, ఇసుక మొదలు కనిపించే ప్రతి వస్తువుతో శిల్పాలు తయారుచేస్తూ జడ పదార్ధాలను సైతం కదపగల రస జగత్తును నిర్మాణం చేస్తున్నారు

భారతీయ శిల్పకళ చాలా పురాతనమైనది హరప్పా మొహంజదారోలోని ప్రాచీన అవశేషాలు అజంతా, ఎల్లోరా, అమరావతి, నాగార్జునకొండ, సారనాధ్, సాంచి, కోణార్క్, హాలేబీడు, బేలూరు మొదలైనచోట్ల భారతీయ శిల్పకళా వైభవం కన్పిస్తుంది భారతీయ గ్రీక్ శిల్పకళా సంగమ ఫలితమే గాంధార శిల్ప అవిర్భావం 1వ శతాబ్దంలో బౌద్ధ శిల్పకళ చాలా అభివృద్ధి చెందింది నాగార్జునకొండ నకల కళావైభవంతో శోభిల్లేదని ఐదు అంతస్థులతో, 500 గదులలో సువిశాలమై వుండేదంటూ ఒక చైనా యాత్రికుడు దాని వాస్తు వైభవాన్ని కొనియాడాడు మొదటి అంతస్తు సింహరూపంలోను, రెండవ అంతస్తు ఏనుగు రూపంలోను, మూడవది గుర్రం, నాల్గవది ఎద్దు, ఐదవది పావురం రూపాంలోను నిర్మించారు

పల్లవుల కాలంలో కంచి, మహాబలిపురం, కాకతీయుల కాలంలో రామప్ప, వేయిస్థంబాల దేవాలయాలు, విజయనగర రాజుల కాలంలో హంపి, విజయనగరం, లేపాక్షి, తిరుపతి, శ్రీకాళహస్తి, హోయసల రాజుల కాలంనాటి హళేబీడు బేలూరు వంటి దేవాలయాలలోని శిల్పాలు శిల్పుల కళానైపుణ్యానికి ప్రతీకలు అంతేకాదు బేలూరులో 40 అడుగుల దీపస్థంభం పునాది లేకుండా నేలపైనే నిలవడం హంపీలో స్థంభాలు మ్రోయిస్తే సరిగమలు వినిపించడం, ఎక్కడో వున్న గోపురం ఒక గోడపై కన్పించడం, నాగాలాపురంలో సూర్యరశ్మి గర్భగుడిలోని విగ్రహంపై మూడు దినాలు మూడుచోట్ల పడటం వంటి వాస్తు, శిల్పకళా వైచిత్రి మనకాశ్చర్యాన్ని కల్గిస్తుంది

భారతీయులు విశ్వకర్మను తమ ప్రధమ శిల్పాచార్యునిగా ఆరాధిస్తారు రకరకాల మూర్తుత లక్షణాలను వివరించడానికి విశ్వకర్మ ప్రోక్తములేకాక అతని పుత్రులయిన త్వష్ట, దైవజ్ఞ (శిల్పి) విశ్వజ్ఞ అనే వారి రచనలు కూడా ప్రమాణంగా స్వీకరించారు క్రీ పూ మూడవ శతాబ్దం వాడయిన మానసారఋషిచే



వ్రాయబడిన మానసారమనే ఆగమశాస్త్రంలో దేవాలయం, గ్రామం మొదలైనవి నిర్మాణం చేసే విధానాలను 70 అధ్యాయాలలో వ్రాశారు ఆలయాలలో ప్రధానంగా ఆరాధించేది ప్రతిమ కాబట్టి అది సౌందర్య, భావ, లాలిత్య ప్రభావ భరితాలై ఉండాలంటారు ఆగమాలలో భూపరీక్ష, మానవిక్సాదన, స్థలవధక, హార్మ్య, ప్రసాద నిర్మాణ పద్ధతులను వివరించారు "అస్మాపి యాతిదేవత్వం శిల్పిభిః సుప్రతిష్ఠతః" అంటే రాయియైన శిల్పులచే చక్కగా ప్రతిష్టించబడి దైవత్వం పొందుతుంది శబ్దం, రూపం, శక్తి దేవాలయాలలో నిక్షిప్తమై వుంటాయి మట్టి కర్ర, శిలలతో చేసే విగ్రహాలకంటే రాగి అంతకంటే వెండి దానికన్న బంగారం, బంగారం కంటె రత్నమయ విగ్రహాలు వీటికన్నా ఆరాధకుని భక్తి చాలా ప్రధానమైనవి

అన్నివైపులా కన్పించేవి పూర్ణవిగ్రహాలు, ముందుభాగం మాత్రమే కన్పించేవి అర్ధబింబాలు శిలా ఫలకం మీద గీతల రూపంలో కన్పించేవి అబాసబింబాలు అని శిల్పాలు మూడు రకాలు ప్రతిమా లక్షణాలలో విగ్రహ ప్రమాణాలను ఉన్మానము, పరిమాణము, ఉపమానము, లంభమానమని చాలారకాలు వివరించారు విగ్రహాలు కొలవడానికి మానాంగుళము, మాత్రాంగుళము, దేహాలబ్ధాంగుళం (తలప్రమాణం), మావాంగుళం (వడ్లగింజ ప్రమాణం)గా నిర్ణయించారు శిరస్సును చెక్కేటప్పుడు చాలా జాగ్రత్త వహిస్తారు

"సర్వస్య గాత్రాస్య శిరః ప్రధానం సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" నేత్రాలు నిర్మించాకే శిల్పానికి జీవశక్తి వస్తుంది

మూలవిరాట్ 35 మి మి నెగిటివ్ అయితే దాని ఎన్‌లార్జ్‌మెంట్ దేవాలయ గోపురం అందులో మానవ సమాజంలోని ధర్మ, అర్థ, కామమోక్షాలనే పురుషార్థాలను వివిధ భంగిమల శిల్పాల ద్వారా భక్తుత కందిస్తున్నారు శిల్పులు

భారతీయ కళలను, సంస్కృతిని విశ్వవ్యాపితం చేస్తూ దాదాపు 550 వ్యాసాలు, గ్రంథాల రూపంలో ప్రచురించారు ఆనందకుమార స్వామి ఆయన భారతీయ కళల గురించి చెబుతూ " The aims of Indian Art are not for one time only, the synthesis of Indian thought is one whole (compound) composed equally for present, past future" అని అన్నారు ■

కళాసాగర్

# కళ - కామర్స్ ...

**మ**నింట్లో ఎవరైనా పిల్లలు బొమ్మలు గీస్తుంటే, ఎందుకురా అవి తిండి పెడతాయా, చక్కగా చదువుకుంటే మంచి ఉద్యోగం సంపాదించవచ్చు అని తిడుతూ ఉంటారు మన పెద్దవాళ్ళు పిల్లలలో ఉండే సృజనాత్మకతను ప్రోత్సహించే వారూ ఉన్నారనుకోండి

అలాంటివారు బహు అరుదని చెప్పవచ్చు ముఖ్యంగా పెద్దలలో ఈ అభిప్రాయం కలగడానికి కారణం బొమ్మలు గీయడం వల్ల ప్రయోజనం లేదని, ధనార్జనకు, ఉద్యోగాలకు ఈ విద్య పనికిరాదని వాళ్ళలో ఒక అపోహ ఉండడమే పూర్వం రోజుల్లో కొంతవరకు అది నిజం కావచ్చు గాని నేడు చిత్రకారులు (ఆర్టిస్టులు) వివిధ రంగాలలో తమ ప్రతిభకు తగిన గుర్తింపును, ప్రతిఫలాన్ని పొందుతున్నారు 'చిత్రకళ' వృత్తి విద్యగా గుర్తింప బడింది బ్యానర్ ఆర్టిస్టుల దగ్గర నుండి గ్రాఫిక్ ఆర్టిస్టుల వరకూ అందరూ చిత్రకారులే వీరు చిత్రకళను స్వయం కృషితోనో, లేదా ఫైన్‌ఆర్ట్స్ కాలేజీల్లోనో అభ్యసించినవారే



అభివృద్ధి చెందుతున్న సాంకేతికత కళను కూడా తనలో ఇముడ్చుకుంది వ్యాపార రంగానికి ప్రాణమైన ప్రకటన రూపొందాలంటే కళాకారుడు కుంచెను కదపాల్సిందే నిత్యం మనం ఉపయోగించే కరెన్సీ నోట్ల నుండి కంప్యూటర్ ప్యాకేజీల మూల ప్రతులతయారీ వరకు చిత్రకారులే ప్రముఖమైన పాత్ర) నిర్వహిస్తున్నారు మానవవనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖకు చెందిన సాంస్కృతిక విభాగం కళలను అభివృద్ధి పరచడానికి, వ్యాప్తికీ, కళాసంరక్షణకూ ఎన్నో పథకాలను రూపొందించి అమలు పరుస్తోంది దాదాపు 99' దేశాలతో మనకు సాంస్కృతిక ఒప్పందాలున్నాయంటే కళలకు ప్రభుత్వం ఇస్తున్న ప్రాముఖ్యం ఏపాటిదో అర్థమవుతుంది

కళలకు విస్తృతమైన ఉపాధి అవకాశాలున్నాయంటే అతిశయోక్తి అనిపించటం సహజమే! కళద్వారా పొందగల ప్రయోజనం విభిన్న, వినూత్న రూపాలను సంతరించుకున్నా సంగీతం,సాహిత్యం, నాట్యం, చిత్రకళ, శిల్పకళ మొదలైనవాటిని లలిత

కళలుగా చెప్పుకోవచ్చు పూర్వం రోజుల్లో లలిత కళలను అభ్యసించాలంటే ప్రత్యేకంగా కళాశాలలుండేవి కాదు ఆయా కళలలో నిపుణులవద్ద శిష్యరికం చేసి కళను అభ్యసించేవారు ప్రపంచ ప్రఖ్యాత శిల్పి, చిత్రకారుడు లియోనార్డోడావిన్సీ, రాజారవివర్మ, ఎం ఎఫ్ హుస్సేన్‌లు ఈ విధంగా కళాభ్యాసం చేసినవారే

నేడు విశ్వవ్యాప్తంగా అనేక ఫైన్ ఆర్ట్స్ కాలేజీలు స్థాపించబడ్డాయి కళాభిరుచికల విద్యార్థులెందరో ఈ కాలేజీల్లో చేరి తమకళకు మరిన్ని మెరుగులు దిద్దుకుంటున్నారు ప్రస్తుతం ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే ఐదు ఫైన్ ఆర్ట్స్ కాలేజీలు ఉన్నాయంటే చిత్రకళ ఆవశ్యకత ఏమిటో అర్థం చేసుకోవచ్చు భారత ప్రభుత్వానికి చెందిన లలితకళా అకాడమీలు ఔత్సాహికులైన చిత్రకారుల చిత్రకళాప్రదర్శనలు నిర్వహించి వారికి గుర్తింపును, ఆర్థిక పరిపుష్టిని కల్పిస్తున్నారు

**సైన్‌బోర్డ్ ఆర్టిస్టులు** బొమ్మలు గీయగలవారికి, పెయింటింగ్ చేయగలవారికి అనేక జీవనాధారాలున్నాయి ఈ అవకాశాలు మున్ముందు ఇంకా పెరిగే పరిస్థితి కూడా ఉంది షాపులకు బోర్డులు వ్రాసేవారు ప్రతిపట్టణంలోనూ ఉంటారు అక్షరాలను అందంగా వ్రాయగలిగి, చిన్నచిన్న బొమ్మలు గీయగల్గితే చాలు ఈ పని చేయవచ్చు వీరిని సైన్‌బోర్డు ఆర్టిస్టులంటారు వీరు రేకు బోర్డుల మీద, గోడల మీద, హోర్డింగ్‌ల మీద, క్లాత్ మీద, చెక్కలమీద, అద్దాలపైన అందంగా పెయింట్ చేస్తూ డబ్బులు సంపాదిస్తుంటారు వీరు ఎక్కువగా వార్నిష్ పెయింట్లు, ఎనామిల్ పెయింట్లను ఉపయోగిస్తారు పెద్దగా విద్యార్హతలు ఏమీ లేకపోయినా, సృజనాత్మకత ఆత్మవిశ్వాసం కలవారు ఈ రంగంలో రాణించవచ్చు

**బానర్ ఆర్టిస్టులు** సినిమా థియేటర్ల వద్ద సినిమా హీరోల బొమ్మలను పెద్దవిగా చిత్రించి ప్రదర్శింస్తుంటారు వీటినే కటౌట్లు అంటారు వీటిని తయారు చేసే ఆర్టిస్టులను కటౌట్ ఆర్టిస్టులు (లేదా) బ్యానర్ ఆర్టిస్టులంటారు సినీ నటుల ఫొటోలను రంగులలో చిత్రించడానికి చాలా నేర్పు, ఓర్పు కావాలి కాని వీరిని చిత్రకారులుగా ఇప్పటికీ కొందరు గుర్తించరు ప్రముఖ చిత్రకారుడు ఎం ఎఫ్ హుస్సేన్ ఆరంభంలో ఇలాంటి చిత్రాలు చిత్రించినవారే వీరు చిత్రించవలసిన బారీ చిత్రాన్ని కొన్ని ముక్కలుగా విభజించి పెయింటింగ్ పూర్తయిన తర్వాత పూర్తి చిత్రంగా జాయింట్ చేయడం వీరి ప్రత్యేకత వీరు ముంబయి, చెన్నై, హైదరాబాద్, విజయవాడ వంటి నగరాలకే పరిమితమై ఉండి సినిమా డిస్ట్రిబ్యూటర్లకు, ప్రొడ్యూసర్లకు అందుబాటులో ఉండి పనిచేస్తుంటారు ఎన్నికలలో రాజకీయ పార్టీలకు కూడా వీరు ప్రచార సామగ్రిని తయారుచేస్తారు వీరు ప్లయివుడ్ పైగానీ, క్లాత్‌పైగానీ, ఆయిల్‌కలర్స్‌తో చిత్రాలను చిత్రిస్తారు

**పత్రికలు** నేడు ఆర్టిస్టులను అధిక సంఖ్యలో ఉపయోగించుకోవడంలో పత్రికలదే ప్రథమ స్థానం అనవచ్చు పత్రికలన్నిటిలోనూ ఆర్టిస్టులుంటారు లేఅవుటింగ్, పేజ్‌మేకప్, కలర్ సెపరేషన్, ఇలస్ట్రేషన్లు, కార్టూన్లు, అడ్వర్‌టైజ్‌మెంట్లు ఒకటేమిటి రోజూ మనం చదువుతున్న పత్రికలలో ప్రతీపేజీలోనూ ఎంతోమంది ఆర్టిస్టుల పనితనం ఉంటుంది ముఖ్యంగా వారపత్రికలలో వచ్చే సీరియల్స్‌కు చిత్రకారులు వేసే ఇలస్ట్రేషన్స్‌కు మంచి ఆదరణ ఉంటుంది

దిన పత్రికలన్నిటిలోనూ కార్టూనిస్టులుంటారు రాజకీయ సాంఘిక అంశాల మీద కార్టూన్‌లను రోజూ గీస్తూంటారు కేవలం వీరి కార్టూన్‌ల కోసమే

పత్రిక చూసే వారున్నారంటే దీనికిగల ఆదరణ ఏమిటో అర్థం చేసుకోవచ్చు ఆర్ కె లక్ష్మణ్, బాపు, శ్రీధర్, మోహన్, టి వీ, శంకర్‌లాంటి వారంతా యీ రకం కార్టూనిస్టులే వీరిలో ఫ్రీలాన్స్ కార్టూనిస్టులు కూడా ఉంటారు వీరు ఇతర వృత్తులలో ఉంటూ తీరిక వేళలలో కార్టూన్‌లు చిత్రించి పత్రికలకు పంపిస్తూంటారు ప్రింటయిన కార్టూన్లకు పారితోషకం వస్తుంది కార్టూనిస్టుగా పేరూవస్తుంది ఇలాంటి వారిలో జయదేవ్, సత్యమూర్తి, రాగతిపండరి, భగవాన్, బాబూ ముఖ్యులు

**డ్రాయింగ్ టీచర్స్** ప్రతీ పాఠశాలలోనూ కొన్ని ప్రయివేటు పాఠశాలల్లోనూ చిత్రకళను విద్యార్థులకు నేర్పించేందుకు వారిలో సృజనాత్మకతను ప్రోత్సహించేందుకు డ్రాయింగ్ టీచర్లను ప్రభుత్వం లేదా యాజమాన్యం నియమిస్తుంది అయితే మనరాష్ట్ర ప్రభుత్వం డ్రాయింగ్ టీచర్ల నియామకం తాత్కాలికంగా నిలిపివేసింది నవోదయ విద్యాలయాల్లోనూ గురుకుల పాఠశాలల్లోనూ డ్రాయింగ్ టీచర్లను నియమిస్తున్నారు వీరు ఫైన్ ఆర్ట్స్‌లో డిగ్రీ కలిగి ఉండాలి వీరికి ఇతర టీచర్లలానే మంచి జీతాలుంటాయి

**పోట్రయిట్ ఆర్టిస్టులు** (రూపచిత్రణ) పూర్వం రోజుల్లో రాజాస్థానంలో చిత్రకారులుండేవారు వీరు రాజులను, రాణులను, ఇంకా వారి కుటుంబ సభ్యుల ఫోటోలు చిత్రించి రాజువారి మెప్పుపొంది జీవనాన్ని సాగించేవారు ఫోటోగ్రఫీ రాక ముందు పోట్రయిట్ ఆర్టిస్టులకు మంచి గుర్తింపు, ఆదరణ ఉండేది అయితే ప్రస్తుతం ఫోటోగ్రఫీ రాజ్యమేలుతుంది అయినా పోట్రయిట్ ఆర్టిస్టులకు ఉండే స్థానం వారికుంది ఆ రోజుల్లో ఎవరి చిత్రాన్ని చిత్రించాలో వారిని ఎదురుగా కూర్చుండ బెట్టుకుని చిత్రాన్ని చిత్రించేవారు నేడు ఫోటోగ్రఫీ వచ్చినప్పటికీ పెద్దసైజులో ప్రింట్ రాదు కనుక పరిమిత సైజు తర్వాత ఆర్టిస్టులు వర్కుచేయక తప్పడం లేదు కాబట్టి ఈనాటికి పోట్రయిట్ పెయింటర్ల అవసరం ఉంది

**ఫ్రీలాన్స్ ఆర్టిస్టులు** వీరు నగరాలకే పరిమితమై ఎక్కువగా ప్రింట్ మీడియాకి సంబంధించిన పనులు చేస్తూంటారు వీరిని గ్రాఫిక్ ఆర్టిస్టులనికూడా అంటారు ఇంతకు ముందు అడ్వర్‌టైజ్‌మెంట్ డిజైన్లు, కార్టూన్‌లు (ప్యాకేజింగ్ బాక్స్ డిజైన్లు) ట్రేడ్ మార్కులు, ఎంబ్లమ్‌లు, ప్రచారానికి సంబంధించిన పోస్టర్‌లు, పుస్తకాలకు, నవలకు ముఖచిత్రాలు, పాఠ్యపుస్తకాలకు బొమ్మలు డ్రాయింగ్



పేపరుపై రంగులలో చిత్రాలను గీచేవారు అయితే ప్రస్తుతం చిత్రకళలో కంప్యూటర్ ప్రవేశించడంతో ఈ రంగం సమూలంగా మారిపోయింది ప్రస్తుతం కుంచెలు, రంగులు పక్కన పెట్టి మౌస్ చేతపట్టి కంప్యూటర్‌తోనే పైన పేర్కొన్న వివిధ రకాలైన డ్రాయింగులను సృష్టిస్తున్నారు కంప్యూటరు ప్రవేశంతో ఈ రంగంలో విప్లవాత్మకమైన మార్పు వచ్చిందనడంలో సందేహంలేదు డిజిటల్ డిజైనింగ్‌లో నూతన పద్ధతులతో డిజైలను చిత్రాలను వేగంగా మరింత ఆకర్షణీయంగా తయారు చేస్తున్నారు ఈనాటి చిత్రకారులు అయితే కంప్యూటర్‌తో చిత్రాలను గీయడం అంత సులభమేమి కాదు దీనికి చాలా కృషి

అవసరం ఇప్పటికీ కొన్ని చిత్రాలను తొలుత పేపరుపై చిత్రించి, స్కేనరుద్వారా కంప్యూటర్‌లోనికి తీసుకుని తర్వాత రంగులు నింపుతారు కంప్యూటర్ల ప్రవేశంతో ఈరంగంలో చిత్రకళలో ప్రవేశం లేనివారు సయితం ఆర్టిస్టులుగా చెలామణి అయినప్పటికీ వారి డిజైన్లలో సృజనాత్మకత, కలర్ హార్మనీ తదితర అంశాలలో వారి నైపుణ్యాన్ని ప్రదర్శించలేక పోతున్నారు

సినీ ఆర్ట్ డైరెక్టర్స్ చలనచిత్ర నిర్మాణంలో దర్శకుని ఊహలకనుగుణంగా సెట్స్ నిర్మించి, కథకనుగుణమైన వాతావరణాన్ని పరిసరాల్ని సృష్టిస్తాడు కళాదర్శకుడు ముఖ్యంగా పౌరాణిక, జానపద చిత్రాల నిర్మాణంలో చాలా ప్రముఖమైన పాత్ర కళాదర్శకునిది ఈ రంగంలో పనిచేసేవారికి స్కెచ్చింగ్, పెయింటింగ్, ఆర్కిటెక్చర్, శిల్పకళ తదితర అంశాలలో ప్రవేశం ఉండాలి తోటతరణి, సాబూసరిల్, శ్రీనివాసరాజు మొదలైనవారు పేరొందిన ఆర్ట్ డైరక్టర్స్

**యానిమేషన్ మరియు గ్రాఫిక్ ఆర్టిస్టులు** ఈ విధానంలో ఊహలకు రెక్కలు తొడగవచ్చు ఆలోచనలకు అందమైన రూపం కల్పించవచ్చు లేనిది ఉన్నట్లు సృష్టించవచ్చు అద్భుతాలు చేయవచ్చు వెరసి ప్రేక్షకులను మంత్ర ముగ్ధుల్ని చేయవచ్చు కంప్యూటర్ గ్రాఫిక్స్‌లో ప్రధానంగా 2డి, 3డి గ్రాఫిక్స్ అని రెండు విభాగాలుంటాయి 2డి గ్రాఫిక్స్‌లో ఒక సన్నివేశాన్ని ఒకచోట చిత్రీకరించి, దానినే పద్యాన్ని మార్చివేయవచ్చు ఉదాహరణకు హీరో హీరోయిన్లు పాటను స్టూడియోలో చిత్రీకరించి, దానికి విదేశాలలో చిత్రీకరించిన బ్యాక్‌గ్రౌండ్‌ను జతపరచవచ్చు ఇక త్రీడి గ్రాఫిక్స్ అంటే ఇది పూర్తిగా స్పెషల్ ఎఫెక్టులాంటివి దీనిద్వారా దర్శకుడి ఊహాలకనుగుణంగా ఎలాంటి సన్నివేశాన్నయినా కంప్యూటర్ ద్వారా గ్రాఫిక్ ఆర్టిస్టు సృష్టించగలడు మన తెలుగులో వచ్చిన 'అమ్మోరు' 'దేవి' 'హేరామ్' చిత్రాలలో స్పెషల్ ఎఫెక్ట్సును ఈ విధంగా రూపొందించినవే, సంచలన విజయం సాధించిన 'జురాసిక్ పార్క్', 'లయన్‌కింగ్' వంటి నవివూలు పూర్తియానిమేషన్ చిత్రాల కోవకు చెందినవే అయితే 5 నిమిషాల నిడివిగల ఎఫెక్టును సృష్టించాలంటే ఎందరో యానిమేషన్ ఆర్టిస్టులు కొన్ని నెలల తరబడి వర్కు చేయాల్సిఉంటుంది అందుకే ఈ విధానం చాలా ఖర్చుతో కూడుకున్నది

పైన పేర్కొన్న విభాగాలే కాకుండా ఇంకా అనేక విభాగాలలో చిత్రకారులు, శిల్పులు, కార్టునిస్టులు తమ సృజనాత్మక సృష్టితో వివిధ రంగాలలో పనిచేస్తున్నారు

ఆకలితో ఉన్నవాడే ఆర్టిస్ట్ అనుకునే రోజులకు కాలం చెల్లింది ఈ కంప్యూటర్ యుగంలో చిత్రలేఖనాన్ని ఆధారం చేసుకుని కొందరు కళాకారులు ఆర్థికంగా స్వతంత్ర జీవనం గడపడమే కాకుండా, మరీ కొంతమందికి జీవనోపాధి కూడా కల్పించగలుగుతున్నారు ఇది వరకు పత్రికల్లో అయిదారు వేల రూపాయల నెల జీతానికి పని చేస్తూ ఉన్న కొందరు చిత్రకారులు, ఇప్పుడు తమ ఇళ్ళ నుంచే స్వతంత్రంగా సేవలందిస్తూనో, సొంత సంస్థలు నడుపుతూనో లేక వెబ్ డెవలప్‌మెంట్ సంస్థల్లో పని చేస్తూనో నెలకు 20 వేల నుంచి 40 వేల రూపాయల వరకు ఆర్జించ గలుగుతున్నారు యువ చిత్రకారుల్లో చాలామంది ఆదాయం కోసం కమర్షియల్ ఆర్ట్‌పై ఆధారపడుతున్నా, ఆ స్వయం ఉపాధి పునాదిపై తమలోని సృజనాత్మక చిత్రకారుడిని కాపాడుకుంటున్నారు "గతంలో ఎన్నడూ లేని విధంగా ఇప్పుడు చిత్రకారులు తమ కళను ఒక వృత్తిగా చేసుకుని ఉన్నత ప్రమాణాలతో జీవితం గడపగలుగుతున్నారు ■

కళాసాగర్

# తెలుగులో చిత్రకళా గ్రంథాలు

ఫ్రాన్స్, జర్మనీ, ఇంగ్లాండ్ వంటి ప్రముఖ దేశాలతో వైశాల్యం, జనాభా విషయాలతో పోల్చుకుని చూస్తే, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం భారతదేశంలోని ఒక భాగంగా కూడా వాటికన్నా పెద్దదిగా భావించుకుని మనం సంతృప్తి పడవచ్చు అయితే ఇతర రంగాల సంగతి అలా ఉంచి కేవలం చిత్రకళా సాహిత్యం వరకే చూసినా మనం చాలా వెనుకబడి ఉన్నామని ఒప్పుకోవాల్సిందే

ఆయా దేశాలలో ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్ మున్నగు స్థానికభాషల సంగతి అలా ఉంచి, వారే ఆంగ్లంలో కూడా ప్రచురించిన చిత్ర కళాగ్రంథాల ముద్రణాస్థాయి, సంఖ్య ఆశ్చర్యకరంగా అనిపిస్తుంది మనకు కారణం తెలుగులో చిత్రకళా గ్రంథాలే అత్యల్పం అని కూడా ముద్రణా ప్రమాణాల దృష్ట్యా చాలా నాసిరకం ప్రచురణలే

విదేశాల్లో లక్షడాలర్లు ఖర్చుపెడితే ఇంకా కొనాల్సిన పుస్తకాలు మిగిలిపోతాయి అదే మన తెలుగులో అయితే లక్షనయాపైసలు పెట్టినా ఈ ఆర్ట్ మీద కొనడానికి సరైన పుస్తకాలు లేవు మన ఆర్థిక స్థోమత దృష్ట్యా ప్రమాణాల విషయం వదిలేసినా, సంఖ్యలోనూ వెనుకబడే ఉన్నాం

గత డబ్బైయేళ్ళలోనూ ప్రచురితమైన చిత్రకళా సంబంధిత గ్రంథాలు మొత్తం మీద వందకు దాటలేదనీ అనుకోవాలి సుమారు ఏభై – అరవై పుస్తకాలు వెలువడినప్పటికి నేడు మనకు అందుబాటులో ఉన్న పుస్తకాల వివరాలు అవి దొరికే చిరునామాలు దిగువున ఇవ్వబడినవి ఈ క్రమంలో నా దృష్టికి రాని పుస్తకాలు కూడా మరికొన్ని ఉండవచ్చు

### చిత్రకళ, శిల్పకళ, కార్టూనింగ్ రంగాలపై తెలుగులో వెలువడిన పుస్తకాలు

**1 కళ** (వార్షిక ప్రచురణ) 6 సంపుటాలు 1961లో చలసాని ప్రసాదరావుగారు హైదరాబాద్ లోని ఫైన్ ఆర్ట్స్ కాలేజి విద్యార్థిగా ఉన్నకాలంలో ప్రారంభించారీ వార్షిక ప్రచురణను తొలి సంపుటి ఆ కళాశాల 'తెలుగు విద్యార్థి సమితి' పక్షాన ప్రచురితం తర్వాత భారతకళాపరిషత్ ప్రచురణగా మరో అయిదు సంపుటాలు వెలువడినాయి ప్రతీ సంపుటం ఏదో ఒక ప్రత్యేక విషయంపై కేంద్రీకరించి రాసిన వ్యాసాల సంకలనంగా రూపొందటంతో 'కళ' తెలుగు చిత్రకళా సాహిత్య చరిత్రలో శాశ్వత స్థానం సంపాదించుకుంది 'కళ' తొలి సంపుటి వెలువడి నలభైయేళ్ళయినా కళాభిమానులీ ప్రచురణలను మరిచిపోక పోవడం, మరళారావాలని కోరడం వలన ఈ 6 సంపుటాలను కలిపి ఒకే వాల్యూమ్‌గా అక్టోబరు 2001 నాటికి పురర్ముద్రించి మనకందించనున్నారు చలసాని ప్రసాదరావుగారు

ప్రతులకు రేఖ ప్రచురణలు, బి-76,
జర్నలిస్టు కాలనీ, జూబ్లీహిల్స్,
హైదరాబాద్ - 500 033

**2 రసన** 248 పేజీలు, వెల రూ 60/-
ప్రథమ ముద్రణ 1989, ద్వితీయ ముద్రణ (రివైజ్డ్ & ఎన్‌లార్జ్‌డ్) 1999

సాహిత్య చిత్రకళా రంగాల సవ్యసాచి, బహుముఖ ప్రజ్ఞాశాలి చలసాని ప్రసాదరావు వ్రాసిన సాహిత్యం చిత్రకళపై విమర్శలు విశ్లేషణలు, చిత్రకారులు, రచయితల పరిచయాలు పరామర్శల వ్యాస సంకలనం

**3 శిల్ప చిత్ర జగత్తు** 166 పేజీలు వెల రూ 50/- ప్రథమ ముద్రణ 1999

ప్రముఖ నైరూప్య చిత్రకారులు, రచయిత అయిన పద్మశ్రీ యస్వీ రామారావుగారు

భారతీయ మరియు పాశ్చాత్య చిత్రకళ, చిత్రకారులపై వ్రాసిన వ్యాససంకలనం ఇవి 1963-64 సంవత్సరంలో భారతి మాసపత్రికలో ప్రచురించబడినవి

**4 య స్వీ (యస్వీ రామారావు)** 136 పేజీలు (10 రంగుల చిత్రాలతో) వెల రూ 60/-

ఆధునిక చిత్రకళలో ఆరితేరిన పద్మశ్రీ యస్వీ రామారావుకు జాతీయంగా అంతర్జాతీయంగా లభించిన అభినందనలు ఇన్నీ అన్నీకావు ఎందరో ప్రముఖులు, ఎన్నో పత్రికలు, ఆయనశైలీ వైశిష్ట్యం గురించి ప్రతిభాపాటవాల గురించి ఎన్ని మంచి మాటలు చెప్పారనీ అటువంటి కొన్ని అక్షరాంక్షింతలను పోగుచేసి వాటికి యస్వీ రంగుల హరివిల్లులను జోడించి తెలుగు పాఠకులకు అందించిన పుస్తకం ఇది యస్వీ గురించి తెలుగు వారు కూడా ఇంకా తెలుసుకోవాలనుకుంటే ఈ పుస్తకం తిరగేయాల్సిందే

**5 తొలినడకలు** 132 పేజీలు (10 రంగుల చిత్రాలతో) వెల రూ 25/-
ప్రథమ ముద్రణ 1999

1950-60 ప్రాంతంలో ప్రముఖ చిత్రకారుడు శ్రీ యస్వీ రామారావు వ్రాసిన కవితల సంకలనం ఆరు రంగుల చిత్రాలతో ప్రచురితం

**6 కాంతి రేఖలు** వెల రూ 60/-
ప్రథమ ముద్రణ 1999

ప్రఖ్యాత నైపుణ్య చిత్రకారులు పద్మశ్రీ యస్వీ రామరావు చిత్రించిన పదహారు రంగుల చిత్రాల ఆల్బమ్ ఇది

**7 కళాకాంతి** 86 పేజీలు వెల రూ 25/-
ప్రథమ ముద్రణ 1995

దశమతానా మహాసభల సందర్భంగా తానా' ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్స్ కమిటీ తరపున ప్రచురించబడిన ఈ పుస్తకంలో ఎనిమిది వ్యాసాలతో పాటు ఆనాటి చిత్రకళా ప్రదర్శనలో పాల్గొన్న ఇరవైరెండు మంది చిత్రకారుల పరిచయాలు వారి రంగుల చిత్రాలే కాకుండా ప్రముఖ తెలుగు చిత్రకారులు చిత్రించిన ముప్పై చిత్రాలు కూడా ప్రచురించబడినవి

**రెండు నుండి ఏడు వరకు ప్రతులకు** నవోదయ బుక్ హౌస్ ఆర్యసమాజం ఎదురుగా సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 027

**8 చిత్రకళా రత్నాలు** పేజీలు 160 వెల రూ 30/- ప్రథమ ముద్రణ 1987 ద్వితీయ ముద్రణ 1991

తెలుగు సంస్కృతి జీవన విధానాన్ని తమ చిత్రశిల్పాల ద్వారా యావత్ ప్రపంచానికి నిస్వార్ధంగా అందించిన త్యాగమూర్తుల జీవిత కళా విశేషాల్ని గ్రంధస్థం చేసి కళాభిమానులకు అందించారు శ్రీ సుంకర చలపతిరావు, స్వర్గీయ దామెర్ల రామారావు వరదా వెంకటరత్నం అడవి బాపిరాజుల దగ్గర నుండి నేటి బాపు యస్వీ రామారావు లక్ష్మాగౌడ్ సూర్యప్రకాష్ వైకుంఠం లాంటి సుమారు 120 మంది చిత్ర, శిల్పకారుల పరిచయ వ్యాసాలు, వారి చిత్రాలతో సహా ప్రచురించారు

**9 రంగుల రారాజు 'వడ్డాది పాపయ్య'** పేజీలు 56 వెల రూ 50/- ప్రథమ ముద్రణ 1994

గడచిన అర్థశతాబ్దంలో వేలకువేలు వర్ణచిత్రాలు గీచి ఆంధ్ర పత్రికా చిత్రకళారంగంలో పాఠకుల మనసు మీద చెరగని ముద్రవేసిన స్వర్గీయ వడ్డాది పాపయ్యగారి జీవిత విశేషాలతో పాటు ఆయన చిత్రించిన 20 రంగుల చిత్రాలను 20 నలుపు తెలుపు చిత్రాలను మన కందించారు శ్రీ సుంకర చలపతిరావు వ పా గారి పై వెలువడిన తొలి పరిచయ గ్రంధమైన ఈ పుస్తకం వ పా అభిమానులందరూ దాచుకోదగినది

**10 దామెర్ల రామారావు** పేజీలు 40 వెల రూ 30/- ప్రథమ ముద్రణ 1996

అనతికాలం జీవించి కలకాలం నిలిచే అత్యద్భుత చిత్రకళా ఖాండాల్ని సృష్టించి తెలుగు చిత్రకళకు ఖండాంతర ఖ్యాతి తెచ్చిన మహోన్నత చిత్రకారుడైన స్వర్గీయ దామెర్ల రామారావు జీవితం కళాకృషి చిత్రకళా శాలస్థాపన, ఆర్ట్గ్యాలరీ మొదలగు విషయాలను పద్దెనిమిది చిత్రాలతో ప్రచురించారు శ్రీ సుంకర చలపతిరావు

**11 'THE WAKING DREAMER IN COLOURS VADDADI PAPAIAH'**
పేజీలు 36 వెల రూ 100/-
ప్రథమ ముద్రణ 1994

'రంగుల రారాజు వడ్డాది పాపయ్య' పుస్తకాన్ని ప్రచురించిన శ్రీ సుంకర చలపతిరావు గారే ఈ పుస్తకాన్ని ప్రచురించారు తెలుగేతరవారు వ పా గురించి ఆయన చిత్రరచనా సామర్థ్యాన్ని గురించి తెలుసుకొనేందుకు వీలుగా ఇంగ్లీషులో ప్రచురించారు దీనిలో వ పా గారి రంగుల చిత్రాలు కూడా ముద్రించబడినవి

**ఎనిమిది నుండి పదకొండు వరకు** ప్రతులకు సుంకర చలపతిరావు కార్యదర్శి, చిత్రకళా పరిషత్, టి-62, గాంధగ్రాం పోస్టు, విశాఖపట్నం - 530 005

**12 రేఖా చిత్రాల్లో మన పండుగలు** 200 పేజీలు వెల రూ 50/- ప్రథమ ముద్రణ 1990

తెలుగు పత్రికలు పండుగల సందర్భంగా వేసే ప్రత్యేక సంచికలు చూసేవారికి వెల్లటూరి పూర్ణానందశర్మ గారు సపరిచితులు ఆయన వేసిన వందలాది రేఖా చిత్రాలలో కొన్నింటి సంకలనమిది తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురించిన ఈ పుస్తకం నవరంగ్ చిత్రకళానికేతన్ ప్రచురణ

**13 చిత్రకళా దీపిక** 100 పేజీలు
వెల 100/- ప్రథమ ముద్రణ 2000

నవరంగ్ చిత్రకళానికేతన్ వ్యవస్థాపక కార్యదర్శిగా గత మూడు దశాబ్దాలుగా చిత్రకళా రంగంలో కృషి చేస్తున్న వెల్లటూరి పూర్ణానందశర్మ గారు తమ సంస్థ సభ్యుల పరిచయ గ్రంధం ప్రచురించారు దీనిలో సుమారు 70 మంది చిత్రకారుల పరిచయాలు ఫోటోలతో సహా ప్రచురించారు

**12,13** ప్రతులకు వెల్లటూరి పూర్ణానందశర్మ, వ్యవస్థాపక కార్యదర్శి నవరంగ్ చిత్రకళానికేతన్, 7/2, చంద్రమౌళినగర్ గుంటూరు - 7

**14 కార్టూన్ కబుర్లు** 120 పేజీలు వెల రూ 60/- ప్రథమ ముద్రణ 1996

ప్రముఖ కార్టూనిస్టు, జర్నలిస్టు అయిన మోహన్‌గారు ప్రముఖ చిత్రకారుల గురించి, కార్టూనిస్టుల గురించి తనదైన శైలితో వివిధ సందర్భాలలో వ్రాసిన నలభైఏడు వ్యాసాల సంకలనం ఇది సందర్భానుసారంగా ఫోటోలు, కార్టూన్లు కూడా ప్రచురించారు ప్రచురణ పర్‌స్పెక్టివ్స్ - హైదరాబాద్‌వారు
ప్రతులకు నవోదయ బుక్ హౌస్ అన్నీ బ్రాంచీలలోనూ

**15 కార్టూన్లు నేర్చుకోండి** 94 పేజీలు వెల రూ 50/- ప్రథమ ముద్రణ 2001

కార్టూనిస్టు కావాలనుకునే వారికి సూచనలు, సలహాలు, ఐడియాలెలా వస్తాయి? తదితర విషయాలను సుమారు మూడువందల స్కెచ్‌లతో వివరిస్తూ వ్రాసిన ఈ పుస్తకం కార్టూనిస్టు కాబోయే వారందరూ తప్పక చదవాల్సినది
ప్రచురణ లిఖిత ప్రచురణలు
ప్రతులకు పల్లవి పబ్లికేషన్స్, విజయవాడ - 2

**16 బొమ్మ బొరుసూ** 174 పేజీలు
వెల రూ 60/- ప్రథమ ముద్రణ 1995

బాపూరమణల మొదటి బొమ్మ కథ అచ్చయి యాభైఏళ్ళయిన సందర్భంగా తెలుగు అమెరికా సంఘం వారి సమర్పణ, నవోదయ పబ్లిషర్స్ విజయవాడ వారి ప్రచురణ ఇందులో పత్రికలతో తప్ప పుస్తకంగా రాని రమణగారి రచనలు, బాపుగారు ఎప్పుడో రాసిన రెండు కథలూ, వివిధ రచనలకు బాపు గీచిన బొమ్మలు, 'తెలుగు వెలుగులు' శీర్షికకు బాపూగారు గీచిన ప్రముఖుల పోర్ట్రయిట్‌లు బాపు తీర్చి దిద్దిన కొన్ని లోగోలు ఈ పుస్తకానికి ప్రత్యేక ఆకర్షణ
ప్రతులకు నవోదయ పబ్లిషర్స్ అన్నీ బ్రాంచీలలోను

**17 నవ్వు ' నవ్వించు ''** 200 పేజీలు
వెల రూ 75/- ప్రథమ ముద్రణ 1999

ఉదయం ఆంధ్రభూమి పత్రికలలో పనిచేసి ప్రస్తుతం ఈనాడులో ఆర్టిస్టుగా కార్టూనిస్టుగా ఉన్న శ్రీవల్లి గత రెండు దశాబ్దాలుగా గీచిన కార్టూన్లలో సుమారు 450 కార్టూన్లను ఎన్నిక

చేసి ఈ కార్టూన్ సంకలనాన్ని ప్రచురించారు కార్టూన్లన్నిటికి కాప్షన్స్ తెలుగులోనే కాకుండా ఇంగ్లీషులో కూడా ఇవ్వడం దీని ప్రత్యేకత

ప్రతులకు దీప్తి పబ్లికేషన్స్, 6-3-94/ఎ/4, సాయిబాబా గుడి ఎదురుగా ప్రేమ్‌నగర్, ఖైతరాబాద్, హైదరాబాద్ - 500 004

**18 కళాసాహితీ తోరణం** 110 పేజీలు
వెల రూ 60/- ప్రథమ ముద్రణ 1998

కవి, చిత్రకారుడు, చిత్రకళా విమర్శకుడు అయిన శ్రీ మాకినీడి సూర్యభాస్కర్ వివిధ సందర్భాలలో వ్రాసిన వ్యాస సంకలనం ఇందులో చిత్రకళపై చిత్రకారులపై వ్రాసిన వ్యాసాలు కళాతోరణంగాను, సాహిత్య, భాషాశాస్త్ర వ్యాసాలు సాహితీతోరణంగాను ప్రచురించారు

ప్రతులకు శ్రీమతి యం సుభద్ర, సౌమ్య పబ్లికేషన్స్, 3-2-8-5, రాజాజి వీధి, కాకినాడ - 533 007

**19 శేఖర్ కార్టూన్లు** 40పేజీలు వెల రూ 10/-
ప్రథము ముద్రణ 1999

సమాజాన్ని జాగృతి పరచి ప్రజల్లో సామాజిక స్పృహ, చైతన్యాన్ని తీసుకురావాలనే సదాశయంతో ప్రపంచ వ్యాప్తంగా భయభ్రాంతుల్ని చేస్తున్న సదాశయంతో ప్రపంచ వ్యాప్తంగా భయభ్రాంతుల్ని చేస్తున్న 'ఎయిడ్స్' మహమ్మారి అంశంపై ప్రముఖ కార్టూనిస్టు శేఖర్ గీచిన కార్టూన్ల సంకలనమిది

ప్రతులకు శేఖర్ కార్టూనిస్టు, 23-16-32/2, లలితనగర్ రాజమండ్రి - 533 105

**20 కార్టూన్ & కమర్షియల్ ఆర్ట్ డిజైనింగ్ కోర్స్** 200 పేజీలు వెల రూ 50/-
ప్రథమ ముద్రణ 1999

కమర్షియల్ ఆర్టిస్టుగా, కార్టూనిస్టుగా, రచయితగా పేరొందిన లక్కోజు రమేష్‌బాబు రూపొందించిన ఈ పుస్తకంలో కార్టూన్స్ ఎలా గీయాలి? హావభావాలు, కమర్షియల్ ఆర్ట్‌లో డిజైనింగ్, గ్రీటింగ్ కార్డ్స్ డిజైనింగ్, బుక్ టైటిల్ డిజైన్స్, పెయింటింగ్ తదితర అంశాలను, వందకు పైగా బొమ్మలతో వివరించారు

ప్రతులకు శ్రీదేవి పబ్లిషింగ్ హౌస్, సత్యనారాయణపురం, విజయవాడ - 520 011

**21 జి శ్రీనివాస్ - కార్టూన్లు** 120 పేజీలు
వెల రూ 30/- ప్రథమ ముద్రణ 2000

లలిత కళల్లో ఒకటైన, నవరసాల్లో ఒకటైన హాస్యం ఈ రెండింటి అద్భుతమైన కలయిక కార్టూన్ కార్టూనిస్టు గుత్తుల శ్రీనివాసరావు గారు గీచిన 250 కార్టూన్ల సంకలనమిది

ప్రతులకు నవరత్న బుక్ సెంటర్ కారల్ మార్క్స్‌రోడ్ విజయవాడ - 2

**22 జన్మభూమి కార్టూన్లు** 40 పేజీలు
వెల రూ 10/- ప్రథమ ముద్రణ

జన్మభూమి స్ఫూర్తితో బహుముఖాభి వృధిని సాధించడానికి వీలుగా జనచైతన్యం కలిగించడానికి సృజనాత్మకతా దృష్టితో కార్టూనిస్టు శేఖర్ సంధించిన వ్యంగ్య రేఖాస్త్రాలు ఈ జన్మభూమి కార్టూన్లు

ప్రతులకు సాక్షి పబ్లికేషన్స్, డి నెం 75-6-30, ప్రకాష్‌నగర్, రాజమండ్రి - 533 105
ఫోన్ 468830

**23 చిత్రకళా స్వబోధిని** 100 పేజీలు
వెల రూ 73/- ప్రథమ ముద్రణ 2000

ప్రముఖ చిత్రకారులు ఎ వి యస్ సోమశేఖర్‌గారు రూపొందించిన ఈ పుస్తకంలో చిత్రకళా విద్యార్థులకు అనేక విషయాలు కేవలం బొమ్మలతో మాత్రమే వివరించారు

ప్రతులకు ఎ వి యస్ శేఖర్, ఆర్టిస్టు, 4-37, శాంతినగర్, కాటేరు - 533 105 ఫోన్ 435412

**24 కొంటె బొమ్మల బాపు** (కార్టూన్ సంకలనం) పేజీలు 102 వెల రూ 30/-
ఐదవముద్రణ 1995

తెలుగు చిత్రకళా చరిత్రలో ఉప్పెనలా విజృంభించి, మలయమారుతంలా వీచిన, గీచిన మరువలేని చిత్రకారుడు బాపు ఆయన అసంఖ్యాకంగా గీచిన కార్టూన్లను ఒక క్రమపద్ధతిలో సంకలితం చేసి ప్రచురించిన కార్టూన్ల పుస్తకాలు 2 సంపుటాలు

ప్రతులకు నవోదయా పబ్లిషర్స్, విజయవాడ -2

**25 జన్మభూమి కార్టూన్స్** పేజీలు 40
వెల రూ 10/- ప్రథమ ముద్రణ 2000

ప్రముఖ రచయిత్రి, కార్టూనిస్టు అయిన శ్రీమతి పచ్చిగోళ్ళ సుధ జన్మభూమి కార్యక్రమంపై స్పందించి గీచిన కార్టూన్ల సంకలనమిది

ప్రతులకు పచ్చిగోళ్ళ సుధ, రచయిత్రి, కార్టూనిస్టు, మెయిన్ రోడ్, ఆర్ ఎస్ భవన్, అమాలాపురం - 533 201

**26** దిగ్రేట్ ఆర్ట్ ఆఫ్ తెలుగు లెటరింగ్ పేజీలు 80 వెల రూ 35/- ప్రథమ ముద్రణ 1997

ప్రముఖ చిత్రకారుడు చిత్రకళోపాధ్యాయుడు అయిన శ్రీబుద్దా రూపొందించిన ఈ పుస్తకంలో తెలుగు అక్షరాలను అందంగా, వివిధమోడల్స్‌లో వ్రాసే విధానాన్ని రంగులు వాటి టెక్నికల్‌నేమ్స్‌ను, ప్రసిద్ధ చిత్రకారులు క్రీ శే జె యస్ రాజుగారి పరిచయంతో పాటు ఆయన చిత్రించిన కొన్ని చిత్రాలను కూడా పొందుపరిచారు

ప్రతులకు గొల్లపూడి వీరాస్వామిసన్స్, శ్రీసీతారామాబుక్ డిపో, కోటగుమ్మం, రాజమండ్రి - 533 101

**27 కాంతిమయి** పేజీలు 262, వెల రూ 50/- ప్రథమ ముద్రణ 1982

తెలుగులో చిత్రకళా సాహిత్యానికి పునాదులు వేసిన డా॥ సంజీవదేవ్ చిత్ర శిల్పకళల గురించి, కళాకారుల గురించి వ్రాసిన వ్యాస సంకలనమిది

ప్రతులకు సరళా పబ్లికేషన్స్, బోసురోడ్ తెనాలి - 522 201

**28** డాక్టర్ సంజీవదేవ్ సాహిత్యం 1) తెగిన జ్ఞాపకాలు 2) పరిచయ స్రవంతి ప్రథమ ముద్రణ 2000

తెలుగు ఆధునిక చిత్రకళారీతుల పరిచయ రచనలకు ఆద్యుడనదగిన శ్రీ సంజీవదేవ్ వందలాది వ్యాసాలు సంకలనాలుగా దాదాపు 16 గ్రంథాలు వెలువడినాయి తొలిగ్రంథం 'ఆసరేఖలు' అలనాటి కొన్ని వ్యాసాలను తెగిన జ్ఞాపకాలు, పరిచయ స్రవంతి పుస్తకాలుగా ప్రచురించారు డాక్టర్ సంజీవదేవ్ ఫౌండేషన్‌వారు

ప్రతులకు డాక్టర్ సంజీవదేవ్ ఫౌండేషన్, 4-13-8, ఐతానగరం, తెనాలి - 522 201

**29 తెనాలి శిల్పకళ** పేజీలు 100
వెల రూ 25/- ప్రథమ ముద్రణ 2000

ఆంధ్రాపారిస్‌గా పేర్గాంచిన తెనాలిపట్టణంలో నేటికి శిల్పకళలో అంతర్జాతీయ స్థాయిలో పేర్గాంచిన అనేక మంది శిల్పులున్నారు వంశపారంపర్యంగా ఈ రంగంలో కృషిచేస్తున్న శిల్పుల గురించి, శిల్పకళ గురించి తెలియజేసే గ్రంధమే తెనాలి శిల్పకళ

ప్రతులకు వజ్రాల రామలింగాచారి, వ్యవస్థాపక కార్యదర్శి సార్వజనీనమానవత, ఆత్మీయత సాంస్కృతిక సంస్థ 22-8-167, కొత్తపేట తెనాలి - 522 201

**30 రిధమిక్‌లైన్స్** పేజీలు 134
వెలరూ 100/- ప్రథమ ముద్రణ 1999

జానపద చిత్రకళలో తనకంటూ ప్రత్యేకశైలినీ, ఒరవడినీ సృష్టించుకొని, అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన డా॥ కాపురాజయ్య గడచిన ఏభై సంవత్సరాలలో గీచిన వాటి నుండి 154 స్కెచ్‌లు, నాలుగు మల్టీకలర్ పెయింటింగ్‌లతో ముద్రించిన ఈ రిధమిక్‌లైన్స్ పుస్తకాన్ని లలితకళా సమితి సిద్దిపేటవారు ప్రచురించారు వీటిలో దేవాలయాలకు సంబంధించిన స్కెచ్‌లు (రామప్పగుడి లేపాక్షి, కోణార్క్, ఖజురహో, హంపి) లతో పాటు గ్రామీణ జీవితాలను ప్రతిబించే అనేక స్కెచ్‌లు కాపురాజయ్యగారి ప్రతిభకు తార్కాణాలు

ప్రతులకు డా॥ కాపు రాజయ్య అధ్యక్షులు - లలితకళాసమితి, నెహ్రూనగర్ సిద్దిపేట - 502 103 ఎ పి

**31** డ్రాయింగ్ నుర్చుకోండి వెల రూ 40/- ప్రథమ ముద్రణ 1998

**32** పెయింటింగ్ నేర్చుకోండి వెల రూ 40/- ప్రథమ ముద్రణ 1998

ప్రముఖ కార్టూనిస్టు, ఆర్టిస్టు, చిత్రకళా రచయిత టీవీగారు చిత్రకళా విద్యార్థులకు

డ్రాయింగ్ గురించిన ప్రాథమిక విషయాలు, పెన్సిల్ స్కెచ్చింగ్ షేడింగ్ పెర్స్పెక్టివ్ డ్రాయింగ్, ఎనాటమీ తదితర విషయాలకు అనేక బొమ్మలతో వివరించారు డ్రాయింగ్ నేర్చుకోండి పుస్తకంలో పెయింటింగ్ నేర్చుకోనేవారికి ఉపయోగకరంగా కలర్ మిక్సింగ్, లైట్ అండ్ షేడ్స్, స్టిల్ లైఫ్ పెయింటింగ్, పోట్రయిట్స్ తదితర అంశాలను కొన్ని రంగుల బొమ్మలతో సహా వివరించారు పెయింటింగ్ నేర్చుకోండి పుస్తకంలో

ప్రతులకు పల్లవి పబ్లికేషన్స్ విజయవాడ - 2

**33** కార్టూన్స్ వేయడం ఎలా? పేజీలు 140 వెల రూ 100/-

ప్రముఖ కార్టూనిస్టు రచయిత సత్యమూర్తిగారు రూపొందించిన ఈ పుస్తకంలో కార్టూనిస్టు కావాలనుకునేవారికి ఏయే మెటీరియల్ కావాలి వివిధ రకాల నిబ్స్‌తో లైన్స్ ఎలా వేయాలి, కంపోజింగ్, కాప్షన్స్, సబ్జక్టు కార్టూన్లు తదితర అంశాలను వివరించారు స్వీయప్రచురణలో వెలవరించిన ఈ పుస్తకాన్ని హౌటు డ్రా కార్టూన్స్? పేరుతో ఇంగ్లీషులో కూడా ప్రచురించారు

ప్రతులకు సత్యమూర్తి కార్టూనిస్టు బి68/ఎఫ్ 5 విజయనగర్ కాలనీ హైదరాబాద్ - 57 ఫోన్ 3317473

**34** జీవితచ్ఛాయా దర్శనము పేజీలు 64 వెల అముద్రితం ప్రచురణ 1998

'చిత్రకళాకోవిద' అల్లూరి సత్యనారాయణ రాజుగారి జీవితవిశేషాలను గడచిన 40 సంవత్సరాలు చిత్రకళోపాధ్యాయుడిగా చిత్రకళా రంగానికి చేసిన సేవలను కొనియాడుతూ శ్రీ జొన్నవిత్తుల రామకృష్ణశర్మ వ్రాసిన ఈ పుస్తకంలో సత్యనారాయణ రాజుగారు గీచిన 22 నలుపు తెలుపు చిత్రాలతో పాటు ఏడు రంగుల చిత్రాలు కూడా ప్రచురించబడ్డాయి

ప్రతులకు ఎ సత్యనారాయణరాజు ఆర్టిస్టు రాయలం పోస్టు ప॥గో॥జిల్లా

**35) మీరూ ఆర్టిస్టు కావచ్చు** పేజీలు 144 సైజు 1/4 క్రౌన్ వెల రూ 120/-

చిత్రకళాభిరుచి సృజనాత్మకత ఉన్నవారికి హాబీగా నేర్చుకొనేవారికి అమెచ్యూర్ ఆర్టిస్టులకు ఫైన్ఆర్ట్స్ కాలేజీల్లో చదువుకొనే అవకాశంలేని వారికి, కమర్షియల్ ఆర్టిస్టులకు గ్రాఫిక్ ఆర్టిస్టులకు, డ్రాయింగ్ టీచర్స్‌కు అత్యంత ప్రయోజనకరంగా చిత్రకళలో బేసిక్ ప్రిన్సిపల్స్ మొదలుకొని నేటి కంప్యూటర్ యుగంలో అనూహ్యమైన మార్పులు తీసుకొచ్చిన డిజిటల్ ఆర్ట్, యానిమేషన్ తదితర అంశాలను సుమారు 500 చిత్రాలతో వివరణయిస్తూ సీనియర్ ఆర్టిస్టుల ఇంటర్వ్యూలతో ప్రముఖ చిత్రకారుడు చిత్రకళా విమర్శకుడు కళాసాగర్ రూపొందించిన ఈ పుస్తకం 2001 డిశంబరు నాటికి విడుదలకానున్నది

ప్రతులకు కళాసాగర్ ఆర్టిస్టు 21-11/1-1 మధురానగర్ విజయవాడ -11

## పత్రికలు

**1** చిత్రలేఖ (సాంస్కృతిక కళా మాసపత్రిక)

ప్రముఖ చిత్రకళోపాధ్యాయులు పుల్లయ్య కళానిలయం సెక్రటరీ యం రాజేంద్రప్రసాద్ గారి సంపాదకత్వంలో ఇంగ్లీషులో వెలువడుతున్న చిత్రలేఖ ఎనిమిది పేజీల పత్రిక ఇందులో చిత్రకళకు సంబంధించిన న్యూస్, చిత్రకకళా పోటీలు ఫలితాలు పిల్లలకు డ్రాయింగు పాఠాలు కలర్ కంటెస్టు తదితర అంశాలు ఉంటాయి సంవత్సర చందా రూ 60/- జీవిత సభ్యత్వం రూ 500/- చిరునామా ఎడిటర్ చిత్రలేఖ C/o పుల్లయ్య కళానిలయం 2-10-71/1 గణేష్ స్ట్రీట్ జనగాం - 506 167 వరంగల్ జిల్లా ఫోన్ (08716) 20760

**2** చిత్రకళ (ఆర్ట్ కల్చరల్ బై మంత్లీ న్యూస్ లెటరు)

ప్రతిమా ఆర్ట్ ఎగ్జిబిషన్ సొసైటీ సెక్రటరీ పి ప్రభాకర్‌గారి ఆధ్వర్యంలో శ్రీమతి పి సుజాత ఎడిటర్‌గా ఇంగ్లీషు తెలుగు భాషలో వెలువడుతున్న ఆర్ట్ & కల్చరల్ బై మంత్లీ న్యూస్‌లెటర్ ఈ చిత్రకళ ఇందులో కళా సాంస్కృతిక సమావేశాల వివరాలు చిత్రకారుల పరిచయాలు చిత్రకళా పోటీల వివరాలు కలర్ కంటెస్టు తదితర అంశాలలో రూపొందుతుంది

పత్రిక పేజీలు ఎనిమిది సంవత్సర చందా రూ 40/-, చిరునామా ఎడిటర్, చిత్రకళ, ప్రతిమా ఆర్ట్ ఎగ్జిబిషన్ సొసైటీ, 4-7-26, గాంధీ సెంటరు కొరిటిపాడు గుంటూరు - 7, ఫోన్ 326236

**3** స్మైల్ (కార్టూన్ ప్రత్యేక సంచిక)

ఆంధ్రజ్యోతి దినపత్రిక కార్టూనిస్టుగా పనిచేసిన శ్యాంమోహన్ సంపాదకత్వంలో వెలువడుతున్న కార్టూన్ పత్రిక స్మైల్ ఇప్పటి వరకు మూడు సంపుటాలు వెలువడిన ఈ పత్రికలో జాతీయ, అంతర్జాతీయ కార్టూనిస్టుల పరిచయాలు వారి కార్టూన్లు ఇంటర్వ్యూలు తదితర అంశాలతో తెలుగులో రూపొందుతున్న స్మైల్ మనకు కార్టూన్ పత్రికలు లేనిలోటు తీర్చగలదు

పత్రిక వెల 36/- చిరునామా స్మైల్ పబ్లికేషన్స్ నెం 8-3-825/5/5//3/1 సుభాష్‌నగర్ శ్రీనగర్‌కాలనీ హైదరాబాద్ - 73 ఫోన్ (040) 3750436

E-mail syamohan99@yahoo com

### కార్టూన్ వెబ్‌సైట్ - సరసం

ఇంటర్‌నెట్ ఆవిర్భావంతో పత్రికల పరిధి విశ్వవ్యాప్తం అయ్యింది తెలుగులో వార మాస పత్రికలు చాలా కాలంగా కార్టూన్లను ప్రచురిస్తున్నా డాట్‌కామ్‌ల రంగప్రవేశం తరువాత కార్టూనిస్టులకు మంచి ప్రతిఫలం లభిస్తోంది సరసం డాట్‌కామ్ బాపు, మోహన్ తదితర కార్టూనిస్టుల కార్టూన్లతో శ్రీరమణ రాసిన జోకులు ఫీచర్లతో వారం వారం ప్రపంచ వ్యాప్తంగా 70 దేశాల్లోని తెలుగువాళ్ళని అలరిస్తుంది 2000 సంవత్సరంలో ప్రారంభించిన ఈ సరసం డాట్‌కామ్‌ను ప్రపంచదేశాలలో ఉన్న తెలుగువారు నెలకి 5 లక్షల 97 వేలమంది చూస్తూన్నారంటే దీనికున్న ఆదరణ ఏ పాటిదో తెలుస్తూనే ఉంది మీరు చూడండి !

www sarasam com ■

## కళారంగాల్లో రాష్ట్రప్రభుత్వ 'హంస' అవార్డులు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1999లో తొలిసారిగా 'హంస అవార్డులు' పేరిట ప్రవేశపెట్టిన విశిష్ట పురస్కారాలను సాహిత్య, సంగీత, నృత్య, చిత్రలేఖన, గిరిజన కళా (ఫోక్ ఆర్ట్) రంగాల్లో విశిష్ట సేవలందించిన వ్యక్తులను బహూకరిస్తున్నారు అవార్డు గ్రహీతలకు ఒక్కొకరికి 30 వేలరూపాయల నగదు, హంస విగ్రహం ప్రశంసాపత్రం, శాలువా బహూకరిస్తారు ప్రప్రథమంగా ఈ అవార్డులను కాళీపట్నం రామారావు (సాహిత్యం), నేదునూరి కృష్ణమూర్తి (సంగీతం), సరళకుమారి (నృత్యం), కె లక్ష్మాగౌడ్ (చిత్రలేఖనం), చిందుఎల్లమ్మ (ఫోక్‌ఆర్ట్) అందుకున్నారు చిత్రకళలో 2000 సంవత్సరానికిగాను ప్రఖ్యాత జానపద చిత్రకారులు డా॥కె రాజయ్య 'హంస అవార్డు' అందుకున్నారు లలితకళల్లో ప్రధానమైన శిల్పకళకు కూడా 'హంస అవార్డు' ప్రకటిస్తే 'హంస అవార్డు'లకు సంపూర్ణత్వం వస్తుందని రాష్ట్రప్రభుత్వానికి 'ఆస్కా' విజ్ఞాపన

లీలావతి వై

# కాన్వాస్ నుంచి ... కాగితంపైకి ...

అద్భుతమైన ఓ చిత్ర కళాఖండాన్ని చూస్తాం మనం మనసంతా ఆనందంతో నిండిపోతుంది 'ఎ పీస్ ఆఫ్ ఆర్ట్ ఈజ్ ఎ పీస్ ఆఫ్ జాయ్' అన్న మాట గుర్తొస్తుంది ఏదో కొద్ది సేపు చూసినంత మాత్రానే మనసులో అంత అనందం చోటుచేసుకొంటే, ఆ కళాఖండాన్ని ఏకంగా సొంతం చేసుకొని, ఇంట్లోనే పెట్టుకొంటే, నిత్యమూ ఆనందం పొందవచ్చు గదా అనిపిస్తుంది కానీ అసలు చిత్ర కళాఖండాలు చాలా విలువైనవి ఒక్కోటీ వేల ఖరీదు చేస్తుంది దాంతో ఆసక్తి ఉన్నా అశక్తత అవరిస్తుంది ఇది చాలా సాధారణమైన విషయం కానీ ఆ చిత్రకళాఖండాలు అందుబాటులోనే ఉంటే ఎవరికివారు వాటిని ఎగరేసుకు తీసుకుపోతారు ప్రతి మనిషిలోనూ నిక్షిప్తమై ఉండే కళాభినివేశం కట్టలు తెంచుకొని, మంచి మంచి కళాఖండాలను సొంతం చేసుకొనేలా చేస్తుంది ఇలాటి అవకాశాన్ని కలిగిస్తున్నాయి స్క్రీన్ ఆర్ట్ ప్రింట్స్

## సామాన్యునికి చేరువలో!

స్క్రీన్ ఆర్ట్ ప్రింట్స్‌కు మామూలు భాషలో నిర్వచనం చెప్పాలంటే వాటిని కళాఖండాలకు 'ప్రతిరూపాలు' అనవచ్చు ఇంగ్లీషులో సెరిగ్రఫీ (Serigraphy) గావ్యవహరిస్తారు ఓతంజావూర్ చిత్రం, ఓ రాజస్థానీ చిత్ర కళాఖండం, మరో చార్-కోల్ పెయింటింగ్ లేదా మ్యూరల్ ఇవేవీ సాధారణమైన కళాఖండాలు కావు కాన్వాసుపై తమ ఆలోచనలకు ఎన్నెన్నో వన్నెచిన్నెలుదిద్ది, అందాలు తొడిగి, ప్రాణం పోసి మరీ ఆ కళాకారులు ఓ చిత్ర కళాఖండాన్ని తీర్చిది



సోదరులతో శాంతిఆర్ట్స్ అధినేత జైన్

ద్దుతారు ఒక బొమ్మ చిత్రించాలంటే వారాలు, నెలలు పట్టొచ్చు కూడాను అంతటి శ్రమశక్తితో రూపొందిన కళాఖండం ఖరీదు వేల రూపాయల్లో సామాన్యునికి అందుబాటులో లేనంతగా ఉంటుంది స్క్రీన్ ఆర్ట్‌ప్రింట్‌లో ఆ ఖరీదైన కళాఖండాలను కాగితంపై ముద్రించి, ఒరిజినల్ కళాఖండాల ఖరీదుకన్నా చాలా తక్కువ ధరలో సామాన్యానికి అందించవచ్చునని నిరూపించారు జైన్ సోదరులు

ఇలాంటి స్క్రీన్ ఆర్ట్ ప్రింట్స్ తయారీని ఒక యజ్ఞంలా నిర్వహిస్తున్నవారు దేశంలో బహుకొద్ది మంది మాత్రమే ఉన్నారు వారిలో మనరాష్ట్రంలో గుంటూరుకు సమీపంలోని రెడ్డిపాలెంలో



శాంతి ఆర్ట్స్ అధినేత పరాస్‌మల్ జైన్ ఈ రంగంలో నిష్ణాతులు నలభై సంవత్సరాల క్రితం కేవలం 15 రూపాలయ పెట్టుబడితో ఆయన ఈ రంగంలో దిగి, నేడు నూటయాభైమంది సిబ్బందితో, దేశవిదేశాలలో 500 మంది డీలర్లతో ఏడాదికి 15 నుంచి 20 లక్షల రూపాయలు అమ్మకాలు సాగిస్తున్నారు

ప్రస్తుతం శాంతి ఆర్ట్స్‌కు జైన్ నలుగురు సోదరులు సారధ్యం వహిస్తున్నారు రాజస్థాన్ నుంచి వచ్చి గుంటూరులో స్థిరపడ్డ ఈ కుటుంబానికి అనేక రాజస్థాని కుటుంబాల లాగానే చిత్రకళ వారసత్వం పరాస్‌మల్ జైన్ తండ్రి నుంచి పొగాకు వ్యాపారాన్ని స్వీకరించడానికి బదులు, తనకు తెలిసిన చిత్రకళనే వృత్తిగా ఎంచుకొని హోర్డింగ్స్, సైన్‌బోర్డ్స్ వేయటం మొదలుపెట్టి నెమ్మదిగా వ్యాపారంలోనూ, చిత్రకళలోనూ మెళకువలు నేర్చుకున్నారు పెరిగిన వ్యాపారం స్క్రీన్ ప్రింటింగ్‌లోకి మళ్ళింది స్క్రీన్ ఆర్ట్ ప్రింట్‌లో తొలుతగా తంజావూర్‌కి చెందిన శ్రీ రామపట్టాభిషేకాన్ని 24X21 సైజులో 13 రంగుల్లో హేండ్‌మేడ్ పేపరు మీద ముద్రించారు దానికి జాతీయ అవార్డు లభించడంతో, తర్వాత ఒడిస్సీ, కలంకారీ, రాజస్థానీ, కాంగ్రా వంటి విభిన్న రీతులకు చెందిన ఎన్నెన్నో పెయింటింగ్‌లను స్క్రీన్ ఆర్ట్ ప్రింట్స్‌గా ముద్రించి అనేక జాతీయ, అంతర్జాతీయ అవార్డులందు కొన్నారు

స్క్రీన్ ఆర్ట్ ప్రింటింగ్ ఇటీవలే బాగా ప్రాచుర్యం పొందుతున్న కళ, సాధారణంగా ఆఫ్‌సెట్ ప్రిటింగ్‌లో నాలుగు రంగులతో ముద్రించి ఒరిజినల్ ఎఫెక్టు తీసుకురావచ్చు కొన్ని ప్రత్యేక సమయాలలో ఆరు రంగులలో కూడా ముద్రిస్తారు అయితే స్క్రీన్ ఆర్ట్ ప్రింట్ అట్లాకాదు, ఒరిజనల్ పెయింటింగ్‌లోని ప్రతీ కలర్‌ను వేర్వేరు స్క్రీన్స్‌పై సెపరేట్ చేసి ఎనిమిది నుండి పదహారు రంగులతో ముద్రిస్తారు ఈ ప్రింటింగ్‌కు వాడే పేపరు కూడా మామూలు పేపరు కాకపోవడం విశేషం రసాయనాలేమీ లేని హేండ్‌మేడ్ కాగితాలపైన, సిల్క్ కాన్వాస్‌పైన చిత్రముద్రణ జరుగుతుంది దీని వల్ల రంగులు మాసిపోక, వెలిసిపోక బహుకాలం ఉంటాయి

విందులు, వివాహాలు, పుట్టినరోజు పండుగలు, సన్మానాలు వంటి ఎన్నెన్నో సందర్భాలకు బహూకరించడానికి అనువుగా విభిన్న రకాల శైలిలో సుమారు 150 రకాల కళాప్రతి రూపాలను రు 100 నుంచి 700 రూపాయలలో పరిధిలో ఉండి సామాన్యులు సైతం తమ చిత్రకళాభిరుచికి నిదర్శనంలా, నిలుపుకొనేలా ఉన్నాయి ■

**రంగులు**

రంగులు అన్ని భాషలు మాట్లాడతాయి

– అడిసన్

కళాసాగర్

# కళాత్మక గ్రంధాల(మ)యం

గ్రంథాలయమేమిటి కళాత్మకంగా ఉండడమేమిటి, ఖచ్చితంగా ఇది పుస్తకాల మ్యూజియమే అనుకుంటున్నారా ఎంతమాత్రం కాదండి, ఇది పుస్తకాల గ్రంథాలయమే కాకపోతే కాలక్షేపానికో, కథలు చదువుకోవడానికో మాత్రం కాదు ప్రపంచ వ్యాప్తంగా శోభిల్లుతున్న చిత్ర, శిల్ప కళాచరిత్రను తెలుసుకోవాలనుకునే వారికి, కళాభ్యాసం చేసేవారికి ఈ గ్రంథాలయం ఎడారిలో ఒయాసిస్సు వంటిది ఇంతకీ ఈ గ్రంథాలయం ఎక్కడుందో వ్రాయలేదుకదూ కళలకు కాణాచి అయినటువంటి విజయనగరంలో ఫ్రీ వరల్డ్ ఆర్ట్ లైబ్రరీ పేరుతో నడుపబడుతున్న ఈ లైబ్రరీ పెన్మెత్స రఘునాధరాజుగారి ఆధ్వర్యంలో నడువబడుతున్నది



సాధారణంగా ఏదైనా ప్రత్యేక శాస్త్రానికి సంబంధించిన పుస్తకాలు యూనివర్సిటీల్లోనూ, కాలేజీల్లోనూ, జర్నల్స్ రూపంలో లభ్యమవుతాయి పబ్లిక్ లైబ్రరీల్లో గాని, ప్రైవేట్ లైబ్రరీల్లో గాని ప్రత్యేక విభాగాల్లో పుస్తకాలు లభ్యమవడం అనేది బహు అరుదు మనదేశంలో నున్న శాంతినికేతన్, మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్, ప్రసిద్ధ మ్యూజియంలను స్వయంగా సందర్శించి, పులకించి తనూ అలాంటిదేదైనా చేయాలనే తపనతోనూ, కళాసేవలో తానూ పాలు పంచుకోవాలనే ధృడ సంకల్పంతో 15 ఆగష్టు 1991 సం॥ విజయనగరంలో తన అద్దె ఇంటిలోనే ఫ్రీ వరల్డ్ ఆర్ట్ లైబ్రరీని స్థాపించి దశాబ్దకాలంగా ప్రాణప్రదంగా కాపాడుకుంటూ, దినదినాభివృద్ధి చేస్తూ వస్తున్నారు ఈ లైబ్రరీలో ప్రస్తుతం వివిధ భాగాల్లో సుమారు రెండువేల (2000) పుస్తకాలున్నాయి

వీటిలో తెలుగు, ఇంగ్లీషుతో బాటు ఫ్రెంచి, గ్రీక్, డచ్, జర్మన్, స్పానిష్, ఐరిష్, బల్గేరియన్, జపనీస్, చైనీస్ భాషలలో కూడా స్వల్పముగా గలవు ఇందుగల చిత్రకళా గ్రంధ విభాగములు 1 డ్రాయింగు, పెయింటింగ్ (జనరల్ / అకడమిక్), 2 శిల్పము, హస్తకళలు, 3 చిత్రకళాశాలల ప్రాస్పెక్టస్‌లు, 4 కొన్ని ఆర్ట్ ఎగ్జిబిషన్ల కాటలాగ్స్, సావనీర్లు, 5 చిత్ర, శిల్ప హస్తకళాకారుల జీవిత చరిత్రలు, 6 చిత్ర కళా జర్నల్స్, మాగజైన్లు, 7 చిత్ర కళాసంబంధ చరిత్ర – సంస్కృతి, 8 చిత్రకళా సంబంధ భవన నిర్మాణ, పురాతత్వ శాస్త్ర గ్రంధాలు, 9 స్వదేశీ మ్యూజియంలు, ఆర్ట్ గ్యాలరీలు, 10 విదేశీ మ్యూజియంలు, ఆర్ట్ గ్యాలరీలు, 11 చిత్రకళా ప్రశంస, విమర్శ, 12 చిత్రకళా పరిశోధన



ఫ్రీ వరల్డ్ ఆర్ట్ లైబ్రరీ

ఉపాధ్యాయ వృత్తి నుండి పదవీవిరమణ చేసిన రాజు గారు చిన్ననాటి నుండి కళాభిమాని ప్రముఖ చిత్రకారులు కీ శే అంట్యాకుల పైడిరాజు వద్ద కొంత కాలం చిత్ర కళాభ్యాసం చేసినప్పటికి, ఆర్టిస్టు అవటం కంటే, తనలాంటి అనేక మంది చిత్రకళాభిమానులకు మార్గదర్శకంగా నిలచి చిత్రకళా సేవ చేయటం ఉత్తమమని నిర్ణయించుకొని స్వయంకృషితో ఈ లైబ్రరీని స్థాపించారు చిత్రకళా రచయితల నుండీ, మరియు స్వంత ఖర్చులతో వేలాది పుస్తకాలు సేకరించారు తాను ఎంతో శ్రమకోర్చి సేకరించిన ఈ పుస్తకాలను భావితరాలకు ఉపయోగపడే విధంగా ఒక భవనాన్ని నిర్మించి పుస్తకాలను పదిలపరచాలన్నది రాజుగారి ఆకాంక్ష ఈ ఫ్రీ వరల్డ్ ఆర్ట్ లైబ్రరీకి పుస్తకాలు గానీ, ఫర్నిచర్ గాని సమకూర్చితే ఆయా దాతల పేర్లు వ్రాసి లైబ్రరీలో చదువరుల సౌకర్యార్థం ఉంచబడతాయని శ్రీ రాజు తెలియజేసారు పుస్తకాలు గాని, ఆర్థిక సహాయం గాని వంపించేవారు క్రింది చిరునామాకు పంపించవచ్చు

చిరునామా

**పి రఘునాథ రాజు,**
వ్యవస్థాపకుడు, గౌరవ కార్యదర్శి,
ఫ్రీ వరల్డ్ ఆర్ట్ లైబ్రరీ, గాయత్రీ నగర్,
పద్మావతి నగర్ వెనుక ధర్మపురి రోడ్,
విజయనగరం - 535 002

ఈ విధమైన లైబ్రరీని స్థాపించి, కళాసేవ చేస్తూ స్వప్రయోజనాన్ని ఆశించకుండా, అహర్నిశలు గ్రంథాలయాన్ని గురించే ఆలోచించే శ్రీరాజు అభినందనీయులు, మార్గదర్శకులు ■

---

ఇకనోగ్రఫి

"కళ ప్రజలకు ప్రజలు కళకు సన్నిహితం కావాలంటే, మనం మొట్టమొదట సామాన్యప్రజల విద్యాస్థాయినీ, సాంస్కృతిక స్థాయినీ పెంచాలి

- లెనిన్

యస్ సత్యనారాయణ

# చిత్రకారులైన శాస్త్రజ్ఞులు

మోనాలిసా అంటే ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఒక చిత్రమని, ఆమె సౌందర్యానికి ప్రతీకని అందరికి తెలుసు లెయినార్డో లా-గియోకొండ అనే అమెను కూర్చోబెట్టి చిత్రించాడని చాలా కొద్దిమందికి తెలుసు చిరునవ్వుతో పాటు, శృంగారం, తృప్తి హుందాతనంతో నిండిన నేత్రాలే ఆ బొమ్మకు ఆకర్షణ

మిలాన్‌లో ఆయన వేసిన "The Last Supper " అనే కుడ్య చిత్రాన్ని చూడటానికి నేటికీ లక్షల కొద్దీ ప్రేక్షకులు వస్తూఉంటారు ఆయన కళాసృష్టిలో రసాత్మకత నిండి ఉంటుంది ఆయన గొప్ప చిత్రకారుడే కాదు, వాస్తుశిల్పికూడా వెనీసు రాజ్యపు ఇంజనీరు, డాములు కాలువల నిర్మాణం బాధ్యత కూడా ఆయనే నిర్వహించేవాడు డావిన్సీ గొప్పశిల్పి, చిత్రకారుడు, సంగీత వాగ్గేయకారుడు, తాత్వికుడు విమర్శకుడు, వైద్యశాస్త్ర అనుభవం వున్నవాడు జంతువుల, మనుష్యుల శరీర భాగాలను కోసి ఒక్కోఅవయవాన్ని స్కెచ్‌లు వేసి వైద్యరంగానికి ఎంతో సేవ చేసాడు ఆయన జీవ, భౌతిక, రసాయనిక, భూగోళ, గణిత శాస్త్రాలలో నిష్ణాతుడు

డావిన్సీ చనిపోయిన చోట క్లాస్-లస్ మ్యూజియం ఏర్పాటు చేసారు అక్కడగోడపై At the class lucaleonardo da Vinci invented the year 2000 అని వ్రాసి ఉంది ఆ మ్యూజియంలో దావిన్సి వేసిన హెలికాప్టర్లు పేరాచూటు నీళ్ళలో వెళ్ళే షిప్ వంటివి టేంక్‌లు, జలాంతర్గాములు ట్రాక్టర్లు సంబంధించిన వాటితో కలిపి 40 స్కెచ్‌లు వాటి మోడల్స్ అలంకరించారు ఆయన మేప్, మిషన్‌గన్ వంటివి ఎన్నో కనుగొన్నాడు

డావిన్సీ ప్రభావంతో 19వ శాతాబ్దంలో జాక్వస్ ఫాబ్లిన్ - గారిటియర్ -డి - అహగోటి అనే శాస్త్రీయ కళాకారులు అనాటమికల్ పెయింటింగ్స్ వేసారు స్టూడెంట్స్‌కు ఆర్టిస్టిక్ అనాటమీ అనేది నేర్పించారు వారి చిత్రాలు ప్రపంచమంతా ప్రసిద్దిగాంచాయి

ప్రస్తుతం అమెరికాలో ప్రపంచ ప్రఖ్యాతిగాచిన కళాకారుడు డా ఫ్రాంక్ నెట్టర్, ఆయన డాక్టర్ కూడా, ఆయన వేసిన అవయవ రంగుల చిత్రాలు - మెడిసిన్ విద్యార్థిలోకానికి ఎంతో ఉపకరిస్తున్నాయి

మనకు కనిపించే ప్రకృతిలోని అందాల రూపాలకు - ఊహాత్మకత జోడింది సౌందర్యవంతమైన శాశ్వతత్వాన్ని కల్పించేది చిత్రకళ దీన్ని అధ్యయనం చేసిన మహామనిషి వాల్టర్ నిక్స్‌మెయిర్ ఆయన ప్రొఫెషనల్‌గా జివాలజిస్ట్ కాకపోయినా - తన స్వయంకృషి తపన అభిరుచి గొప్ప సైంటిస్ట్‌గా చేసాయి ఆయన ప్రకృతిలో సంచరించే కీటకాల సృష్టినిర్మాణ వైఖరి పరిశీలించి పరిశోధించి పరవశించి చిత్రించిన చిత్రాలు-అనుభూతితో కూడిన రచనతో తానే స్వయంగా ముద్రించిన పుస్తకం ఇన్‌సెక్ట్స్ ఆఫ్ ది వరల్డ్ ఎంటమలాంజికల్ లిటరేచర్ - అందులో కీటకాల ఆకారం, వాటి అవయవ నిర్మాణం వెనుక ఉన్నభావం కదలిక - రంగులు, ఆరుపులు, ప్రవర్తన వాటి నివాసం నిర్మాణం మొదలగు విషయాలు విపులంగా వివరించారు

కళాసృజనలో తాదాత్మత ఉంటుంది అందులో వ్యక్తి స్థాయి భావం ఉండదు ఈ సంవత్సరం పోఖ్రాన్‌లో పేల్చిన బాంబుల ప్రభావంతో భారతదేశానికి న్యూక్లియర్ శక్తిగల దేశాలలో ఆరవ స్థానాన్ని కల్పించింది దీనికి మూల కారకుడు హోమి బాబా ఈయన ఎందరో కళాకారుల చిత్రాలను సేకరించారు స్వయంగా అయిల్ వాటర్ కలర్ పెయింటింగ్ స్కెచ్‌లు వేసారు ప్రకృతి సంబంధించినవి ఎక్కువగా కన్పిస్తాయి

కళాసృజనలో కళాసృష్టి అనుభవించే ఆనందాన్ని చూడాలంటే ఓ టి రవీంద్రన్‌ను అర్థం చేసికొంటే చాలు ఆయన గొప్ప బొటానికల్ పెయింటర్ అంతే కాదు మంచి రచయిత, వాతావరణ పరిశోధకుడు హార్టికల్చరిస్టు, ఫోటోగ్రాఫర్ కూడా ఆయన మొక్కల వద్దకు వెళ్ళి పూలను చిత్రిస్తారు మొక్కలు, పువ్వులు వేసిన ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారునిగా ప్రసిద్ధి చెందారు ఆర్కిడ్ జాతికి చెందిన సుసాన్స్ పువ్వును చిత్రించడానికి చాలా సంవత్సరాలుగా ప్రయత్నం చేస్తున్నారు అరుదైన పువ్వుల మొక్కలను పెంచుతున్నారు ఆయనను జేమ్స్ ఆడుబన్ ఆఫ్ ఇండియా అంటారు ఆడుబన్ వైల్డ్ బర్డ్ చిత్రించడంలో మంచి పేరు సంపాదించారు రవీంద్రన్‌కు లండన్ హార్టికల్చరల్ సొసైటి గ్రీన్ సీల్ మెడల్స్‌ను ఐదు అర్లు బహుకరించింది అలా ఎంతో ప్రఖ్యాతి గాంచిన వ్యక్తి రవీంద్రన్

శాస్త్రీయతకు, రసజ్ఞతకు మధ్య సమతుల్యాన్ని పాటిస్తాదు చిత్రకారుడు అటువంటి శాస్త్రీయ చిత్రకారుడు ఎన్‌లాన్ బీన్ – 1969లో అపోలో 12 లూనార్ మోడల్ పైలెట్ కమెండర్‌గా పనిచేసారు ఆయన సహజంగా లేండ్‌స్కేప్, స్టిల్‌లైఫ్ పోట్రైట్ చిత్రకారుడు 1981 లో బీన్‌గేప్‌సా అస్ట్రోనట్ ట్రైనింగ్ చీఫ్‌గా రిజైన్ చేసి The Spirit of light" అనే మొదటి పెయింటింగ్ స్పేస్‌కు సంబంధించినది వేసారు భూమి నుండి ఆకాశంలోకి వెళ్ళే రాకెట్ వేసారు "Hanmer and the feather అనే పెద్ద పెయింటింగ్‌లో అస్ట్రోనట్ డేవ్‌స్కాట్ చంద్రునిపై దిగడం చిత్రీకరించారు అప్పట్లో ఈ చిత్రాలను 12 వేల దాలర్లు పెట్టికొన్నారు

1965లో రష్యా స్పేస్ క్రాఫ్ట్ సోయూజ్‌లో మొట్టమొదటి కమెండర్‌గా వెళ్ళిన వ్యక్తి అలక్స్రెయేనోవ్ ఇతనూ స్పేస్ చిత్రకారుడే 1975లో బీన్ వోవ్ స్పేస్ క్రాఫ్టలో కలిసారు ఇద్దరి పెయింటింగ్ 1985లో పారిస్ సైంటిఫిక్ మ్యూజియంలో అలంకరించారు

1885లో పుట్టిన ఒక ఆదర్శవంతమైన సహజ చిత్రకారుడు చెస్లీ – బోనిస్టల్ రైట్ సోదరులకంటే 150 సంవత్సరాల ముందే జెస్లీ లిక్విడ్ ఫ్యూయల్ రాకెట్‌ను ఊహాత్మకంగా చిత్రించారు తన 17వ సంవత్సరంలో లీగ్ అబ్జర్వేటరీకి వెళ్ళి 36 అడుగుల రిఫ్రక్టర్‌లో 12 అంగుళాల జెయింట్ చూసి ఇంటికి రాగానే శనిగ్రహాన్ని పెయింట్ చేసారు తర్వాత చిత్రాలలో వాస్తును మేళవించి చిత్రించారు 1944 మే 22న ఆయన వేసిన పెయింటింగ్స్ అన్నీ ఒక పుస్తక రూపంలో ముద్రించారు ప్రజలలో స్పేస్ క్రేజ్‌ని పెంచారు ఆయన ప్లానెటరీ ప్లేట్స్‌తో గ్రహాలను నక్షత్రాలను ఫోటోలతో సమానమైన సహజత్వాన్ని ఉట్టిపడేట్లు చిత్రించి ప్రజలను ఆశ్చర్యంలో ముంచెత్తారు ఆయన ఊహతో వేసిన చిత్రాలు తర్వాత స్పేస్ పరిశోధనలకు ఉపయోగ పడ్డాయి అందుచే ఆస్టాయిడ్ 3129 బోన్‌స్టల్ పేరు పెట్టి శాస్త్రజ్ఞులు ఆయనకు కృతజ్ఞతలు తెల్పుకొన్నారు

ప్రకృతి సౌందర్యాన్ని పరిశీలనాత్మకంగా విశ్లేషించి నిక్షిప్త పరిచే వారిలో 1724లో పుట్టిన జార్జిస్టబ్ ఒకరు మంచి పోట్రేట్ చిత్రకారులు 1756 గుఱ్ఱాలను కొని డిసెక్షన్ చేస్తూ 18 నెలలు కష్టపడి స్కెచ్‌లు వేసి అనాటమీ ఆఫ్ హార్స్, అనే పుస్తకాన్ని ముద్రించారు స్త్రీ కడుపులోని బిడ్డపొజిషన్‌ని స్కెచ్‌లు వేసారు అట్లా జంతువుల అనాటమీ పై చాలా కృషి చేసారు స్టబ్ జంతువుపై కృషి చేసి అమెరికాలో బర్డ్‌మేన్‌గా కీర్తిగడించిన ప్రకృతి చిత్రకారుడు 18వ శతాబ్దానికి సంబంధించిన జాన్‌జేమ్స్ ఆడుబన్ 435 ప్లేట్లలో రంగులు తెలుపు, నలుపు, చిత్రాలలో స్వయం పరిశోధనతో, ముద్రించిన పుస్తకం Birds of America" ఆయన కృషిని ప్రశంసిస్తూ The greatest monument even offered to nature by art ఆయన పుస్తకంలో కీర్తించారు ఆసిస్‌కు సంబంధించిన ఫ్రాన్సెస్ వలె పక్షుల శాస్త్రజ్ఞానంతో సమానంగా చిత్రకళా ప్రతిభ ఉన్నట్లు పక్షి శాస్త్రజ్ఞులకా పుస్తకం బైబిల్ అంత పవిత్రమైనదని శ్లాఘించారు ఇట్లాగే ఎందరో శాస్త్రీయ కళాస్రష్టల కృషి నేడు మనం అనుభవించే వైజ్ఞానిక సౌకర్యాలకు పరిశోధనలకు దోహదం చేస్తున్నాయి నేటి శాస్త్రజ్ఞులకు చిత్రకళాభిలాష కల్గించాలనే భావనే ఈ వ్యాసరచనకు మూలము ■

కళాసాగర్

# చిత్రకళాపోటీలు - నిర్వహించే సంస్థలు

చిత్రకళా పోటీలలోనూ, ప్రదర్శనలలోనూ పాల్గొనాలని మనలో చాలా మందికి కోరికవుంటుంది అలాంటివాటిలో ఉత్సాహంతో పాల్గొంటే మన సామర్థ్యం మనకు తెలుస్తుంది, నైపుణ్యం చూపించగల్గితే మనకు బహుమతులే కాకుండా గుర్తింపు కూడా వస్తుంది ఇలాంటి పోటీలలో, ప్రదర్శనలలో పాల్గొనడం వల్ల ఇతర చిత్రకారుల చిత్రాలను చూచి మనకు తెలియని అనేక అంశాలను టెక్నిక్‌లను తెలుసుకోవచ్చు సాదారణంగా ఎక్కువ సంస్థలు పెయింటింగ్ పోటీలను మాత్రమే నిర్వహిస్తాయి కొందరు పెయింటింగ్‌తో పాటు శిల్పాలు, గ్రాఫిక్స్, బాతిక్ మొ॥నవి కలిపి నిర్వహిస్తారు కొన్ని సంస్థలు కార్టూన్ల పోటీ మాత్రమే నిర్వహిస్తాయి రాష్ట్రంలోనే కాక దేశంలోనూ, ఇతర దేశాలలోనూ ఇలాంటి పోటీలను ప్రదర్శనలను నిర్వహించే కొన్ని సంస్థల పేర్లు చిరునామాలతో సహా క్రింద ఇవ్వబడినవి వీటిలో కొన్ని బాలబాలికలకు మరికొన్ని అమెచ్యూర్ ఆర్టిస్టులకు, ప్రొఫెషనల్ ఆర్టిస్టులకు పోటీలు నిర్వహిస్తాయి వివరాలు కావలసినవారు ఆయా చిరునామాలకు వ్రాసి పొందవచ్చు

## STATE LEVEL

**1 Ankala Art Academy**
C/o Vani Tutorial College
Bhimavaram 534 201
W G Dist (A P)

**2 Bharateeya Kala Parishad**
Pamuru 523 108
Prakasam Dist
Founder B Radha Krishna Murthy

**3 The Andhra Academy of Arts**
M S Murthi Lalitha Kala Art Gallery
Mutyalampadu
Vijayawada 520 011

**4 Chitra Kalaniketan (art School)**
Raja Ravi Varma Marg
Akkayyapalem Road
Visakhapatnam 530 016

**5 Kala Darshini**
Institute of Fine Arts & Culture
Andhra Loyola College
Vijayawada 520 008

**6 Lalit Kala Parishad (R)**
(Affiliated of lalita kala Academy New Delhi)
H 18 70 11 Kotha Salipeta
Visakhapatnam 530 002
Hon Secretary G Kannarao

**7 Aditya Art Association**
3 101 Aditya Nagar 1st lane
Reddypalem Road
Guntur 522 509

**8 Ravi Varma Chitra Kalanikethan**
939 H2/C Vivekananda Street
Kovlagunta
Tirupati 517 501
Founder & Secretaty
S Satyanarayana

**9 Chitra Kala Samsad**
20/21 1 Frechpet
Machilipatnam 521 002
Secretary I V Rao

**10 Rajahmundry Chitra Kala Niketan**
Near Chinna Gandhi Statue
H No 46 10 27
Danavaipet Rajahmundry
Pin 533 103
Hon Secretary Mrutyunjaya Rao

**11 Prathima Art Society**
All India Youth and Child Art Exhibition
Redla Bazar Gandhi Street
Korıtipadu Guntur 7
Secretary P Prabhakar

**12 Navarang Chitrakala Niketan**
7/2 Chandra Mouli Nagar
Guntur 520 007 A P
Conducts All India Child Art
Amateur Art exhibitions and Regional Art exhibitions since 1970 71 founder Secretary
Vellaturi Poornananda Sarma

**13 Yong Envoys International**
139 Kakatiya Nagar
Hyderabad 500 008
Chief Pattern B A Reddy

**14 Korasala s Wonder Art World**
Co Operative Colony
Amalapuram 533 201
Convenor K V K Kaladhar

**15 Pullaiah Kalanilayam**
2 10 71/1 Ganesh Street
Jangoan 506 167
Warangal Dist
Secretary M Rajendra Prasad

**16 D P Roy Chowdary**
**Fine Arts Educational Academy**
No 23 52 Chimatavari St
Ramakrishnapuram
Solomon Centre Chirala 523 155
Founder & Secretary ULCHI

**17 Forum for Political Cartoonists of Andhra Pradesh**
Press Club Somajiguda Hyderabad
General Secretary Shyam Mohan



**18 VIKASAM**
(Visakha Cartoonists Association)
50 6 24/1 Srihari Veddhi
Seethampeta
Visakhapatnam
Phone 764832

**19 Konaseema Chitrakala Parishad**
Co operative Colony Amalapuram
Pin 533 201 E G Dt (A P)
Secretary K Sitarama Swamy

**20 The Galleria Art Club**
(All India Exhibition of Art)
18 70 11 Kotha Salipeta
Visakhapatnam 530 002
Convenor G C Sekhar

**21 Chitra Kala Parishad**
Shipyard Colony Gandhigram (PO)
Visakhapatnam 530 003
Secretary S Chalapathi Rao

**22 Vijaya Informations**
(All India Child Art Competitions)
21 16 Sarada Nagar P&T Colony (GAD)
Dilshuknagar Hyderabad 500 060
Founder Sri K Sunder Kumar
Asst Proffessor JNTU

**23 Devi Chaitanaya Memorial Child Art Competitions**
C/o S V Bala Kuteer
Syamala nagar Guntur 6 A P
Secretary Dr N Mangadevi

**24 The Goka s Art Society,**
7/16 Narasampet
Pin 506 132 Warangal Dt A P
Secretary G Nageswara Rao

**25 Lalitha kala Kshetram**
C/o P S R Telugu University
Nampalle Public Gardens
Hyderabad 500 004 A P
Organises State Level Art Exhibitions
External Service Registar (I/C)
R Veerabhadra Rao

**26 Hyderabad Art Society**
C/o Exhibition Society Grounds
Mukharamjahi Road
Hyderabad 1 A P

**27 Bapiraju Kala Peetham**
Redla Bazar Stabhalagaruvu
Guntur 522 006
Secretary S Vijayakumar

**28 A P Lalitha kala Academy**
Kala Bhavan, Saifabad
Hyderabad 500 004

**29 Bharatha Kala Parishad**
**Art Study Circle & Art Gallery**
70/2 Rt Prakasam Nagar
Opp Bgumpet Air Port
Hyderabad 500 016
President Dr P R Raju

**30 Andhra Artists, Sculptures and Cartoonists Association (AASCA)**
21 11/1 1 Madhura Nagar
Vijayawada 520 011
Gen Secretary Kalasagar

**31 A P Contemporary Art Society**
Drganier M V Rao
Drawing Teacher
Railway Mixed High School
South Lallaguda, Secundrabad - 500 017

**32 Lalit Kala Samithi**
Siddipeta PO Medak Dt A P
Conducts A P State Level Art Exhibitions for Artists and Children also
President Dr K Rajaiah

**33 Harivillu Art Academy**
Palakol 534 260, W G Dist
Secretary Bhaskar

## NATIONAL LEVEL

**1 Lalit Kala Akademy**
Ravindrabhavan
New Delhi 100 001
Organises National Exhibitions

**2 Victoria Technical Institute Exhibition & Sale of Arts & Crafts of India**
765 Anna Salai
Chennai 600 002
Ph 8523141

**3 Lalit Kala Akademi**
Rabindra Bhavan
New Delhi 100 001
Organises National Exhibition of Etc

**4 ULICHNA**
**(All India Child Art Foundation)**
B6/25 Near Resort Hotel 22 No Pqahak
PATIALA (Po) Pin 147 001 Punjab

**5 Kshitiz, Art Society,**
H No 642 Secto 4
U E Gurgaon 122 001 Haryana.
Secretary Sri Narendra Mehta

**6 All India Fine Arts and Crafts Society**
Rafi Marg New Delhi 110 001
Conducts Annual Art Exhibitions Etc

**7 Camlin Art Foundation**
Southern Region Art Exhibition
C/o Camlin Limited No 38 18
1st Floor 2nd Cross
Industrial Suburbs Yeshwanthpur
Bangalore 560 022

**8 The Art People" Exhibition Committee,**
B 11/645 Nehru Vihar
Dayalpur Delhi 94
Secretary Satya prakash Sharma

**9 Awantika International Child Art Copetitions**
86/4 5/14B Shiddipuram
Koralbagh Delhi - 05
Secretary Mr Sanjay Aggarwal

**10 Young Indians (National Drawing and Painting Competitions)**
C/o Ashirwad Meternity Nurshing Home
Near Bldg No 30, D N Nagar Andheri (W)
Mumbai 400 058
President Dr Satish Kelshikar

**11 Very Special Arts India,**
C 418 Defence Colony New Delhi
Pin 110 024

**12 The Director,**
South Central Zone Culture Centre
56/1 Civil Lines Nagapur 1 Maharastra
(Conducts All India Art Exhibitions)

**13 Working Artists of Varanasi,**
Plat No 284/1 Mahamanapuri Colony
I T I Road, Varanasi 221 005
Conducts All India Art and Exhibitions
Secretary S N Verma

**14 The Indian Academy of Fine Arts,**
Madan mohan Malaviya Road
Amritsar 143 001 Punjab
Office Secretary Virsingh Randhawa

**15 Lalit Kala Academi**
Regional Centre 170 Greams Road
Chennai 6 TN
Organise Art Exhibitions
Reg Secretary R M Sri Palaniappan

**16 "Shankha' All India Childern's Art Competitions**
69, Bhalamathadri Road,
Lalbagan, Beltolina, (Po)
Chandere Nagore West Bengal,
Pin 712 136

**17 National Drawing & Painting Centre,**
C/o Child Art College Subharun NTPC,
Farakka FH Qt No 1/110
Nabarum (Po) Murshidabad
Dt WB Pin 742 236
18 Indian Institute of cartoonists (IIC)
Bangalore

**19 Saroj Art & Culture Society**
Post Box No 106
27 K 209 Mihalvihar
Near International Public School
Naglod Delhi - 110 041
Secretary Rajnigupta

**20 Tamilnadu Ovia Nankalaikuzhu,**
C/o Govt Museum Campus
Patrthean Road
Egmore Chennai TN - 600 008
Organises Exhibitions of TN Artists in other states Exhibitions Exhibitions of Artists of other states in Tamilnadu Annual Artists Camps of different regions and external fi nancial admits manshoos etc

**21 South Central Zone Cultural Centre**
56/1 Opp MLA Hostel Civil Lines
Nagpur - 440 001 Ph 6712 520974

## DIRECTORS OF ZONAL CULTURAL CENTRES IN INDIA

**22 The Director Cultural Affairs Govt of Andhra Pradesh**
Ravindra Bharati Campus
kala Bhawan Hyderabad (AP)
Tel 242482 236440

**23 The Director Kannada & Culture**
14/3 A J C Road
Bangalore (K S )
Tel 2214379 2221412
**24 The Secretary M P Kala Parishad**
Tagore Marg Bhopal Tel 553483

**25 The Director Cultural Affairs Govt of Maharastra,**
Old Secretariat Building,
M G Road Fort, Mumbai - 400 032
(M S ) Tel 2832847

**26 The Director North Central Zone Cultural Centre**
14 C S P Singh Marg
Allahabad (U P)
Tel 623698 622833, 624475

**27 The Director Estem Zone Cultural Centre,**
Larkin Lane Calcutta 700 062
Tel 2480880

**28 The Director, North East Zone Cultural Centre**
Diphupar Dimapur
Nagaland 497112
Tel 22240 26573

**29 The Diector South Zone Cultural Centre**
Old Open Air Jail Buildings
Medical College Road
Thanjavur 613 004
Tel 40072

**30 The Director North Zone Cultural Centre**
Post Box No 80 Sheedsh Mahal
Patiala (Punjab)
Tel 211429

**31 The Director West Zone Cultural Centre,**
Gangaur Ghat Bagore Ki Haveli
Udaipar (Rajasthan) 313 001
Tel 28667 410539

## INTERNATIONAL LEVEL

**1 Satyrykon**
International Exibition
Rynek 39, 59 220 Legnica, Poland

**2 International Cartoon & Photo Festival Cultural Centrum**
Knokke Heist
Meerlan 32 B 8300
Knokke Heist

**3 Taejan International Cartoon Institute**
450 Wolpyongdong
Taejan City 302 281
Seoul Korea

**4 Euro - Kartoenalo**
Waregemesteen weg 113
B 9770 Kruishoutem Belgium

**5 International Cartoon Contest**
The Yomiuri Shimbun
1 7 1 Otemchi Chiyoda - KU
Tokyo Japan

**6 Centrum Sztuki - Teatre Drama Tyczny**
Rynek 39 59220 Legnica Poland

**7 House of Homour and Satire**
**5300 Gabrovo**
PO Box 104 Bulgaria

**8 Casino Beringen**
Kioskplein 15
3582 Beringen Belgium

**9 Cartoon Festival In Omiya**
International and Cultural Affairs Division
Omiya City Hall 3-1 Daimon Cho
Omiyashi Saitama - Ken Japan

**10 Shankar's International Children's Competition,**
Nehru House 4 Bahadur Shah Zafar Marg
New Delhi 110 002 India

## ART GALLERIES

**1 Abburi Kala Kendram**
Plot NO 107 Sector 8 M V P Colony
Visakhapatnam 530 017

**2 Patnaik Art Gallery**
4/19 Vidyanagar Guntur - 522 007
Ph 0833-350912

# స్పందన

ఆంధ్రకళాదర్శిని ప్రచురణపై రాష్ట్రంలోని పలువురు ప్రముఖ కళాకారులు స్పందించి పంపిన అక్షరాభినందనలు !

'ఆస్కా' అసోసియేషన్ ద్వారా ఆర్టిస్టు డైరెక్టరీని తీసుకురావడవం అభినందనీయం వ్యయప్రయాసల కోర్చి మీ సంస్థ మీరు చేస్తున్న కళాసేవ శ్లాఘనీయము !

**ఉల్చి,** ఆర్టిస్టు, శిల్పి, కవి, బాపట్ల

---

"కళాకారుల పరిచయాలు ఫోటోలతో సమగ్రంగా మీరు ప్రచురించ తలపెట్టిన డైరెక్టరీ గురించి చదివి చాలా ఆనందం కల్గింది అభినందించ దగ్గ మీ ఈ ప్రయత్నం విజయవంతం కావాలని మనసారా కొరుకుంటున్నాను "

**కుమారి రాగతిపందరి,** కార్టూనిస్టు, విశాఖపట్నం

---

"మీరెంతో బాధ్యతతో, భారీ శ్రమతో తలపెట్టిన ఈ 'ఆంధ్రకళాదర్శిని' ప్రచురణ ఎంతో మంది కళాకారులకు మేలు చేస్తుందని హృదయపూర్వకంగా కాంక్షిస్తూ "

**శేఖర్,** కార్టూనిస్టు, రాజమండ్రి

---

"ఆస్కా" ఆంధ్రకళాదర్శిని ప్రచురిస్తున్నందుకు నాకెంతో సంతోషము"

**సి యస్ యన్ పట్నాయక్,** శిల్పి ఆర్ట్‌గాలరీ, గుంటూరు

---

"మీ ప్రకటన 'ఆంధ్రభూమి' లో చూసాను 'ఆస్కా' ద్వారా మీరు చేస్తున్న యీ కృషి మనసారా అభినందించతగ్గది, ఆంధ్రులంతా గర్వించ తగ్గది "

నఖచిత్ర కళాబ్రహ్మ - **శిష్లా రామకృష్ణారావు,** విశాఖపట్టణం

---

"ఆంధ్ర కళాదర్శిని ద్వారా చిత్రకారులకు అన్నివిధాల లాభం చేకూరగలదని భావిస్తున్నాను మీ ప్రయత్నం సఫలీకృతం కావాలని అకాంక్షిస్తూ నూతన సంవత్సర శుభాకాంక్షలతో!"

**కరుణాకర్,** ఆర్టిస్టు, హైదరాబాద్

---

ఆస్కా చేస్తున్న కృషి అభినందనీయం ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఎందరో కళాకారులను ఒకచోట చేర్చి, వారి వివరాలు పదిమందికి పంచడంవలన మనలో మరింత సంఘీభావం, స్ఫూర్తి కలుగుతాయని మా ఉద్దేశ్యము బావితరాలకు కూడా విషయ సేకరణకూ, విషయ పరిశీలనకూ ఉపయోగపడతాయని ఆశిస్తూ మీ ప్రయత్నాన్ని మరోసారి మనసారా అభినందిస్తూ

**బలరాం,** కార్టూనిస్ట్, ఈనాడు, హైదరాబాద్

# ANDHRA ARTISTS, SCULPTORS & CARTOONISTS ASSOCIATION

A FLATFORM OF YOUNG GENERATION ARTISTS

With Best Compliments From

# ఎక్స్‌రే

## సాహిత్య సాంస్కృతిక సేవా సంస్థ

## 'X'-RAY LITERARY CULTURAL AND SERVICE ORGANIZATION

P B NO 340, SURYARAOPET VIJAYAWADA 2 HELLO (0866) 434223



వరల్డ్ నో టొబాకో డే సందర్భంగా ఎక్స్‌రే సంస్థ తరపున
డా॥ జి సమరం గారిని సత్సరిస్తున్న శ్రీయుతులు తుర్లపాటి
కొల్లూరి హజరత్తయ్య గుప్తా శ్రీమతి యార్లగడ్డ శైలజ

*President*
KOLLURI

*Gen Secretary*
M R S Prakasa Rao

---

*Vice Presidents*

Ln Vemula hajarattaiahGupta
Machiraju Purshotham

Ln Dr G V Poornachand
Ch V Subbaiah

---

*Secretary*
Jangam Sunil Kumar

*Treasurer*
Kalasagar

*Convinor*
Posana Seshagiri Rao

---

*Joint Secretaries*

Chalapaka Prakash
G Vijayalakshmi

Challagali Srinivasa Raju
Ch V S Brahmananda Rao

---

*Executive Body*

U Venugopal  B Sulochana  B Gayatri
G Mohan  B Chiranjeevi

## ప్రముఖ చిత్రకళా విమర్శకులు శ్రీ సుంకర చలపతిరావు

## రూపొందించిన చిత్రకళా గ్రంథాలు



చిత్రకళారత్నాలు
వెల రూ 30/-

**THE WAKING DREAMER IN COLORS VADDADI PAPAIAH**
Rs 100/-

రంగులరారాజు
వడ్డాది పాపయ్య
వెల రూ 50/-

దామెర్ల రామారావు
వెల రూ 30/-

For Copies
Ph 709119

Secretary
**CHITRAKALA PARISHAD**
T-62, GANDHIGRAM P O VISAKHAPATNAM-5